1956-69 – హైదరాబాద్ ఆకాశవాణిలో మహిళల కార్యక్రమాల నిర్వహణ, రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో రేడియో మహిళా మండలుల ఏర్పాటుకు కృషి.

1956 – హైదరాబాద్‌లో ఆంధ్ర బాలానంద సంఘం స్థాపన.

1969 – హైదరాబాద్‌లో ఆకాశవాణి ఉద్యోగ విరమణ.

1940-80 – ఆంధ్ర బాలానందం ఆధ్వర్యంలో రాష్ట్ర స్థాయిలో బాలలకు వివిధ పోటీల నిర్వహణ.

1969-80 – న్యూఢిల్లీ, మద్రాసు, హైదరాబాద్, వరంగల్, శ్రీశైలం, కర్నూలు మొదలైనచోట్ల బాలల వేసవి శిబిరాల నిర్వహణ.

1974-80 – "కథలు చెప్పే పాఠాలు" టెలివిజన్ కార్యక్రమాల సమర్పణ.

1974 – అఖిల భారత తెలుగు మహాసభల నిర్వహణ.

1975 – ప్రపంచ తెలుగు మహాసభలలో ప్రభుత్వ సత్కారం.

1979 – హైదరాబాద్‌లో సత్కారం.

1980 – తమ 72 వ ఏట అస్తమయం.





# భోగిపళ్ళు

[ న్యాయపతి కామేశ్వరి రచనలు ]



సంకలనకర్త

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య, పిహెచ్.డి.

సహాయకుడు

చొక్కాపు వెంకటరమణ



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

బర్కత్‌పురా - హైదరాబాద్ - 27

# BHOGI PALLU : Selected works for Chi Nyayapathi Kameswari (1908 – 1980)

---


*Published by* : Buddiga Subbarayan
Secretary, A. P. Baalala Akademi

*Compiler* : Dr. Velaga Venkatappaiah, Ph.D.

*Assisted by* : Chokkapu Venkata Ramana

*Editor* : Yeditha Kameswara Rao




భోగి పళ్ళు

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి ప్రచురణ : 10



మూల్యము :
రు. 6-00

# తొలిపలుకులు

బాలసాహిత్యము, బాలల కళాచైతన్యము - రెండున్నూ బాలల విజ్ఞానాభ్యుదయానికి రెండు బాహువుల వంటివి। రెండున్నూ రెండు మహోద్యమాలు।

అపురూపమైన శక్తి సామర్ధ్యాలు ఉన్నవారే ఈ ఉద్యమాలను చైతన్యవంతంగా ముందుకు నడప గలుగుతారు.

అప్పుడే పూచిన పూవుల్లాంటివారు బాలలు। అందానికి, ఆనందానికి వారు సెలవులు. సున్నితము, అనురాగ పూరితము అయిన హృదయాలే బాలలతో మెలగగగలవు. ప్రేమ ఎంత అవసరమో ఓర్పు కూడా అంత అవసరం.

అట్టి అభినివేశంకల కొద్ది మందిలో స్వర్గీయ శ్రీమతి న్యాయపతి కామేశ్వరి అక్కయ్యగారికి అద్వితీయమైన స్థానం ఉంది.

పిల్లలకోసం మృదు మధురమైన రచనలు చేయడమేకాదు, వాటిని పిల్లలకు నేర్పి, ప్రదర్శింపజేసి, వారిని కళాస్వరూపులుగా మలచిన మహాశిల్పి ఆమె.

బాల సాహిత్యాన్ని రసవంతంగా రచించిన వారు ఉన్నారు. కాని, ఆ సాహిత్యాన్ని బాలలకు అందించి, దానికి సార్థకత చేకూర్చడంతో పాటు, ఆనందకరమైన కళాసామ్రాజ్యాన్ని సృష్టించిన వారు చాలా అరుదు.

అక్కయ్యగారు అందులో అభివ్యక్తులు। ఆమె రచనలను పరిశీలించినట్లయితే బాలల యెడ ఆమెకు గల ఆప్యాయత, అనురాగము ప్రతి అక్షరంలోనూ ప్రతిఫలిస్తుంది. పిల్లలలో పిల్లలాగా-అక్కలాగ- కూడా సాహిత్యంలో యెడనెడ ఆమె సాక్షాత్కరిస్తుంది!

అక్కయ్యగారి రచనలలో ఆణిముత్తెములను సేకరించి, హారంలా గ్రుచ్చి, బాలల యెద నలంకరింపజేయాలనే ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమి వారి సంకల్పానికి ఈ పుస్తకం సర్వాంగ సుందరమైన బాహ్యరూపం.

ఇది అక్కయ్యగారి కీర్తి చిహ్నమే గాదు- బాలల కొక కళోపహారం!!

ఎమ్. ఎన్. విజయలక్ష్మీదేవి

హైదరాబాదు
స్త్రీ, శిశు సంక్షేమ శాఖామంత్రి

23-10-1981
అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

# వినతి

'ఆంధ్ర బాలానందం' అనగానే అక్కయ్య అన్నయ్య కళ్ళ ఎదుట నిలుస్తారు ఎవరికైనా సరే. అక్కయ్యకూ, అన్నయ్యకూ- ఆంధ్ర బాలానంద ఉద్యమానికీ అంతగా అవినా భావ సంబంధం ఏర్పడిపోయింది. వ్యక్తులు ఉద్యమాలకు మారు పేరు కావటం చరిత్రలో చాలా అరుదుగా కానవచ్చే సంఘటన.

అక్కయ్య కేవలం ఒక వ్యక్తి మాత్రమే కాదు; ఆమె ఒక మహాసంస్థ. అక్కయ్య అస్తమయం ఆంధ్ర బాలానంద ఉద్యమానికి తీరనిలోటు. లోటు ఏర్పడిన ఆ మహాసంస్థను మరల వ్యవస్థీకరించటానికి ఏ ఒక్కరో కాదు, పలువురు ముందుకు రావాలన్నది సహృదయుల ఆశయం.

అక్కయ్య సంస్మరణకు ఇప్పుడు ఏ విధమైన కృషి జరుగుతున్నా, ఆ ఆశయం అంతర్గతంగా ఉంటుంది. ఆ ఆశయం ఏ విధంగా ఫలించినా, ఆ కృషి చరితార్థమే అవుతుంది.

అక్కయ్య సంస్మరణ కృషిలో నాకు కూడా భాగం కల్పించిన స్త్రీ, శిశు సంక్షేమ శాఖామంత్రి, గౌరవనీయులు శ్రీమతి ఎమ్. ఎన్. విజయలక్ష్మీదేవి గారికి, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి కార్యవర్గం వారికి సర్వదా కృతజ్ఞుడను.

డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు

డైరెక్టరు, సాంస్కృతిక వ్యవహారాల శాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు

23-10-1981

# మనవి

మధుర మంజులమైన ఒక కళావిన్యాసం బాలసాహిత్యం!

"బాలరసాలసాల నవపల్లవ కోమల...." అనే పోతనా మాత్యుని సూక్తిసుధ బాలసాహిత్యంపట్ల అన్వర్థమవుతుంది!

బాలసాహిత్యం అతి సాధారణంగా కనిపించే ఒక అసాధారణ ప్రక్రియ! అనురాగపు ముద్దగా గోచరించే ఒక రసరాగాల వీణ!

ఆ వీణను ముద్దుముద్దుగా పలికించడం అందరికీ సాధ్యం కాదు. అమృతం తొణికిసలాడే హృదయమే తన సుతిమెత్తని కొనగోళ్లతో మీటి రసధునుల నొలికించగలుగుతుంది.

ఇట్టి రసధునుల సుధాపరిమళాలను గుభాళించే కళాలయం ఆంధ్రావని! బాలసాహిత్య కళామూర్తుల కైవారాలతో తెలుగు లోగిళ్లు బాలసరస్వతుల రంగభూములై భాసిల్లుతున్నవి!

కాగా- బాల సాహిత్యానికి ఆదర్శ పేటికలుగా ఉండగల కొందరు బాలసాహిత్యవేత్తల రచనలను క్రోడీకరించి సంకల నాలుగా ప్రచురించినట్లయితే- అనేక సాహిత్య ప్రక్రియలు వెలుగులోకి వచ్చి, ఉత్సాహపూరితులైన 'బాలరచయిత' లకు అవి ఎంతో స్ఫూర్తిని, ప్రోత్సాహమును ఇచ్చే కరదీపికలు కాగలవు.

ఇట్టి మహదాశయంతో కొందరు రచయితల వ్యక్తిగత సంకలనాలను ప్రచురించాలనే ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి వారి అభీష్టం చిగురించిన తొలి పూవు ఇది!

ఆట, పాట, మాటల మేటి స్వర్గీయ శ్రీమతి న్యాయపతి కామేశ్వరిగారు బాలసాహిత్య కళోద్యమాలలో అర్ధశతాబ్దిపాటు అవిరళమైన కృషిచేసి, అందరికీ ఆప్యాయమైన "అక్కయ్య"గా అమరులైనారు.

రేడియో అక్కయ్యగా ఆమె బాలల కార్యక్రమాల కోసం రచించిన రచనల - సంకలనమైన ఈ పుస్తకం బాలలోకానికి ఉత్తమమైన కానుక కాగలదు.

ఈ ప్రయత్నంలో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి 'రేడియో అక్కయ్య రచనల సంకలనం కమిటి' ని ఏర్పాటు చేసింది. ఈ పుస్తకం విషయంలో సముచిత నిర్ణయాలు తీసుకొని సహకరించిన ఆ కమిటి సభ్యులు శ్రీయుతులు పి యస్. ఆర్. అప్పారావు, కాంసన్ రామకృష్ణయ్య, శ్రీమతి లక్ష్మీరమణ గార్లకు, సంకలనకర్తలు డాక్టర్ వెలగా వెంకటప్పయ్య, చొక్కాపు వెంకటరమణ గార్లకు, ముద్రణాదికములలో తోడ్పడిన శ్రీ డి. రామలింగం గారికి మా కృతజ్ఞతాభినందనలు తెలియజేస్తున్నాము.

ఏడిద కామేశ్వరరావు

సంపాదకుడు, ప్రచురణల శాఖ

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

హైదరాబాదు

23-10-1981

# వి ష య సూ చి క

# రేడియో అక్కయ్య
# న్యాయపతి కామేశ్వరి

## జీవిత విశేషాలు

| | | |
|---|---|---|
| 1908 | - | విజయనగరంలో జననం. |
| 1921 | - | ఎస్. ఎస్. ఎల్. సి. విశాఖపట్టణం క్వీన్‌మేరీ బాలికల ఉన్నత పాఠశాలలో. |
| 1932 | - | బి. ఏ. విజయనగరం మహారాజా కళాశాలలో. |
| 1935 | - | శ్రీ న్యాయపతి రాఘవరావుతో వివాహం. |
| 1937 | - | టీచర్ ట్రెయినింగ్ (ఎల్. టి.) - మద్రాసు లేడీ విల్లింగ్‌టన్ ట్రెయినింగ్ కళాశాలలో. |
| 1939-42 | - | ఉపాధ్యాయ వృత్తి. |
| 1939-56 | - | మద్రాసు ఆకాశవాణిలో శ్రీ రాఘవరావుతో కలసి పిల్లల కార్యక్రమాల నిర్వహణ. |
| 1940 | - | మద్రాసులో ఆంధ్ర బాలానంద సంఘం స్థాపన. |
| 1945 | - | 'బాల' మాస పత్రిక స్థాపన. |
| 1950 | - | మద్రాసులో బాలల మహాసభల నిర్వహణ; 'మా ఇల్లు' సినిమాలోను, మరికొన్ని నాటికలలోను పాత్రపోషణ. |
| 1952 | - | ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమంగా బాలల గేయాలు, పాటలు హెచ్.ఎమ్.వి. గ్రామఫోను రికార్డుల తయారీలో పాల్గొన్నారు, |

# రేడియో అక్కయ్య



న్యాయపతి కామేశ్వరి

1908 - 1980

# రేడియో అక్కయ్య చెప్పిన ఆత్మకథ

ఆడపిల్ల పుట్టిందంటేనే "ఆ....ఆడపిల్లా?"అని దీర్ఘాలు తీసుకుంటూ నిరాశపడే రోజులవి. అదే మొగపిల్లవాడయితే అందరూ ఎంతో గొప్పగా సంతోషించేవారు. పుట్టుకతో ప్రారంభమయ్యేది ఆడపిల్లలంటే నిరసనభావం. అలాంటి రోజుల్లో విజయనగరంలో పుట్టాను. "పుట్టిన పిల్లకి జాతకం చూపించండి" "అని మా అమ్మమ్మ అంటే "ఆ....ఆడపిల్లకి జాతకం కూడా ఎందుకు?" అంటూ రుసరుస లాడుతూ వెళ్ళిపోయాడట మా తాతయ్య. ఆఖరికి ఎలాగయితేనేం, ఒక గొప్ప సిద్ధాంతిచేత జాతకం రాయించిందట మా అమ్మమ్మ. మా తాతయ్య ఆ జాతకం చూసి "ఛా! ఇదేం జాతకం! పెద్దచదువులూ, పెద్ద ఉద్యోగాలూ, మొగపిల్లాడికిగాని ఆడపిల్లకేమిటీ" అంటూ రెండు చేతుల్తో ఆ జాతకం కాయితాల్ని ఫర్రున చింపివేశాడట.

నేనే ప్రథమ సంతానమవడంచేత మా అమ్మ నన్నెంతో గారాబంగా పెంచింది. స్కూల్లో చేరేంతవరకూ ఇంటి దగ్గర మా అమ్మే నా గురువు. అమ్మ దగ్గర 'తారంగం - ఏనుగొచ్చింది, కాళ్ళాగజ్జి'లాంటి బాలగేయాలెన్నో నేర్చుకున్నాను నేను. రాజు - ఏడుగురు కొడుకులూ, ఈగకథ - పిచ్చుక కథ అమ్మ చెబుతుంటే ఊ కొడ్తూ శ్రద్ధగా వినేదాన్ని. ఐదో ఏట అక్షరాభ్యాసం చేయించాలని మా అమ్మ కోరిక-కానీ మా తాతయ్య 'ఆడపిల్లకి అక్షరాభ్యాసం ఎందుకమ్మా!' అని అనేవాడట. మా అమ్మ మాత్రం పట్టుదలతో మా ఇంటికి దగ్గరలో ఉన్న వీధి బళ్ళోని అధ్యాపకులు మంగయ్య మేస్టారితో

అక్షరాభ్యాసం చేయించి బియ్యంలో అక్షరాలు దిద్దించారు. నేను అక్షరాలుదిద్ది గురువుగారికి దణ్ణంపెట్టాను. తరువాత ఆ బళ్ళో పిల్లలకి కొత్త పలకా బలపం తలొకటి, పప్పు బెల్లాలు, లడ్డూలు, పంచిపెట్టినట్లుగా లీలగా జ్ఞాపకం ఉంది. మంగయ్య మేష్టారు "బాగా చదువుకుని పెద్దదానివై పేరు పొందమ్మా" అని దీవించారు. మా బడిలో ఒకచిన్న పెరడుం డేది. ఆ సన్నటి ఇసుకలో మా మేష్టారు అక్షరాలు మా చేత పలికిస్తూ వేళ్ళతో దిద్దించేవారు. ఆ మేష్టారు గుండ్రంగా రాసే వారు. మేము కూడా వారు రాసినట్లు గుండ్రంగా రాయాలని అనుకునే వాళ్ళం. 'మేష్టారి రాతబాగుంటే పిల్లల రాత గూడా బాగుపడుతుంది' అన్నమాట నిజమనిపిస్తోంది.

నేను చిన్నతనం నుంచీ అన్ని పనులు ఎడంచేత్తో చేసే దాన్ని, రాయడం కూడా ఎడంచేత్తోనే, మా క్లాసుటీచరు అది చూచి కోప్పడ్డారు. కొడతారేమోనని బలపం కుడిచేత్తో పట్టు కున్నా, కానీ ఆ చేతితో రాయడమే రాలేదు, ఏమీ ఎరగనట్లు కుడిచేత బలపం పట్టుకుంటూ ఎడంచేత్తోనే రాస్తూ అక్షరాలు కుదిరిస్తే "ఆ....అలా కుడిచేత్తో రాయాలి. తెలిసిందా?" అంటూ వెళ్ళిపోయేవారు మా టీచరు. అలా వీధి బళ్ళో ఒకటో క్లాసు వరకు చదివి బడి మానేశాను. విజయనగరంలోనే ఓ బాలికల పాఠశాలకెళ్ళి చదువుకుంటానని అమ్మతో చెప్పాను. మా అమ్మ సరే అంది. ఆ బడి ఎంతో బాగుందనిపించింది, ఈ వీధిబడికంటే. ఆ బళ్ళో నాల్గో తరగతి పాసయ్యాను.

మా దొడ్డమ్మ-అంటే మా పెత్తల్లి సెలవుల్లో మా ఇంటి కొచ్చి విశాఖపట్నంలో నన్ను చదివించమని మా అమ్మకు సలహా ఇచ్చింది. నాకు అక్కడ చదవాలనే ఆశపుట్టింది. కాని అమ్మని విడచి ఉండలేనే! మా అమ్మ నన్ను విడిచి

ఉండలేనని కన్నీళ్లు పెట్టుకుంది. చివరకు అక్కడికి వెళ్ళే చదువుకుంటానని పట్టుపట్టాను. అప్పటినించి నా విద్యాభ్యాసంలో కొత్తఘట్టం ప్రారంభమయింది. హాస్టల్ జీవితం ప్రారంభమయింది. క్లాసులో ఫస్టు సెకండు మార్కులు మా హాస్టల్‌పిల్లలకే రావాలని దీక్షతో అంతా కష్టపడి చదివేవాళ్ళం.

ఒకసారి క్లాసులో మా టీచర్ ప్రశ్నలు వేస్తుంటే కొందరు చెప్పలేకపోయారు. టీచరుకి కోపం వచ్చి తెల్ల కాగితం మీద ASS అని పెద్ద అక్షరాలతో రాసి వాళ్ళ వీపులకు కట్టి బయట వరండాలో నిలబెట్టారు. ఆ అమ్మాయిల్లో మా హాస్టలు గ్రూపు అమ్మాయి ఒకతె ఉంది. ఆమె ఆ అవమానం భరించలేక గుడ్ల నీళ్ళు కుక్కుకుంటుంటే చూడలేక నేను లేచి "టీచర్! ఆ కాగితం ASS ఆ అమ్మాయికి బదులు నాకు కట్టండి" అన్నాను. వెంటనే మా గ్రూపు పిల్లలంతా నా కంటే నాకు అని లేచారు. 'ఆమెను విడిచిపెట్టండి' అన్నారు. అపుడు టీచర్ "మీ కంత అభిమానం ఉంటే మీరంతా ఆ అమ్మాయికి పంచి మార్కులు వచ్చేట్లు చూడండి" అని గద్దించారు. ఆ రోజునుంచి మా జట్టు పిల్లలంతాకలిసి పాఠాలు రానివాళ్ళకు పాఠాలు నేర్పడం మొదలుపెట్టాం. మా జట్టంతా యస్. యస్. యల్. సి. వరకు అట్లే చదివాం.

నాకు చిన్నప్పటినించీ లెక్కలంటే ఇష్టం. లెక్కల్లో నాదే ఫస్టుమార్కు. ఎప్పుడైనా లెక్కల టీచర్ రాకపోతే హెడ్మిస్ట్రెస్ నన్నే లెక్కలు చెప్పమనేవారు, నేను లెక్కలు బోర్డుపై వేస్తూ అర్థం చెబుతుంటే 'అచ్చంగా టీచరులాగున్నావే' అని నా స్నేహితురాళ్లు అనేవారు. అప్పుడు నాకెంత గర్వంగా ఉండేదో!

ఒక్కోరోజు సెలవునాడు మా జట్టువారంతా కూర్చుని "చదువు పూర్తయాక నువ్వేమవుతావ్ ? నువ్వేం చేస్తావ్ !" అని ప్రశ్నించుకునే వాళ్ళం. అంతా నేను డాక్టరు - నేను యాక్టరును అవుతానని చెప్పేవారు. నేను మాత్రం టీచర్నవుతాను అనేదాన్ని, అది విని అంతా నవ్వేవారు. అదేమిటో టీచరు అవ్వాలంటే చిన్నతనం నుంచీ నాకెంతో ఇష్టంగా ఉండేది. ఎందుకో ? ఏమో ? మరి.

## కాలేజీ చదువు

స్కూలు పైనలు ఫలితాలు వచ్చాయి. నేనూ, నా స్నేహితులు అప్పలనరసమ్మా, సుభద్ర మంచి మార్కులతో పాస్ అయాం. మా ముగ్గురికి కాలేజీ చదువు చదవాలని ఉండేది. ఇప్పుడు ఏం చేయడం? ఆ రోజుల్లో ఆడపిల్లలకని ప్రత్యేకంగా కాలేజీలు మా ప్రాంతంలో లేవే! కాకినాడలో పిఠాపురం మహారాజా కాలేజీ ఉండేది, అందులో ఆడపిల్లలూ మొగ పిల్లలూ కలిసి చదువుకునేవారు. మా సుభద్ర ఊరు కాకినాడే గనుక ఆ కాలేజీలో ఇంటర్మీడియట్‌లో జాయిన్ అయింది. మమ్మల్ని ఇద్దర్నీ కూడా వాళ్ళ ఊరు వచ్చి, వాళ్ళింట్లో ఉండి చదువుకోమని చెప్పింది. కాని యుక్తవయసు వచ్చిన మా వంటి పిల్లల్ని ఆ రోజుల్లో మా అమ్మలూ నాన్నలూ పై ఊళ్ళకి పంపి చదివిస్తారా? మదరాసులో ఆడపిల్లల కాలేజీ ఉందిగాని, అంతదూరం పంపడం, ఆడపిల్లలకోసం అంత సొమ్ము వెచ్చించడం కానిపని. ఇక పెద్ద చదువులమీద ఆశ మాని, టీచరు ట్రైయినింగ్‌కి వెళ్ళమని మా అమ్మ చెప్పింది. కాని నేను మాత్రం ఎన్నికష్టాలు పడైనా సరే బి. ఎ. చదవాలని నిశ్చయించుకున్నాను. ఇంతలో మా అదృష్టవశాత్తూ దినపత్రికలో ఒక ప్రకటన పడింది. "విజయనగరం మహా

రాజావారి కళాశాలలో ఇక మీదట ఆడపిల్లల్ని కూడా చేర్చుకుంటారు'' అని. ఆ వార్త చూశాను. సంతోషంతో ఒక్క గంతు వేశాను.

ఇంక నా కాలేజీ చదువు గురించి క్లుప్తంగా చెప్పాలంటే - విజయనగరం కాలేజీలో ముగ్గురం చేరాం. నేనూ, నా మిత్రురాలు అప్పల నరసమ్మ, బరంపురం నుంచి వచ్చిన చూడికుడు తమ్మ. ముగ్గురు ఆడపిల్లలు కాలేజీలో చేరారనే వార్త ఊరంతా ప్రాకిపోయింది. మొదటిరోజున నేను కాలేజీకి వెళ్తూ ఉంటే రోడ్డుకి ఇరుప్రక్కలా వెళ్లే జనం నావేపే వింతగా చూడ్డం, ఇళ్ళలో ఉన్న ఆడవాళ్ళు గబగబ పరుగెత్తుకొంటూ వీధి గుమ్మంలోకి వచ్చి నిలబడి నా వంకచూసి. "అదుగో! ఆ పిల్లే కాలేజీలో ప్రవేశించింది. మగపిల్లల్తో సరిగా చదువుతుందట'' అనుకునేవారు. నేను ఇటూ అటూ చూడకుండా తిన్నగా కాలేజీ గేటులోనికి ప్రవేశించేసరికి మగపిల్లలు గుంపులు గుంపులుగా నిలుచొని ఏదోగా చూచేవారు. చెప్పొద్దూ నాకు ముచ్చెమటలూ పోసి, అడుగులు తడబడ్డాయి కూడా! ఇక క్లాసు హాలులో మా ముగ్గురికోసం, ఒక ప్రక్కగా దూరంగా ఒక బెంచీ వేశారు. మేం ముగ్గురం ఆ బెంచీమీద కూర్చున్నాం. మా వెనక బెంచీలో ఉన్న ఒక కొంటె కుర్రాడు మాకు వినిపించేటట్టు "వీళ్ళు అంటరాని వాళ్ళురా'' అని అన్నాడు. ఆ పరిస్థితుల్లో మాకు క్లాసులో మొగపిల్లలవేపు చూడ్డానికే భయం. అధ్యాపకుల వేపు చూచి, తెలియనిది అడగడానికి అసలే భయం. క్లాసులో అధ్యాపకులు చెప్పింది చెవులప్పగించి వినడం, ఇంట్లో మా అంతట మేం కష్టపడి చదువుకోవడం, పరీక్షల్లో మాకు తెలిసినది రాయడం. ఇలాగే ఇంటర్మీడియట్ రెండు సంవత్స

రాలూ పూర్తి చేశాము. పబ్లిక్ పరీక్షలో నేను పాసయ్యాను. అప్పల నరసమ్మ తన కోరిక ప్రకారంగా డాక్టరు చదువు చదవడానికి మదరాసు వెళ్ళింది. చూడికుడుతమ్మ టీచరు ట్రెయినింగ్‌కి వెళ్ళింది, నేను మాత్రం బి. ఎ, క్లాసులో ప్రవేశించి, రెండేళ్ళు చదివి పాసయ్యాను.

ఆ రోజుల్లో మా విజయనగరం మహారాజావారి కాలేజీలో బి. ఎ. పాసయిన మొట్టమొదటి మహిళను నేనే. బి. ఎ. పాసయ్యాక, రాజమండ్రివెళ్ళి బి. ఇడి. ట్రెయినింగు అవుదామంటే ఆర్థిక స్తోమత లేకపోయింది. మా కుటుంబం చాలా బీద కుటుంబం, ఏమి చేయుటకు తోచక, ఆరాటపడుతున్న సమయంలో, నా స్నేహితురాలైన ఎస్. సుభద్రమ్మ (ఇప్పుడు పరమపదించినారు) నూజివీడు ఎస్టేటులో కపిలేశ్వరపురం జమీందారిణి జగదీశ్వరమ్మగారికి ఇంగ్లీషు నేర్పుటకు ప్రవేశపెట్టారు. ఆ ట్యూషన్ జీతంలో కొంత మిగుల్చుకొని, బి.ఇడి. చదువుదామని కోరిక, కాని ఈ ఉద్యోగంలో ఉంటూండగానే, న్యాయపతి రాఘవరావుగారితో 1935 లో నా వివాహం జరిగింది.

వివాహానంతరం నూజివీడు వదలి, ఉద్యోగాన్వేషణకై మదరాసు వెళ్ళాము. అక్కడ కొన్నాళ్ళు ప్రయత్నించగా రాఘవరావు గారికి హిందూపత్రిక ఆఫీసులో ఉద్యోగం లభించింది. నేను 1936 లో మదరాసు లేడి విల్లింగ్‌టన్ కాలేజీలో ట్రెయినింగు ఎల్. టి పాసయి మైలాపూరులో ఉన్న నేషనల్ గరల్స్ హైస్కూలులో ఉపాధ్యాయినిగా ఉద్యోగంలో ప్రవేశించి 7, 8 సంవత్సరాలు (1937 నుంచి 1945 వరకు) పనిచేశాను.

అప్పటి రోజుల్లో ఆ హైస్కూల్లో తెలుగు, తమిళం క్లాసులు తప్ప తక్కిన విషయాల బోధనా పద్ధతి ఇంగ్లీషు భాషలోనే ఉండేది. కొన్నాళ్ళకు స్కూలు కమిటీ పెద్దలు (అందరు తమిళులే) కేవలం ఇంగ్లీషులోనే కాక, తమిళ భాషలో కూడా బోధనాపద్ధతి అమలు పరచాలని నిశ్చయించారు తెలుగు భాషకు ప్రాముఖ్యత ఇవ్వనందున, తెలుగు కుటుంబా లకు కోపం వచ్చింది. తెలుగు మీడియంలో కూడా బోధించ మని ఎంత మొరపెట్టుకున్నా స్కూలు కమిటీ పెద్దలు వారి మాటలను పెడచెవిని పెట్టారు. వేసవి సెలవుల ముందు తెలుగు పిల్లలకు నోటీసు ఇచ్చారు. చదవదలచితే, ఇంగ్లీషు మీడియంలోగాని, తమిళ మీడియంలోగాని చదువుకోవచ్చు నన్నారు.

తెలుగు పిల్లలకు జరిగిన ఈ అన్యాయాన్ని సహించ లేకపోయాను. నేను హైస్కూలు క్లాసులకు ఇంగ్లీషు టీచరుగా ఉన్నా, ఇటుపై ఉద్యోగం చేయుటకు మనస్క రించక, వెంటనే, నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాను. రాజీనామా వలన, నా జీవనోపాధికి కలిగే ఇబ్బందులను కూడ లక్ష్యపెట్టలేదు, తెలుగు భాషను ఎలాగైనా నిలబెట్టా లని పట్టుపట్టాను.

ముఖ్యంగా మదరాసులో పిల్లలు తెలుగు భాష మరచి పోకూడదని, వారికి ఏ విధంగా తెలుగు భాషయందు ప్రోత్సా హము కలిగించాలో మా వారితో ఆలోచించాను. ఇద్దరికీ ఒకే ఆలోచన. ఇరువురి అభిప్రాయాలు ఒకటే. ఇద్దరికీ ఒకే ఆశ యం. తెలుగు పిల్లలు చదువుకోడానికి ప్రత్యేకంగా ఒక పత్రిక అయినా లేదనీ, పిల్లలను విజ్ఞానవంతులుగా చేయా

లంటే, పిల్లలకు ఒక బొమ్మల పత్రిక అవసరమని నిశ్చ యించాము. వెంటనే 'బాల' అను పేరుతో ఒక పిల్లల మాస పత్రికను ప్రారంభించాము. "బాల" పత్రిక ఒక ఆంధ్ర దేశంలోనేకాక, ఇతర రాష్ట్రాలలోకూడ ప్రఖ్యాతి పొందింది. నేనూ, రాఘవరావుగారు ఆ పత్రికకు సంపాదకులుగా ఉండి, ఎన్నెన్నో రచనలు రచియించి, "బాల" పత్రికలో ప్రచు రించాము. పిల్లల మనస్తత్వాన్ని గ్రహించి పిల్లలకు తగిన రచనలను చేశాము.

## ఆకాశవాణి కార్యక్రమం

1939 నుంచి 1956 వరకు మదరాసులో రేడియో ప్రోగ్రాంలు నిర్వహించాము. బడిపిల్లలకు కార్యక్రమాలు, స్త్రీల కార్యక్రమాలు, శని, ఆదివారాలలో పిల్లలకు ప్రత్యేక కార్యక్రమాలు అన్నిటిలో పాల్గొనేవాళ్ళం. ఆ రోజుల్లో ఆది వారం పిల్లల 'ఆటవిడుపు' కార్యక్రమం. ఒక వారం దుర్గా బాయమ్మగారు, నేను ఇంకొక వారం– ఇలాగ వారం విడిచి వారం నిర్వహించేవాళ్ళం. క్రమక్రమంగా దుర్గాబాయమ్మ గారి దృష్టి పిల్లలమీద నుంచి మహిళల మీదకు మరలింది. ఆ తరువాత, నేనూ రాఘవరావుగారు ఇద్దరం కలిసి, పిల్లల ప్రోగ్రాంలు నిర్వహించేవాళ్లం. నన్ను 'రేడియో అక్కయ్య' అనీ రాఘవరావుగారిని 'రేడియో అన్నయ్య' అని పిలిచే వారు. నాటికీ, నేటికీ మా అసలు పేర్లు చాలా మందికి తెలి యవు. దుర్గాబాయమ్మగారు మహిళల పాలిటి పెన్నిధి అయితే, కామేశ్వరి రాఘవరావు గార్లు పిల్లల పాలిటి కల్ప వృక్షం అనేవారు అందరూ. 1956 లో ఇద్దరం మదరాసు నుంచి హైదరాబాదుకు వచ్చి, ఇక్కడ స్థిరపడిపోయాము. 1956 నుంచి 1969 వరకు హైదరాబాదు రేడియో స్టేషన్‌లో

నేను స్త్రీల కార్యక్రమాల నిర్వాహకురాలుగాను, రాఘవరావు గారు పిల్లల ప్రోగ్రాముకు ప్రొడ్యూసరుగాను నియమింప బడ్డాము. "అక్కయ్య అన్నయ్యలు" వారికి వారేసాటి" అని పేరు సంపాదించుకున్నాము. జంటనగరాలైన హైదరాబాదు లోను, సికింద్రాబాదులోను సుమారు 50 రేడియో మహిళా సంఘాలను ఏర్పాటు చేశాను. వారికి వారివారి అభిరుచుల్ని బట్టి స్త్రీల కార్యక్రమాల్లో 'కదంబమాల' అని ఒక్కొక్క సంఘానికి ప్రోగ్రాం ఇచ్చి, వారిలో ఇమిడి ఉన్న ప్రతిభా పాటవాలను వికసింపచేయడానికి అవకాశం కలిగించాను. ఈ మహిళా సంఘాలన్నిటినీ చేర్చి ఒక ఫెడరేషన్‌గా రూపొందించాము. కేవలం జంటనగరాల్లోనేకాక, ముఖ్యంగా పల్లె ప్రాంతాలలో కూడా గ్రామీణ మహిళా సంఘాలు గ్రామీణ బాలసంఘాలు ఏర్పరచాము. నేనూ, రేడియో అన్నయ్య తరచు గ్రామాలకు వెళ్ళి అక్కడ స్త్రీలతోను పిల్లలతోను పరిచయం చేసుకొని, వారి సంక్షేమానికి ఎన్నో కార్యక్రమాలు ఏర్పాటు చేశాం. ఎన్నో సంక్షేమ కార్యక్ర మాలను నిర్వహించి, 1969 లో నేను రిటైర్ అయ్యాను.

## బాలానంద సంఘాలు

మద్రాసులో తెలుగు పిల్లలకు వారికి తగిన కాలక్షేపం లేకపోయేది. వారందరికీ తెలుగుభాష సరిగా వచ్చేదికాదు. వారందరినీ ఒక సంఘంగా చేర్చి, వారి విజ్ఞాన, మనోవికాస ములకు కార్యక్రమాలు ఏర్పాటుచేసి వారికి తగిన శిక్షణ ఇచ్చి పిల్లల మనస్తత్వాలను బాగా గ్రహించగలిగిన పెద్దలు ఆ సంఘాన్ని నడిపించాలని నిశ్చయించాము నేనూ, రాఘవ రావుగారు. సంఘం బాగా నడవాలంటే దానికి ప్రత్యేక నిబం ధనావళి అవసరం, అంతవరకు ఆంధ్రదేశంలో పెద్దలకు

క్లబ్బులు. సంఘాలు ఉన్నవికాని, పిల్లలకి ప్రత్యేకంగాలేవు. అప్పుడు పేరుగన్న అడ్వకేట్లు దువ్వూరి నరసరాజుగారిని, కందా భీమశంకరం గారిని సంప్రదించగా, వారు బాల సంఘ స్థాపనకు అవసరమైన కొన్ని నియమములను, నిబంధనలను ఏర్పరచారు. అదే మదరాసులో "ఆంధ్ర బాలానంద సంఘము." ఈ సంఘము 1947 లో రిజిస్టరు చేయబడింది. ఇదే మొట్టమొదట వెలసిన పిల్లల సంఘము. నేనూ, రాఘవరావుగారూ సంఘ సంస్థాపకులము. పిల్లల అభివృద్ధికై పాటుపడదలచిన కొందరు పెద్దలు ఈ సంఘ నిర్వాహక వర్గములో చేరారు. బాలానంద సంఘమును ఎంతో విజయవంతంగా నడిపించగలిగాము. ఆ తరువాత ఆంధ్రదేశంలో నలుమూలల బాలసంఘాలను వాటిని ఆంధ్ర బాలానంద సంఘానికి అనుబంధ శాఖలుగా ఏర్పరచాము. ఆ విధంగా ఆంధ్ర బాలానంద సంఘము, పిల్లల సంఘాలకు పునాది అయింది. పిల్లల్లో సంఘీభావము, క్రమశిక్షణ, కార్యదీక్ష మొదలగునవి పెంపొందించుట, పిల్లల్లో ఇమిడియున్న ప్రతిభా పాటవమును ఆటలు, పాటలు, నృత్యాలు, సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా ప్రదర్శింపజేయుటయే ఈ సంఘము యొక్క ముఖ్యోద్దేశము. ఇంతేకాక, రాష్ట్రంలో బాలల మహాసభలు నిర్వహించాము. 1950లో మదరాసులోను, 1954లో కర్నూలులోనూ, 1955లో గుంటూరులోను, ఆంధ్రప్రదేశ్ అవతరించాక 1957లో హైదరాబాదులోను నిర్వహించాం. ఈ సభలకు ఆంధ్రప్రదేశ్ నలుమూలల నుంచి బాలసంఘాలు, బాలప్రతినిధులు ఎందరో వచ్చి పాల్గొన్నారు. ఆ రోజుల్లో కేంద్ర సాంఘిక సంక్షేమ సమితికి ఛైర్మన్‌గా ఉన్న దుర్గాబాయమ్మగారు మదరాసులో నడుపుతున్న ఆంధ్ర బాలానంద సంఘ కార్యక్రమాలను చూచి,

ఆనందించి, సంఘానికి కొంత గ్రాంటుకూడా మంజూరు చేశారు. బాలల సంచార గ్రంథాలయానికి ఒక వ్యాన్‌కూడా గ్రాంటు చేశారు. సెంట్రల్ సోషల్ వెల్ఫేర్ బోర్డు సహాయముతోను, తలిదండ్రులు, పెద్దలు ఇచ్చే విరాళములతోను అనుభవజ్ఞులైన కార్యవర్గ నిర్వాహకవర్గ సభ్యుల సహకారతోను ఆంధ్ర బాలానంద సంఘము దినదినాభివృద్ధి చెందింది. 1956లో నేనూ, రాఘవరావుగారు మదరాసు నుంచి హైదరాబాదు తరలివచ్చాక, మదరాసు బాలానందం హెడ్డాఫీసు హైదరాబాదుకు మార్చవలసి వచ్చింది. హైదరాబాదులో కూడా బాలసంఘము ఏర్పరచాలని నిశ్చయించాము. 1956 దసరా ఉత్సవాలలో విజయదశమి రోజున శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు ఈ బాలానంద సంఘానికి ప్రారంభోత్సవము జరిపారు. ఆమె చల్లని చేతులతో ప్రారంభించిన ఈ పిల్లల సంస్థ దినదినాభివృద్ధి చెంది, బాలల సంస్కృతికీ, సంక్షేమానికి ఎన్నో విధాల కృషి చేస్తోంది.

## సాంఘిక సంక్షేమం

1953లో కేంద్ర సాంఘిక సంక్షేమ సమితి ఏర్పడి, ఆ సంస్థకు దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు చైర్మన్‌గా నియమింపబడ్డారు. వారి అధ్వర్యములో, ప్రతి జిల్లాకి ఒక సాంఘిక సంక్షేమ సలహాసమితిని ఏర్పాటుచేసి, ఆసమితి అధ్వర్యములో ముఖ్యంగా పల్లె ప్రాంతాలలో సంక్షేమ విస్తరణ కేంద్రాలను ఏర్పాటు చేశారు. అప్పుడు మదరాసులో ఆంధ్రమహిళా సభ కూడా ఒక ప్రాజెక్టును చేపట్టి, నెల్లూరుజిల్లా, సూళ్ళూరుపేట తాలూకా గ్రామాల్లో మాతా శిశుసంక్షేమం కేంద్రాలను ఏర్పరచదలచింది - దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు మహిళాసభ తరఫున ఒక కమిటీ నియమించి ఆంధ్ర బాలానంద సంఘ

అధ్యక్షురాలైన నన్ను ఆ కమిటీకి కన్వీనర్‌గా నియమించి ఆ ప్రాజెక్టు బాధ్యతను అప్పగించారు. మహిళాసభ సభ్యురాండ్రైన సుగుణమణి, హైమవతి గజ్జెల లీల సహకారముతో నేను స్త్రీలకు ముఖ్యంగా ప్రసూతి కేంద్రాలు, పిల్లలకు బాల్వాడీలు ఏ సహాయములేని గ్రామాలలో స్థాపించుటకు నిశ్చయించాము. సూళ్లూరుపేట తాలూకాలో తిరిగి తిరిగి ఎంతో కష్టపడి, ఎట్టి ప్రసూతి సౌకర్యాలుగాని, మరియే ఇతర సౌకర్యాలుగానిలేని పల్లెల్లో సెంటర్లు ఏర్పాటు చేశాము. ఆ రోజుల్లో సెంటర్లు పెట్టినా, అచ్చటి ప్రజలుకాని, గ్రామాధికారులుగాని, ఆ సౌకర్యాలను అర్థం చేసుకునేవారు కారు. ఆ ప్రాజెక్టు ప్రారంభించదలచిన ప్రాంతంలోని ప్రజలంతా నిరుపేదలు. వారు నాటు మంత్రసానిని మూఢాచారాలను ఎంత బోధించినా విడువరు. నేను సుగుణమ్మ, హైమవతి గజ్జెలలీల గార్లతో ఆ ప్రాంతానికి వెళ్ళి ఎంతో నేర్పుతో ఆ ప్రజలకు నచ్చచెప్పి ఆరు సెంటర్లను ప్రారంభించాము.

**(రేడియో అక్కయ్య న్యాయపతి కామేశ్వరి వివిధ సందర్భాలలో చేసిన ప్రసంగాలు, వ్యాసాలునుంచి కూర్చిన జీవిత విశేషాలు ఇవి.)**



# పిల్లి-పాట

మ్యావ్ మ్యావ్ పిల్లీ రారమ్మా!
పుస్ పుస్ పిల్లీ రారమ్మా!

1. గోలుకొండకు వస్తే నీకూ
పాలూ మీగడ పెడతాను
ఓరుగల్లుకు వస్తే నీకు
కారప్పూసా పెడతాను ॥మ్యావ్॥

2. నల్లాగొండకి వస్తే నీకూ
చల్లా మజ్జిగ పోస్తానూ
ఖాజీపేటకు వస్తే నీకూ
కాజాలడ్డూ పెడతాను ॥మ్యావ్॥

3. ఖమ్మమ్మెట్టుకు వస్తే నీకూ
కమ్మని బువ్వా పెడతానూ
హైదరబాదూ వస్తే నీకు
అన్నీ కలిపీ పెడతాను ॥మ్యావ్॥



# సిరువిచ్చు లచ్చి

లే............లే లెలెలెలె లే

లే లెలెలెలె లే

లే లెలెలెలె లే

లా..........లిలి లల లలిలా

లిలి లల లలిలా

లిలి లల లా లలిలా

నా............నాగలి చాలు

నాగలి చాలు

నాగలి చాలుల్లో

## భోగిపళ్ళు

ఆ...........ఆకును నాటి

ఆకును నాటి ఆకును నాటోతే
పంటలు పండే తలికీ
పండుగ కాదా మనకు ॥లే॥

1. రండోయి చెలియలారా
రండోయి సంతసమారా ।
ధాన్యలక్ష్మి పిలిచె అదిగో
పుణ్యకాల మొచ్చె ఇదిగో ॥రం॥

2. శృంగార మొలికేటి చాలు
రంగారు బంగారు చేలు
నడుములు బిగియ గట్టి
కొడవలి చేతను బట్టి ॥రం॥

3. వరి మొక్క ఊడుపు నాడు
వరి పంట కోతలు నేడు
మన కష్టములు ఫలించే
మన కోర్కెలు చిగురించే ॥రం॥

4. వరి చేను చక్కంగ కోసి
వరి ధాన్యమును పోగుపోసి
లలనాల పెదవులు నవ్వ
సిరిలిచ్చు లచ్చిని గొల్వ ॥రం॥

# రేడియో అక్కయ్య



# కథలు



# అవ్వా-తాత

అనగా అనగా అనగానేం, ఒక గ్రామం ఉందర్రా. గ్రామం అంటే ఒక పల్లెటూరు. ఆ పల్లెటూళ్ళో ఒక అవ్వా తాతా ఉండేవారు. వాళ్ళుండడానికి ఓ చిన్న ఇల్లుండేది. వాళ్ళకి ఒక ఆవు కూడా ఉండేది. పాడి ఆవు. అంటే ఆ ఆవు పాలు బాగా ఇస్తుందన్నమాట. పొద్దున్న సాయంత్రం కలిపి ఓ అయిదారు లీటర్లు పాలకు తక్కువ లేకుండా ఇస్తుంది. వాళ్ళకి కావలసినన్ని పాలు వాళ్ళు వాడుకుంటారు. మిగిలినవి ఊళ్ళో పిల్లలందరికీ పంచి పెడతారు. పిల్లలంటే ఆ అవ్వకీ తాతకీ ఎంతో ఇష్టం. వాళ్ళకి పిల్లల్లేరు. ఊళ్లో పిల్లల్నే సొంత పిల్లల్లా ఎంతో ప్రేమతో చూసుకొనేవారు. వాళ్ళిద్దరూ చాలా మంచివారు. కానీ వాళ్ళిద్దరూ కూడా చాలా అమాయకులు. వాళ్ళకి ఏమీ తెలియదు. ప్రపంచ జ్ఞానమే లేదు వాళ్ళకి. ఇలా ఉండగా కొన్నాళ్ళకి వాళ్ళ పాడి ఆవు ముసలిదై పోయింది. పాలివ్వడం మానేసింది. అప్పుడు అవ్వ తాతతో అంది -

## అవ్వా - తాత

"ఏమండో! మన పాడి ఆవు పాలివ్వడం లేదండీ. ఒక్క చుక్క కూడా ఇవ్వడంలేదు. ఈ ముసలి ఆవు ఇంక మనకెందుకూ ? దాన్ని సంతకు తీసుకువెళ్ళి, సంతలో అమ్మేయండి" అంది.

ఆ మాట విని తాత "ఆ ఆవుని సంతలో అమ్మేసి, ఏం చేయ మన్నావ్ ?" అని అడిగాడు.

"ఆవుని అమ్మేసి, వేరే ఏదేనా కొని తీసుకురండీ" అంది అవ్వ.

"సరే అలాగే" అన్నాడు తాత.

ఆ మర్నాడు తెల్లవారు జామునే లేచింది అవ్వ. మినప రొట్టె ఒకటి కాల్చి, ఒక గుడ్డలో మూటకట్టింది. "ఏమండోయ్! ఇదిగో మీ కోసం మినపరొట్టె చేసి, మూటకట్టి ఇస్తున్నాను. ఇది తీసుకెళ్ళండి. మీరు సంతకి వెళ్ళేటప్పుడు దార్లో ఆకలేస్తే, ఈ మినపరొట్టె తినండి" అని చెప్పి, ఆ మినపరొట్టె తాతకిచ్చింది అవ్వ.

తాత ఆ మూట పట్టుకొని, ఆవుని తోలుకుంటూ సంతకి బయలు దేరాడు. అలా వెడుతూ ఉంటే, దారిలో ఒక గొర్రెలవాడు ఒక గొర్రెను తోలుకుంటూ వస్తున్నాడు. ఆ గొర్రెను చూచాడు మన తాత. చూసి అనుకున్నాడూ, "ఓహో, ఎంత బాగుందో ఈ గొర్రె ! దాని ఒంటిమీద నల్లగా నిగనిగలాడుతూన్న బొచ్చు మరీ బాగుంది. ఆ బొచ్చుతో కంబళి నేయిస్తే వచ్చేది....చలికాలమా....వెచ్చగా కప్పుకో వచ్చు!" అనుకున్నాడు. తాత ఆగొర్రెల కాపరిని పిలిచి "ఓయీ కాపరీ! కాపరీ ! ఎక్కడికి వెడుతున్నావ్ !" అని అడిగాడు.

"నేను ఈ గొర్రెను సంతలో అమ్మేయడానికి వెడుతున్నాను. నువ్వెక్కడికి వెడుతున్నావ్ తాతా ?" అన్నాడు గొర్రెలవాడు. "నేనా? నేను కూడా సంతకే వెడుతున్నాను. సంతలో ఈ ఆవుని అమ్మేయ

దానికి వెడుతున్నాను. ఓయీ కాపరీ! నీ గొర్రె ఎంతో బాగుంది. నా ఆవుని నీకిచ్చేస్తాను, నీ గొర్రెను నాకిస్తావా? -" అని అడిగాడు తాత.

గొర్రెల వాడికి ఆశ్చర్యం వేసింది. "ఇదేవిటీ? అంత ఖరీదైన ఆవుని ఇచ్చేసి, ఈ గొర్రెను ఇమ్మని అడుగుతున్నాడూ, ఎవడో తెలివి తక్కువవాడిలా ఉన్నాడు. సరే, నాకే మంచిది" - అనుకొని, ఆ గొర్రెలవాడు, "సరే తాతా! అలాగే! నీ ఆవు నాకిచ్చేస్తే, నా గొర్రెను నీకిచ్చేస్తాను - ఈమాత్రం దానికి సంతదాకా వెళ్ళడం ఎందుకూ! ఇక్కడే తీసుకుందాం" అన్నాడు గొర్రెలవాడు.

ఆ మాట విని ఎంతో సంతోషించాడు తాత. వెంటనే తన ఆవుని ఇచ్చేసి, గొర్రెను తీసుకున్నాడు, ఎవరి దారంట వారు వెళ్ళి పోయారు. తాత ఆ గొర్రెను తోలుకుంటూ వెనుతిరిగి ఇంటికి వెడు తున్నాడు.

అలా వెడుతూ ఉంటే, దారిలో ఒక రైతుకుర్రాడు ఒక కోడి పెట్టను పట్టుకొనివస్తున్నాడు, "కోడిపెట్ట" అంటే ఆడకోడి అన్న మాట. మొగకోడిని 'పుంజు' అంటారు.

మనతాత ఆ కోడిపెట్టను చూశాడు.

ఆ కోడిపెట్టను చూచి తాత అనుకున్నాడూ -

"బలే బాగుంది ఈ కోడిపెట్ట! చాలా బలంగా, అందంగా ఉంది ఇదే ఇంత బాగుంటే దీని గుడ్లు ఎంత బాగుంటాయో! ఇది రోజు గుడ్లు పెట్టిందంటే, వాటిని అమ్ముకుంటే రోజూ బోలెడంత డబ్బు వస్తుంది." అనుకున్నాడు. అనుకుని, ఆ రైతు కుర్రవాడిని పిలిచి అన్నాడూ, "ఓయ్ అబ్బాయీ, అబ్బాయీ, నీ కోడి పెట్టను నాకిస్తావా? నా గొర్రెను నీకిస్తాను." అన్నాడు తాత.

"ఇదేమిట్రా ఈ తాత, అంత ఖరీదైన గొర్రెను ఇచ్చి, కోడి పెట్టను కొనుక్కుంటాడట. సరే, నాకే మంచి లాభం" అనుకొని, ఆ రైతుకుర్రాడు తన కోడిపెట్టను తాతకిచ్చేసి, తాత దగ్గర ఉన్న గొర్రెను పుచ్చుకొన్నాడు. కోడిపెట్ట వచ్చిందికదా అని తాత, అంత ఖరీదైన గొర్రెను పుచ్చుకున్నాను కదా అని ఆ రైతుకుర్రాడు ఎంతో సంతోషంతో వెళ్ళిపోయారు.

తాత కోడిపెట్టను పట్టుకొని, ఇంటికి వస్తూంటే, తోవలో ఓ కుర్రవాడు, ఒక చిన్న కుక్కపిల్లను తీసుకు వెడుతున్నాడు.

తాత ఆ కుక్కపిల్లను చూశాడు, తెల్లగా బొచ్చు, నల్లగా కళ్ళూ అది చూడడానికి ఎంతో ముద్దొస్తోంది.

"ఈ బొచ్చుకుక్కపిల్ల ఎంత బాగుందో! దీన్ని పెంచి, పెద్ద చేస్తే ఎంతో పనికొస్తుంది. దొంగలు రాకుండా నా ఇంటిని జాగ్రత్తగా కాస్తుంది." అనుకొన్నాడు తాత.

"అబ్బాయీ, అబ్బాయీ! నీ కుక్కపిల్లను నాకిస్తావా? నా కోడి పెట్టని నీకిస్తాను" అని అడిగాడు తాత ఆ అబ్బాయిని.

'ఇదేవిట్రా ఈ తాత ఇలా అడుగుతున్నాడు!' అనుకున్నాడు. ఆ అబ్బాయికే లాభంగా; మంచి కోడిపెట్ట వస్తోంది! వెంటనే ఒప్పేసు కున్నాడు. ఆ అబ్బాయి తాతకి కుక్కపిల్ల నిచ్చేసి, తాత కోడిపెట్టను తాను తీసుకున్నాడు.

కుక్కపిల్ల వచ్చింది కదా అని తాతకి ఒకటే సంతోషం. ఆ కుక్కపిల్లను పట్టుకొని ఇంటికి వస్తూంటే, తోవలో ఒక గారడీవాడు డోలు వాయిస్తున్నాడు. ఆ డోలును చూశాడు మన తాత. "ఈ డోలు ఎంత బాగుందో! ఇది నా పొలంలో వాయిస్తే, కాకులూ, పిచికలూ వచ్చి, నా పంట చేలు పాడు చెయ్యవ్" అని అనుకొని, ఆ గారడీ

వాడిని పిలిచి "ఓయ్ గారడీవాడా, గారడీవాడా! ఈ డోలు నాకిస్తావా? నా కుక్కపిల్లని నీకిస్తాను." అన్నాడు.

సరే అని ఆ గారడీవాడు తనడోలు తాతకిచ్చి, తాతదగ్గర ఉన్న కుక్కపిల్లను తాను పుచ్చుకొని వెళ్ళిపోయాడు.

తాత ఆ డోలు వాయించుకుంటూ ఇంటికి వచ్చాడు,

ఆ డోలు వాయింపు విని, పిల్లలందరూ తాత దగ్గరకువచ్చి, చుట్టూ మూగారు.

"ఒసేవ్, తలుపు తలుపు!" అని పిలిచాడు తాత. అవ్వ వచ్చి తలుపు తీసింది. తాత చేతిలో ఉన్న డోలు చూసింది.

"ఇదెక్కడి దండీ, ఈ డోలు?" అని అడిగింది.

అప్పుడు తాత అన్నాడూ, "మన ఆవుని అమ్మేసి, వేరే ఏదేనా తెమ్మన్నావుగా, అందుకని ఈ డోలు తెచ్చాను" అన్నాడు,

ఆవుని అమ్మేసిన దగ్గర నుంచి, డోలు తెచ్చేవరకు జరిగిన కథంతా చెప్పాడు.

తాత చెప్తూ ఉంటే, అక్కడ చుట్టూ ఉన్నపిల్లలూ, అవ్వా ఎంతో సంతోషంగా వింటున్నారు.

జరిగిన కథంతా విని పిల్లలు, "తాతా, తాతా! ఆ డోలు మాకో సారి ఇవ్వవూ? మేం వాయించి చూస్తాము" అని అడిగారు. తాత ఇచ్చాడు.

పిల్లలు ఆ డోలు పుచ్చుకొని ఎంతో సరదాగా వాయించడం మొదలు పెట్టారు!-

ఢాం ఢాం ఢాం - ఢాం ఢాం ఢాం
ఆవూ పోయి -
గొర్రె వచ్చె
ఢాం ఢాం ఢాం
ఢాం ఢాం ఢాం
గొర్రె పోయి -
కోడి వచ్చె
ఢాం ఢాం ఢాం
ఢాం ఢాం ఢాం
కోడి పోయి -
కుక్క వచ్చె
ఢాం ఢాం ఢాం
ఢాం ఢాం ఢాం
కుక్కపోయి
డోలు వచ్చె
ఢాం ఢాం ఢాం
ఢాం ఢాం ఢాం
ఢాం ఢాం ఢాం

అంటూ పిల్లలు ఆ డోలు వాయిస్తూంటే అవ్వా తాతా ఆనందం ఏమని చెప్పను ? అలా వింటూ కూర్చున్నారు. పాపం ఆ అమాయకులు !





# అమ్మమ్మ కథ

అనగా అనగా ఒక పల్లెటూరు ఉంది. ఆ పల్లెటూళ్ళో రామయ్య అని ఒక రైతు ఉండేవాడు. అతడు చాలా మంచివాడు. ఆ రైతుకి భార్య, ఏడుగురు కూతుళ్ళు ఉండేవారు.

ఆ ఏడుగురు కూతుళ్ళు చాలా అందంగా ఉండేవారు. నల్లగా నిగ నిగ లాడుతూ, మోకాళ్ళవరకూ పడే పెద్దజుట్టు, పెద్దపెద్ద అందమైన కళ్ళూ, కలకల్లాడే ముఖాలూ, ఎంతో బాగుండేవారు.

రైతుపేరు రామయ్య కదా! రామయ్య భార్యపేరు శాంతమ్మ. ఇంక ఏడుగురు కూతుళ్ళపేర్లూ :

పెద్దమ్మాయి పేరు పార్వతి, రెండవ అమ్మాయి పేరు భారతి, మూడో అమ్మాయి పేరు రేవతి, నాలుగో అమ్మాయి పేరు మాలతి,

# అమ్మమ్మ కథ

అయిదో అమ్మాయి పేరు అరుణ, ఆరో అమ్మాయి పేరు వరుణ, ఏడో అమ్మాయి-అంటే ఆఖరు అమ్మాయి అన్నమాట, కరుణ.

రామయ్య ఆ ఏడుగురు కూతుళ్ళనీ ఎంతో ప్రేమతో పెంచాడు. రామయ్యకి ఒక చిన్న పొలం ఉంది. రామయ్య రోజూ పొద్దున్నే లేచి, ఇంత అంబలి తాగి పొలానికి వెళ్ళేవాడు. పొలంలో సాయంత్రం వరకూ కష్టపడి పనిచేసి, చీకటిపడే వేళకి ఇంటికి వచ్చేవాడు.

రామయ్య జొన్నలు పండించేవాడు. జొన్నలు బాగా పంటకి వచ్చాక, అవన్నీ బాగుచేయించి బస్తాల్లో పోసి ఇంటికి తెచ్చేవాడు. తన కుటుంబానికి సరిపోయినన్ని జొన్నబస్తాలు తన ఇంట్లో ఉంచుకొని తక్కిన బస్తాలు బండిలో వేసుకొని, సంతకు తీసుకెళ్ళి, అక్కడ సంతలో అమ్మేసేవాడు. ఆ వచ్చిన సొమ్ము తన ఇంటి పై ఖర్చులకు వాడుకొనేవాడు.

ఇలా కొన్ని సంవత్సరాలు జరిగాయి. పాపం రామయ్య పెద్ద వాడై పోతున్నాడు. ఒంట్లో శక్తి తగ్గిపోతూంది. తనలో తాను విచారించేవాడు, "అయ్యో, నేను చూస్తే పెద్దవాడినై పోతున్నాను. నాకు పనిలో సహాయం చేసి, నా కష్టం తగ్గించడానికి, నాకు ఒక్క కొడుకైనా లేడు కదా! అందరూ ఆడపిల్లలే. ఇంటి రాబడి చూస్తే తగ్గిపోతోంది. ఇంట్లో తిండికే ఇబ్బంది పడుతూ ఉంటే వీళ్ళందరికీ కట్నాలు కానుకలూ ఇచ్చి పెళ్ళిళ్ళు ఎలా చేయగలనూ?" అని కళ్ళనీరు పెట్టుకునే వాడు పాపం రామయ్య.

ఇదంతా ఏడో కూతురు కరుణ కనిపెట్టింది. తన తండ్రికి ఎలాగైనా సహాయం చేయాలని నిశ్చయించుకుంది. పెద్దపిల్లలు అరుగురూ తమ తమ పనులు చూసుకుంటూ ఉంటే, కరుణమాత్రం నాన్న పనులన్నీ చేయడం మొదలెట్టింది. తెల్లవారు ఝామునే నాన్న పొలానికి వెళ్ళిపోతే, మధ్యాహ్నం పూట నాన్నకి అన్నం తీసుకొని పొలానికి

వెళ్ళేది. నాన్నకి ఎంతో ఆప్యాయంగా అన్నం పెట్టేది. నాన్నకి పొలంలో ఎంతో పని సహాయం చేసేది. సాయంత్రం దాకా పొలంలో పనిచేసి, చీకటి పడేవేళకు తండ్రీ కూతురూ ఇద్దరూ కలిసి సరదాగా కబుర్లు చెప్పుకుంటూ ఇంటికి వచ్చేవారు.

ఇలా ఉండగా ఒకసారి రామయ్య, జొన్నల బస్తాలు బండిలో వేసుకుని సంతలో అమ్మడానికి బయలుదేరాడు. అక్కడ సంతలో తన చిన్ననాటి స్నేహితుడు గోవిందు కనబడ్డాడు. గోవిందు, రామయ్య ఒకర్ని ఒకరు చూచుకొని ఎన్నో సంవత్సరాలైనా, ఒకర్ని ఒకరు వెంటనే పోల్చుకున్నారు. గోవిందు రామయ్యను చూసి ఎంతో సంతోషంతో కౌగిలించుకొని, "రామయ్యా! కులాసాగా ఉన్నావా? ఎన్నాళ్ళయిందో మనం కలుసుకొని" అన్నాడు.

"గోవిందూ! నేనింకా నీకు జ్ఞాపకం ఉన్నానా? చిన్ననాటి మన స్నేహం మరచిపోలేదా? నువ్వెంత వాడివయావు గోవిందూ? నీవు పెద్దవాడివై ఎంతో ధనం ఆర్జించి, గొప్ప భాగ్యవంతుడివయ్యావు. నన్ను చూడు, ఎలాగున్నానో, ఒక పేదరైతులాగే ఉండిపోయాను" అన్నాడు ఎంతో దీనంగా రామయ్య.

"ఫరవాలేదోయ్. నువ్వేం విచారించకు! నీకు అన్ని విధాలా సహాయం చేయడానికి నేనున్నానుగా, ఆపదలో ఆదుకున్నవాడే నిజమైన స్నేహితుడు. అదిసరే గాని, నీ కెంతమంది పిల్లలు?" అని గోవిందు అడిగాడు. తనకు ఏడుగురూ ఆడపిల్లలేనని చెప్పడానికి రామయ్య సిగ్గుపడి "నాకు నలుగురు కొడుకులూ, ముగ్గురు ఆడపిల్లలు ఉన్నారు" అని మొత్తం ఏడుమంది సంతానం అని చెప్పాడు.

"ఓహో అలాగా! నాకూ ఏడుగురూ పిల్లలే-కాని, అందరూ మగ పిల్లలేనోయ్, ఇంకేం నా కొడుకులు, నీ కొడుకులూ కలిసి మనపేరు

నిలబెట్టాలోయ్. అదే నా కోరిక" అన్నాడు గోవిందు. "నిజమే, నా కోరికా అదే" అన్నాడు జంకుతూ రామయ్య.

ఆ తరువాత గోవిందు అన్నాడు. "చూడు రామయ్యా, నీతో ఒక సంగతి చెప్పాలోయ్, ఈ విషయంలో నీవు తప్పక నాకు సహాయం చేయాలి" అన్నాడు. "ఏమిటంటే, నా ఏడుగురు కొడుకుల్లో ఆఖరివాడు సుధీర్‌కి ఈ మధ్య చాలా జబ్బుచేసింది. జబ్బునయమైంది కాని ఇంకా మంచం మీదే ఉన్నాడు. సరిగ్గా భోజనం చేయడు. ఎవరితోనూ మాట్లాడడు. ఎప్పుడూ పడుకొనే ఉంటాడు. వానిని కొంచెం హుషారుగా ఉంచి, స్నేహంగా మాట్లాడి ఆరోగ్యవంతుడిగా చేసే ఒక మంచి స్నేహితుడు కావాలోయ్. నీ కొడుకుల్లో ఒకరిని పంపితే నీ మేలును నేనెన్నటికీ మరచిపోను" అని బ్రతిమాలుకున్నాడు గోవిందు రామయ్యని.

రామయ్య ఏమీ చెప్పలేక "సరే" అని ఇంటికి వచ్చాడు. తనకి కొడుకులు లేరుగా పంపడానికి, అందరూ ఆడపిల్లలే ఆయె. ఏం చేస్తాడు రామయ్య పాపం. ఇంటికి వచ్చాడు. భార్యతో ఈ సంగతి చెప్పాడు. తన ఏడుగురు కూతుళ్ళనీ పిలిచి. తన స్నేహితుడు గోవిందు చెప్పిన సంగతి చెప్పాడు. పెద్ద కూతురు పార్వతిని అడిగాడు. "అమ్మా పార్వతీ, నీవు మగవేషం వేసుకొని గోవిందు ఇంటికి వెళ్ళి, వాని కొడుకు సుధీర్‌తో స్నేహంగా ఉండి, వాని జబ్బు నయం చేస్తావా అమ్మా ?" అని అడిగాడు.

"ఏమిటి నాన్నా నువ్వనేది? నేను మగవేషం వేసుకొని, గోవిందు ఇంటికి వెళ్ళి, వాళ్ళ అబ్బాయి జబ్బునయం చేయాలా ? మొగ వేషం వేసుకోవాలి అంటే నా అందమైన ఈ జుట్టును కత్తిరించేసుకొని క్రాప్ చేయించుకొని, మగపిల్లవాని బట్టలు వేసుకొని నేను వారింటికి వెళ్ళాలా ? నా ప్రాణం పోయినా సరే, నా జుట్టు మాత్రం నేను కత్తిరించుకోను." అని పార్వతి అంది.

రామయ్య తెల్లబోయాడు, రెండో కూతురు భారతిని అడిగాడు. భారతి కోపంగా అంది: "అదేమిటినాన్నా, ఆడపిల్ల లెక్కడైనా మగ వేషం వేసుకుంటారా? సిగ్గు సిగ్గు, నా జుట్టు మాత్రం నేను ఛస్తే కత్తి రించుకోను, నేను వెళ్ళను." అంటూ చరచరా లోపలికి వెళ్ళిపోయింది. ఇలాగే మూడో అమ్మాయి, నాలుగో అమ్మాయి, అయిదో అమ్మాయి, ఆరో అమ్మాయ కూడా చెప్పేశారు. రామయ్య చేసేదిలేక, రెండుచేతుల్తో ముఖం కప్పుకొని ఏడుస్తున్నాడు, ఆఖరు కూతురు కరుణ తండ్రి బాధ పడుతూంటే చూడలేకపోయింది, ప్రేమతో పెంచి, పెద్దచేసిన కన్న తండ్రి కోరిక తీర్చడం తన విధి అని నిశ్చయించుకుంది. "నాన్నా నీ మాట ప్రకారం నేను గోవిందు గారింటికి వెళ్తాను. ఆ జబ్బు ఉన్న అబ్బాయికి సేవచేస్తాను, నేను మొగవేషం వేసుకుటాను. నువ్వేమీ బెంగపెట్టుకోకు నాన్నా" అని ధైర్యం చెప్పింది. కరుణ మాటలు విని పొంగిపోయాడు రామయ్య.

కరుణ తన అందమైన బారెడు జెడ కత్తిరించింది. తండ్రీ కూతురూ ఇద్దరూ కలిసి గోవిందుగారింటికి ప్రయాణమయ్యారు.

గోవిందు ఇంటి దగ్గరకు వచ్చారు. ఎంత పెద్ద భవనం వాళ్ళది! పెద్దకోటలాగా ఉంది. లోపలికి వెళ్ళారు. లోపల పెద్ద అద్దాలమేడ ఉంది. ఇంటి చుట్టూ సువాసనతో నిండిన పూలతోటలు, రకరకాల పండ్ల తోటలూ ఉన్నాయి. గోవిందు రామయ్యని, రామయ్య కొడుకునీ చూశాడు...."ఎంత బాగున్నాడు మీ అబ్బాయి! నీ పేరేమిటి బాబూ!" అని అడిగేడు గోవిందు. కరుణకుమార్ అని వెంటనే చెప్పేసింది కరుణ. గోవిందు భార్యని పిలిచి రామయ్యని, కొడుకుని పరిచయం చేశాడు. కరుణకుమార్‌ని వాళ్ళబాబుకి పరిచయం చేశారు, ఎంత బాగు న్నాడు కరుణకుమార్ అని అనుకున్నాడు సుధీర్. సుధీర్‌ని చూడగానే పాపం కరుణకి జాలేసింది. అతనికి జబ్బునయం చేయడానికి నిశ్చయిం

చుకుంది "నాన్నా నేనిక్కడ ఉంటాను, నువ్వు ఇంటికి వెళ్ళు" అని చెప్పింది.

సుధీర్ కరుణకుమార్‌ని చూశాడు. ఎంత అందంగా ఉన్నాడు ఈ అబ్బాయి పైకి చూస్తే మొగపిల్లవాడులా ఉన్నాడు, కాని ఆడ పిల్లేమో అని నాకు అనుమానంగా ఉంది, నిజంగా ఆడపిల్లే అయితే నేను యీమెనే తప్పక వివాహమాడుతాను, అనుకున్నాడు సుధీర్. సుధీర్‌కి అన్ని విధాలా సేవచేసేది. కరుణ ఇద్దరూ ఎప్పుడూ కలిసే ఉండేవారు. కరుణకుమార్ ఎంతమాత్రం మొగపిల్లవాడు కాదనీ, ఆడ పిల్లే అనీ తనకి అనుమానంగా ఉందని తల్లికి చెప్పాడు.

సరే. అసలు సంగతి తెలుసుకుందామని తల్లీ, కొడుకూ ఒక ప్లాన్ వేశారు. తల్లి తన అద్దాల గదిలోకి వెళ్ళి బీరువాల్లో ఉన్న ఆభరణాలు అన్నీ తీసి కింద తివాచీమీద పెట్టింది. రత్నాలూ కెంపులూ వజ్రాలు, ముత్యాలూ, నవరత్నాలతో మెరిసిపోతూ గాజులు నెక్లెసులు, హారాలు, పతకాలు, ఒకటేమిటి ఆభరణాలు అన్నీ అక్కడ పెట్టింది. "కరుణకుమార్‌ని "పిలిచింది: ఇలా రా నాయనా! చూడూ! నాకు ఇంట్లో చాలా పని ఉంది. నీవు ఈ నగలన్నీ తీసి బీరువాలో చక్కగా సర్ది పెట్టు" అని చెప్పి వెళ్ళిపోయింది కరుణకుమార్ అంటే కరుణ లోపలికి ప్రవేశిం చింది. ఆ నగలన్నీ చూస్తే కళ్ళు జిగేల్‌మన్నాయి. సహజంగా ఆడ పిల్లలకి నగలంటే ఎక్కువ ఇష్టం కదా! ఒక్కసారి ఈ నగలు పెట్టు కోవాలని ఉంది. అనుకొని కరుణ ఆ ఆభరణాలు అలంకరించుకుంది. ఎదు రుగా ఉన్న నిలువుటద్దంలో తన రూపం చూచుకొని పొంగిపోతోంది. ఇదంతా సుధీర్ వాళ్ళమ్మా చాటుగా నిలబడి చూస్తున్నారు, నిజంగా ఆడపిల్లే అని నిశ్చయించుకున్నారు. తలుపు తెరచి లోపలికి వచ్చారు. వాళ్ళని చూడ్డంతో కరుణ భయంతో వణికిపోయింది. ఇంతలో గోవిందు కూడా అక్కడికి వచ్చాడు. అందరూ కరుణను చూచి ఎంతో మురిసి పోయారు. ఇంకేం, సుధీర్‌కీ, కరుణకీ, పెళ్ళి నిశ్చయం చేశారు. కాని

రామయ్యకీ, అతని భార్యకీ చెప్పి, వాళ్ళ అనుమతి పొందాలిగా. గోవిందు, భార్యా, రామయ్య యింటికి బయలుదేరారు. అప్పుడు కరుణ వాళ్ళ తల్లి దండ్రులకు ఏడుగురూ ఆడపిల్లలేనని అసలు సంగతంతా చెప్పింది.

రామయ్య ఇంటికి వచ్చి "రామయ్యా! మా సుధీర్ కరుణల వివాహం నిశ్చయమైంది. నీ కుటుంబం సంగతంతా కరుణ చెప్పింది. నాకు ఏడుగురు కొడుకులూ, నీకు ఏడుగురూ కూతుళ్ళూ ఉన్నారు. అది మన అదృష్టం. నా యేడుగురు కొడుకులకి, నీ యేడుగురు కూతుళ్ళనీ ఇచ్చి వివాహం చేసి, మన స్నేహం శాశ్వతంగా నిలుపుకుందాం. లెండి లెండి బయలుదేరండి, వివాహాలన్నీ మా ఇంట్లో జరిపించేస్తా", అని తొందరపెట్టాడు గోవిందు. అనుకున్నట్టుగానే సుధీర్‌కి, కరుణకీ తన తక్కిన ఆరుగురు కొడుకులకీ ఆరుగురు ఆడపిల్లల్నీ ఇచ్చి వివాహ మెంతో వైభవంగా జరిపించాడు గోవిందు.

ఇంతకీ చెప్పొచ్చే దేమిటంటే రామయ్య కుటుంబానికీ ఇంత అదృష్టం పట్టడానికి కారణం ఎవరు? అంటే, కరుణ, ఆమెవల్లనే కదా తన ఆరుగురు అక్కలకూ వివాహమైంది. కన్నతండ్రి కష్టసుఖాలకు ఆదుకున్న కరుణ బంగారుతల్లి. రామయ్య ఇంటికి అదృష్టదేవత.



# రాజాజీబ్రా

బాలలూ! మీలోకొందరు మద్రాసులో "జూ"కి వెళ్ళి అక్కడ చూచే ఉంటారు. రకరకాల కోతులు, పులులూ, సింహాలు, రంగురంగుల పక్షులు, ఎలుగుబంట్లు, ఏనుగులు, లేళ్ళు - ఇంకా ఎన్నో జంతువులు చూచి ఉంటారు. ఇందులో చారల గుర్రాన్ని చూచారా? ఇంగ్లీషులో దాన్నే జీబ్రా అంటారు. ఈ చారల గుర్రం గురించి మంచి కథ ఉంది. చదవండి.

అనగా అనగా పూర్వం ఒక గొప్ప రాజు ఉండేవాడట. ఆ రాజుకి ఏవేనా జంతువులు పెంచడం అంటే బలే సరదా. ఏ జంతువుని పెంచడమా అని ఎంతో ఆలోచించాడు రాజు. ఆలోచించి, ఆలోచించి ఆఖరికి ఒక చిన్న కుక్కపిల్లని, పెంచేడు.

ఆ కుక్కపిల్లకి రాజు పొద్దున్నే పాలు, రొట్టె అన్నీ పెట్టేవాడు. అది అవన్నీ తినితిని పెద్దదై, చాలా అల్లరికుక్క అయిపోయింది! ఆఖరికి రాజంటే భయంలేకుండా తయారయింది. కాని, రాజుకిమాత్రం ఆ కుక్కంటే ఎంతో ముద్దు. అది ఏం చేసినా సరే, రాజు ఏమీ అనే వాడు కాదు. అంచేత దానికి మరింత అల్లరి ఎక్కువయిపోయింది.

ఇలా ఉండగా, ఒకనాడు ఆ కుక్క ఏం చేసిందీ? - సాయం కాలం రాజుగారు టెన్నిస్ ఆడుతూ ఉంటే, మంచి ఆటలో ఆ టెన్నిస్ బంతిని పట్టుకొని పారిపోయింది. ఇంకోనాడు ఏంచేసిందీ - రాజుగారు పాపం, మంచి సిల్కుస్లిప్పర్లు కొనుక్కుంటే, ఆ స్లిప్పర్లు పళ్ళతోకొరికి, ముక్కలుముక్కలు చేసింది! ఇంకోనాడు రాత్రి రాజుగారు మేడమీద పచార్లు చేస్తూ ఉంటే, దొంగ అనుకొని భౌభౌమని మొఱిగి రాజుగారి కాలు కరిచేసింది.

ఈ చేష్టలన్నీ చూసి రాజుకి ఆ కుక్క అంటే చాలా అసహ్యం వేసింది. "ఛీ! ఈ కుక్క నాకక్ఖర్లేదు. వేరే ఏదేనా మంచి జంతువుని పెంచుదాం" అనుకున్నాడు. ఏమిటి పెంచుదామా అని ఆలోచించాడు. పులినిగాని, సింహాన్నిగాని పెంచుదామా అంటే క్రూరమృగాలు. మీద పడి అమాంతంగా మనుష్యుల్ని మింగేస్తాయి! పోనీ, ఒక ఏనుగుని పెంచుదామా అంటే, అబ్బో అంత పెద్ద ఏనుగుని చక్కా సరదాగా తనవెంట తిప్పుకోడం ఇవన్నీ ఎలాగా? - అంచేత ఒద్దు అనుకున్నాడు. మళ్ళీ ఆలోచించి, ఆలోచించి, ఆఖరికి ఒక గాడిదను పెంచుదాం అను కున్నాడు.

సరే, రాజు ఓ చక్కని గాడిద పిల్లని తెప్పించాడు. గుసగుస లాడుతూ ఆ గాడిద పిల్ల ఏంతో కోమలంగా ఉండేది. దాన్ని చూస్తే రాజుకి ఎంతోముద్దు. రోజూ సాయంకాలం ఆ గాడిద పిల్లని వీధుల్లోకి షికారు తీసుకెళ్ళేవాడు.

## రాజుగారి జీబ్రా

ఆ ఊళ్ళో పెద్ద బజారులో ఒక మంచి మిఠాయి దుకాణం ఉంది. ఘుమఘుమలాడే మాంచి మిఠాయి దొరుకుతుందక్కడ. రాజుకి మిఠాయి అంటే బలేఇష్టం. రోజూ సాయంకాలం, రాజు తన గాడిదని వెంట పెట్టుకొని ఆ మిఠాయి దుకాణానికి వెళ్ళి, మిఠాయి కొనుక్కొని తినేవాడు.

రాజు మిఠాయి కొంటూ ఉంటే గాడిద ఏంచేసేదీ - దానికికూడా మిఠాయి అంటే బలే ఇష్టం - నెమ్మదిగా అంగట్లో ఉన్న మిఠాయిపై తన మూతిపెట్టి పరపర నమిలి తినేసేది!

పాపం మిఠాయివాడు ఏం చేయగలడు? చూస్తే రాజుగారు! గాడిద రాజుగారి గాడిద! అంచేత ఏమీ అనలేక చూస్తూ ఊరుకొనే వాడు. గాడిద మిఠాయి అంతా తినడంవల్ల, సాయంకాలం పిల్లలు కొనుక్కుందాం అంటే మిఠాయి ఉండేది కాదు! పాపం, ఆ మిఠాయి వాడికి ఎంతో నష్టం వచ్చింది. ఏంతో దుఃఖం వచ్చింది. ఆఖరికి విసిగి, ఎలాగేనా ఈ గాడిద పనిపట్టిద్దాం అనుకున్నాడు.

ఒకరోజున ఒక మంత్రగాడు ఆ ఊరికివచ్చేడు. మిఠాయి దుకాణంవాడు "నాయన్నాయనా! మంత్రగాడా! నా మిఠాయి అంతా ఆ రాజుగారి గాడిద తినేస్తోంది! అది ఈ అంగడికి రాకుండా ఏదేనా ఉపాయం ఆలోచించి చెప్పవూ" అని అడిగాడు.

అప్పుడు మంత్రగాడు ఏం చేశాడంటే కొన్ని నల్లపిప్పరమెంట్లు కొన్ని, తెల్లపిప్పరమెంట్లు తన సంచీలోంచి తీసి, వాటిని మంత్రించి ఇచ్చాడు.

"ఇదుగో! ఇవి నీ అంగట్లో ఉంచు. ఆ గాడిదరాగానే లడ్డూలు జిలేబీలతోపాటు ఇవి కూడా తింటుంది. తినగానే చూడు మజా!" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం మామూలుగా రాజుగారు గాడిదను వెంట తీ
కొని మిఠాయి దుకాణానికి వచ్చారు. రాజుగారు ఇట్లు మిఠాయిబే
చేస్తూ ఉంటే, అటు గాడిదగారు రయ్యమని దుకాణంలోకి దర్జాగా ద
మిఠాయి, మిఠాయితోపాటు ఆ నల్ల పిప్పరమెంట్లు, తెల్ల పిప్పరమెం
తినేసింది. తినీతినడంతో ఏం జరిగిందో తెలుసా? గాడిద వీపువీ
చ్రుమని చురకలు పడిపోయాయి! ఆ చురకలవలననల్ల పిప్పరమెం
నల్లచారలు, తెల్లపిప్పరమెంట్లకి తెల్లచారలు తయారయాయి!
గాడిద "బాబోయ్! బాబోయ్!" అని ఓండ్రపెడుతూ ఒక్క గెం
గెంతి పారిపోయింది....ఆ పారిపోవడం తిన్నగా ఒక అడవిలోకి ప
పోయింది.

రాజుగారు ఎంత వెతికించినా కనబడలేదు.

ఆఖరికి కొన్నాళ్ళయాక ఆ అడవిలో చూస్తే చిన్న చిన
గమ్మత్తయిన చారల గాడిద పిల్లలు కనబడ్డాయట!

చాలా వింతగా ఉండడం వల్ల ఆ చారల గాడిదల్ని తెచ్చి ము
మైన పట్టణాలలో "జూ"లలో ఉంచారట. వాటినే చారల గుర్రాల
జీబ్రాలు అంటారు.






అనగా అనగా ఉత్తరప్రదేశ్‌లో ఒకచిన్న గ్రామంలో ఒక కుర్రవాడు. ఆ అబ్బాయి నాలుగోక్లాసు వరకూ చదువుకున్నాడు. కాని, పెద్ద చదువు అబ్బలేదు. అక్కడా అక్కడా తిరుగుతూ, ఆ పనీ ఈపనీ చేసుకుంటూ పెద్దవాడయ్యాడు.

ఒకరోజున వాళ్ళ ఊళ్ళో ఒక గోడమీద పెద్ద పోస్టరు అంటించి ఉంది. అది ఒక జవాను బొమ్మ. యూనిఫారం దుస్తులూ, కుచ్చుటోపీ, ఒక చేతిలో తుపాకీ, ఇంకోచేత్తో సలాం చేస్తూన్నట్టు ఠీవిగాఉంది బొమ్మ. బొమ్మ దిగువన "జై జవాన్, సైన్యంలో చేరండి" అని వ్రాసి ఉంది.

అది చూచాడు ఆ అబ్బాయి. చూడగానే అప్రయత్నంగా, కాలుకి బూట్లు లేకపోయినా ఠక్‌మని శబ్దం వచ్చేటట్లు రెండు పాదాలు జోడించి, ఠీవిగా నిలుచున్నాడు. ఆ జవాను బొమ్మకు శాల్యూట్ చేశాడు.

నేను కూడా మిలిటరీలో చేరిపోతాను, నేను కూడా ఆ యు
ఫారం దుస్తులు వేసుకుంటాను, నేను కూడా కుచ్చు టోపీ పెట్టు
టాను, తుపాకీ పట్టుకుంటాను, ఎవరేనా శత్రువులు మన దేశం
వస్తే, నేను కూడా యుద్ధం చేసి, శత్రువులను ఓడించివేస్తాను -
నిశ్చయించుకున్నాడు.

తిన్నగా ఇంటికి వెళ్ళాడు, సైన్యంలో జవానుగా చేరిపోత
వాళ్ళమ్మా నాన్నతో చెప్పాడు. తల్లిదండ్రులు ఆశీర్వదించారు.

తిన్నగా మిలిటరీ ఆఫీసుకి వెళ్ళాడు.

నీ పేరు ? – అని ఆఫీసరు అడిగాడు.

"అబ్దుల్ హమీద్ - ముసల్మాన్ మతం" అన్నాడు ఆ అబ్బా

ఆఫీసరు : అన్ని మతాలూ మాకు ఒకటే. సైన్యంలో కులభే
పాటించం నీ వయసు ?

జవాబు ; ఇరవై రెండు సంవత్సరాలు.

ఆఫీసరు ; నువ్వు సైనికోద్యోగిగా చేరిన తరువాత తిరిగి ఇ
పారిపోకూడదు. తెలుసా ?

జవాబు ; జీ హాఁ

సరే, మన అబ్దుల్ హమీద్ పటాలంలో చేరిపోయాడు. అ
సైనిక విద్యలు నేర్చుకున్నాడు.

యుద్ధం అంటే, కేవలం శత్రువుల మీదికి తుపాకీ పే
మాత్రమే కాదు. ధైర్యసాహసాలు ఉండాలి. తెలివితేటలు ఉ
యుద్ధభూమి మీద, ఏ నిమిషాన ఎలా నడుచుకోవాలో సమయస
ఉండాలి. ఇవన్నీ చూపినవారికి ప్రభుత్వం వీరచక్ర, పరమవీ
బిరుదులు కూడా ఇస్తుంది.

అబ్దుల్ హామీద్‌కి, యుద్ధంలో తన వీరత్వం చూపి, అటువంటి బిరుదు సంపాదించాలనే కోరిక కలిగింది - కానీ, అవకాశం రావద్దూ?

త్వరలోనే ఆ అవకాశం వచ్చింది. మన భారతదేశం ప్రక్కనే ఉన్న పాకిస్తాన్ దేశం మనపైకి యుద్ధానికి వచ్చింది. మనదేశం సరిహద్దులు దాటి రాకుండా, మన రక్షణదళాలు కాపలాఉన్నాయి. అందులో ఉన్నాడు హవల్దార్ హామీద్.

ఒకరోజు ఉదయం, పాకిస్తాన్ సైనికులు పాటన్ టాంకులు అనే యుద్ధ శకటాలమీద ఫిరంగులు ప్రేల్చుకుంటూ దూసుకు వచ్చారు తలవనితలంపుగా. ఆ పాటన్ టాంకులు ఎలా ఉంటాయంటే, నల్లగా, దున్నపోతుల్లాగ ఉంటాయి. అందులో కూర్చున్నవారు పైకి కనబడరు. మరఫిరంగుల గొట్టాలు మాత్రం పైకి కనిపిస్తాయి. ఆ గొట్టాల ద్వారా ఫిరంగి గుండ్లను పేలుస్తూ, దూసుకువస్తాయి ఆ టాంకులు. వాటిని పడగొట్టడం చాలాకష్టం.

అబ్దుల్ హామీద్, ఆ టాంకులు అకస్మాత్తుగా రావడం చూశాడు. ఊరుకుంటే లాభం లేదనుకున్నాడు. వెంటనే, చేతిలో గ్రెనేడ్ అనే బాంబులను పట్టుకొని, తన ప్రాణాలను సైతము లెక్కచేయక తన జీపు మీద బయలుదేరాడు. ధైర్యంగా ముందుకు వెళ్ళి, ఒక టాంకు మీద బాంబు విసిరాడు, "ఢాం" అని ఆ టాంకు ధ్వంసం అయింది. ఇంతలో ఇంకొక టాంకు వచ్చింది. దాన్ని కూడా ఒక్కడే ఎదుర్కొని పడగొట్టాడు, కాని మూడోసారి మరికొన్ని టాంకులు వచ్చి, మరఫిరంగులు పేల్చి, హామీద్‌ని చంపేశాయి.

అబ్దుల్ హామీద్ మనదేశ రక్షణకోసం ధైర్యంగా ఒక్కడూ పోరాడి, తన ప్రాణాలను అర్పించాడు, ఆ త్యాగాన్ని చూచి, ఇతర

జవానులు కూడా ధైర్యంగా ముందుకు వచ్చి శత్రు సేనలను వేశారు. ఆ యుద్ధంలో మన భారతీయులే గెలిచారు. విజయం అయింది,

అబ్దుల్ హమీద్, తన అపూర్వ ధైర్యసాహసాలను చు దుకు, ప్రభుత్వం అతనికి "పరమవీర చక్ర" బిరుదు ఇచ్చింది.

ఇప్పుడు అబ్దుల్ హమీద్ లేడు. కాని అతని కీర్తి వ శాశ్వతంగా చరిత్రలో నిలిచిపోయింది.

ఇదర్రా అబ్దుల్ హమీద్ సాహసగాథ!





# చీమ చిలుక

అనగా అనగా ఒక ఊళ్లో ఒక చీమ, ఒక చిలుక స్నేహంగా ఉండేవి.

ఒకనాడు అవి పాయసం వండుకున్నాయి. పాయసం చల్లారడానికి పళ్ళెంలో పోసింది చిలుక. చీమకు పాయసం చూస్తుంటే నోరూరింది, చిలక్కంటే ముందుగా తనే తినేద్దామని, గబగబా పళ్ళెం దగ్గరకు వెళ్ళింది. చీమ కాలుజారి పళ్ళెంలో పడిపోయింది. "అయ్యో! చీమ పడిపోయిందే" అని చిలుక గబగబా వెళ్ళి, దానిని తియ్యడానికి తన ముక్కు పళ్ళెంలో పెట్టింది. వెంటనే చిలుక ముక్కు కాస్తా ఊడిపోయింది. "అయ్యో నా ముక్కు ఊడిపోయిందే" అని చిలుక ఏడుస్తూ కూచుంది.

ఇంతట్లోకి, దారిని ఒక కాకి వెళుతూ, చిలుకను చూసి అడిగింది: "చిలకమ్మా చిలకమ్మా, ఎందుకేడుస్తున్నావ్? అయ్యో నీ ముక్కు లేదేం? ఏమైపోయింది" అని.

చిలక్కి కోపం వచ్చి- "చీమా నేనూ పాయసం వండుకున్నా
చీమ కాలు జారి పాయసంలో పడిపోయింది. దాన్ని తియ్యడానికి వెడితే
నా ముక్కు కాస్తా ఊడిపోయింది. నువ్వు నన్ను ఆక్షేపించావు గను
నీ కన్ను లొట్టపోవాలి" - అంది.

వెంటనే కాకి కన్ను లొట్టపోయింది. "అయ్యో, అనవసరం
కన్ను లొట్టపోయిందే! అయ్యో" అని ఏడుస్తూ కాకి వెడుతూ వుంటే
తోవలో రావిచెట్టు చూసి, "కాకమ్మా, కాకమ్మా నీ కన్నెందుకు లొ
పోయిందీ?" అని అడిగింది.

"అయ్యో, ఏం చెప్పేదే రావిచెట్టూ, చీమ చిలుక పాయస
వండుకున్నాయి. చీమ పాయసంలో పడిపోయింది. చిలుక ముక్కు
ఊడిపోయింది, కాకికన్ను లొట్టపోయింది. ఈ రావిచెట్టు ఆకులన్నీ
రాలిపోవుగాక" అంది కాకి. వెంటనే రావిచెట్టు ఆకులన్నీ రాలిపోయాయి.
"అయ్యో, ఈ గుడ్డికాకి జోలికి ఎందుకు పోయానా?" అని రావిచెట్టు
విచారిస్తూ కూచుంది.

ఇంతట్లోకి అక్కడికి ఒక ఏనుగు వచ్చింది. రావి చెట్టుని చూ
ఆశ్చర్యపోయి, "అదేమిటమ్మా రావిచెట్టూ, నీ ఆకులన్నీ ఏమై
యాయి? ఒక ఆకు కూడా లేకుండా ఇలా అయిపోయావేం?" అ
అడిగింది ఏనుగు.

ఆ మాటలు వినేసరికి రోషం వచ్చింది రావిచెట్టుకి. 'ఏం చె
దమ్మా, ఏనుగమ్మా, చీమ చిలుక పాయసం వండుకున్నాయి, చీ
పాయసంలో పడిపోయింది. చిలుక ముక్కు ఊడిపోయింది, క
కన్ను లొట్టపోయింది. రావిచెట్టు ఆకులన్నీ రాలిపోయాయి. ఏను
కుంభస్థలం కూలిపోవుగాక" అంది. వెంటనే ఏనుగు కుంభస్థలం కూలి
యింది. "అయ్యో, ఈ రావిచెట్టు జోలికి నేనెందుకు పోయానా!" అ
విచారిస్తూ, నీరు తాగడానికి ఏటికి వెళ్ళింది ఏనుగు. కుంభస్థలం

ఆ ఏనుగుని చూసి, ఏరు పకపకా నవ్వి అడిగింది, "అదేమిటమ్మా ఏనుగమ్మా ? నీ కుంభస్థలం ఏదీ ? ఎక్కడదాచావ్ ?" అని.

అలా అడగ్గానే, ఏనుక్కి కోపం వచ్చి "ఏం లేదు ఏరూ, చీమ చిలుక పాయసం వండుకున్నాయి, చీమ పాయసంలో పడిపోయింది. చిలుక ముక్కు ఊడిపోయింది, కాకి కన్ను లొట్టపోయింది. రావిచెట్టు ఆకులన్నీ రాలిపోయాయి, ఏనుగు కుంభస్థలం కూలిపోయింది. ఈ ఏట్లో ఒక్క నీటి చుక్కైనా లేకుండా ఎండిపోవుగాక" అంది ఏనుగు. ఇంకేముందీ ? ఒక చుక్కైనా నీరు లేకుండా ఎండిపోయింది ఏరు.

ఇంతట్లోకీ ఇద్దరు తోడి కోడళ్ళు కడవలు చంకన పెట్టుకొని, ఏటికి నీళ్ళకోసం వచ్చారు. వచ్చి చూస్తే ఏముంది ? ఏట్లో నీరంతా ఎండిపోయింది. ఒక చుక్కైనా నీళ్ళు లేవు. "ఏరూ, ఏరూ, నీ నీళ్ళన్నీ ఏమైపోయాయి ?" అని అడిగారు ఆ కోడళ్ళు.

అప్పుడు ఆ ఏరు అంది, "చీమ చిలుక పాయసం వండుకున్నాయి. చీమ పాయసంలో పడిపోయింది, చిలుక ముక్కు ఊడిపోయింది, కాకి కన్ను లొట్టపోయింది, రావిచెట్టు ఆకులన్నీ రాలిపోయాయి. ఏనుగు కుంభస్థలం కూలిపోయింది. ఏట్లో నీరంతా ఎండిపోయింది. కోడళ్ల చంకలకు ఆ కడవలు అంటుకుపోవుగాక" అంది ఏరు కోపంగా. వెంటనే కడవలు ఆ కోడళ్ళ చంకలకు అంటుకుపోయాయి. ఎలాగ ? నీళ్ళు లేకుండా ఇంటికి వెడితే అత్తగారు ఏం కోప్పడుతుందో అని వాళ్ళకి బెంగ ! ఎలాగైతేనేం దిగులు దిగులుగా ఇంటికి వెళ్ళేరు ఆ కోడళ్ళు.

అత్త అప్పుడే అన్నం వండుతూ, గరిటెతో కలియబెడుతోంది. ఇంకా కోడళ్ళు ఏటినుంచి రాలేదేమా అని ఎదురు చూస్తూంటే, చంకకు అంటుకుపోయిన కడవలతో వచ్చి నిల్చున్నారు కోడళ్ళు. "అదేమర్రా,

ఆ కడవలు అలా అంటుకుపోయాయేం ? ఎవరీ పని చేసింది ?'' 'అని అత్తగారు అడిగింది. ఆ కోడళ్ళు చెప్పారు: "చీమ చిలుక పాయసం వండుకున్నాయి. చీమ పాయసంలో పడిపోయింది, చిలుక ముక్కు ఊడిపోయింది, కాకి కన్ను లొట్టపోయింది, రావిచెట్టు ఆకులన్నీ రాలి పోయాయి, ఏనుగు కుంభస్థలం కూలిపోయింది. ఏట్లో నీరంతా ఎండి పోయింది, కోడళ్ళ చంకలకు కడవలంటుకుపోయాయి. అత్తగారి చేతికి ఆ తెడ్డు అంటుకుపోవుగాక ?'' అన్నారు. వెంటనే అత్తగారి చేతికి తెడ్డు అంటుకుపోయింది. "అయ్యో, ఇదేమిటర్రా !'' అని అత్తగారు తెల్ల బోయింది.

అత్తగారు వంటచేసి, అల్లుడికి విస్తరివేసి వడ్డించింది. అల్లుడు భోజనం చేస్తూ, అత్తగారి చేతికి తెడ్డంటుకు పోవడం చూసి, ఆశ్చ ర్యంతో, "అత్తగారూ, అత్తగారూ అదేమిటండీ, మీచేతికి తెడ్డు అలాగ అంటుకుపోయిందీ ?'' అన్నాడు. అల్లుడలాగ అడిగేసరికి అత్తగారికి కోపం వచ్చి, 'ఏదో నాయనా, పెద్దవాళ్ళం, మాకేదంటుకుంటేనేం ? అయినా ఏముందిలే, చీమ చిలుక పాయసం వండుకున్నాయి, చీమ పాయసంలో పడిపోయింది, చిలుక ముక్కు ఊడిపోయింది. కాకి కన్ను లొట్టపోయింది. రావిచెట్టు ఆకులన్నీ రాలిపోయాయి. ఏనుగు కుంభ స్థలం కూలిపోయింది, ఏట్లో నీరు ఎండిపోయింది. కోడళ్ళ దండలకు కడవలంటుకుపోయాయి. అత్తగారి చేతికి తెడ్డంటుకుపోయింది. అల్లుడికి కూర్చున్న ఆ పీట అంటుకుపోవుగాక'' అంది అత్తగారు. ఇంకేముంది ! వెంటనే అల్లుడికి పీట అంటుకుపోయింది. పాపం ఆ అల్లుడు ఆ పీట తోటే రాజసభకి వెళ్ళాడు, సభలో వారంతా అతన్ని చూసి గొల్లున నవ్వడం మొదలుపెట్టారు, "అదేమిటి, మీకు పీట ఎందుకూ అలా అంటుకుపోయిందీ ?'' అని అడిగారు సభవారు,

అప్పుడు అల్లుడు "ఏం చెప్పేదీ ? చీమ చిలుక పాయసం వండు కున్నాయి. చీమ పాయసంలో పడిపోయింది, చిలుకముక్కు ఊడి

పోయింది, కాకి కన్ను లొట్టపోయింది; రావిచెట్టు ఆకులన్నీ రాలిపో యాయి. ఏనుగు కుంభస్థలం కూలిపోయింది. ఏట్లో నీళ్ళన్నీ ఎండి పోయాయి, కోడళ్ళ చంకలకి కడవలు అంటుకుపోయాయి, అత్తగారి చేతికి తెడ్డంటుకుపోయింది, అల్లుడికి పీట అంటుకుపోయింది, ఈ సభలో ఉన్నవారందరికీ వారు కూర్చున్న చాపలు అంటుకుపోవుగాక'' అన్నాడు అల్లుడు. వెంటనే సభవారికి, వారు కూర్చున్న చాపలన్నీ అంటుకు పోయాయి.

ఇంతట్లోకి సభలోకి రాజుగారు వచ్చారు. సింహాసనంమీద కూర్చు న్నారు. సభవారందరూ వాళ్ళ కంటుకుపోయిన చాపలతో లేచి నిల్చు న్నారు, రాజు వారందర్నీ చూసి ''ఇదేమిటి, మీకు చాపలన్నీ అలా అంటుకుపోయా యేమిటి ?'' అని అడిగారు.

అప్పుడు సభవారన్నారూ - చీమ చిలక పాయసం వండుకు న్నాయి, చీమ పాయసంలో పడిపోయింది, చిలుక ముక్కు ఊడిపో యింది. కాకి కన్ను లొట్టపోయింది. రావిచెట్టు ఆకులన్నీ రాలిపోయాయి. ఏనుగు కుంభస్థలం కూలిపోయింది, ఏట్లో నీరు ఎండిపోయింది, కోడళ్ళ చంకలకు కడవలంటుకుపోయాయి. అత్తగారి చేతికి తెడ్డంటుకుపోయింది, అల్లుడికి పీటంటుకుపోయింది, సభవారికి చాపలంటుకుపోయాయి. రాజు గారికి ఆ సింహాసనం అంటుకుపోవుగాక'' - అన్నారు. వెంటనే రాజుగారికి సింహాసనం అంటుకుపోయింది.

రాజుగారు ఈ కథంతా విని, ఇంతమంది ఈ విధంగా బాధ పడుతూ ఉంటే ఊరుకోవడం మంచిదికాదని ఆలోచించారు, వెంటనే పురోహితుణ్ణి పిలిపించారు. ఈ బాధలన్నీ పోగొట్టమని చెప్పారు.

అప్పుడు పురోహితుడు వచ్చి, కొన్ని అక్షింతలు మంత్రించి ఇచ్చి, ''ఇవి మీరందరూ వేసుకుంటే, మీ బాధలుపోతాయి.'' అని చెప్పాడు.

రాజుగారు ఆ అక్షింతలు తీసుకొని, తను కొంచెం వేసుకొని తక్కినవి అందరికీ ఇచ్చాడు.

అందరూ ఆ అక్షింతలు వేసుకున్నారు. వెంటనే రాజుగారి అంటుకున్న సింహాసనం ఊడిపోయింది, సభవారికి చాపలు ఊ పోయాయి, అల్లుడికి పీట వచ్చేసింది. అత్తగారికి తెడ్డు ఊడిపోయింది కోడళ్ళకి చంకలనుండి కడవలు ఊడిపోయాయి, ఏట్లో నిండా నీ వచ్చింది. ఏనుక్కి కుంభస్థలం వచ్చింది. రావిచెట్టుకి ఆకులనీ వచ్చాయి, కాకి కన్ను వచ్చింది, చిలక్కి ముక్కు వచ్చింది, చీమ బ్రతి పళ్ళెంలోంచి నెమ్మదిగా బయటికి వచ్చింది.

పాయసం బాగా చల్లారిన తరువాత, చీమ చిలుక కడుపునిం పాయసం తిన్నాయి, ఇద్దరూ హాయిగా ఉన్నారు.



భోగిపళ్ళు



# చీమ కుట్టింది

అనగా అనగా అనగా ఒక రాజు. ఆ రాజుకి ఏడుగురు కొడుకులు. ఆ ఏడుగురు కొడుకులు ఒకనాడు వేటకి వెళ్ళేరు. వెళ్ళి ఏడు చేపలు తెచ్చారు. ఆ ఏడు చేపల్ని ఎండలో పెట్టారు. అందులో ఆరుచేపలు ఏండేయి. ఒక చేప ఎండలేదు, అప్పుడా రాజు కొడుకన్నాడు:

"చేపా, చేపా! ఎందుకు ఎండేవ్ కావు?" అని అడిగాడు. అడిగితే, "గడ్డిదుబ్బు చాటొచ్చింది"-అంది ఆ చేప. అప్పుడు రాజుకొడుకు గడ్డి దుబ్బు దగ్గరకు వెళ్ళి అడిగాడు.

"ఏమే దుబ్బా చాటొచ్చావ్?" అని అడిగేడు - అంటే "గుఱ్ఱం గడ్డి మేస్తేగా!" అంది గడ్డి దుబ్బు.

"ఓహో అలాగా!" అని ఆ రాజు కొడుకు తిన్నగా గుఱ్ఱం దగ్గరికి వెళ్ళేడు. వెళ్ళి -

"ఏయ్ గుర్రం! మేసేవ్ కావ్?" అని గుర్రాన్ని అడిగేడు. అంటే గుర్రం అంది :

"పోలిగాడు నన్ను విప్పలేదు" - అని చెప్పింది గుర్రం.

"ఏవిరా పోలిగా! విప్పేవ్ కావ్!" అని అడిగాడు రాజు కొడుకు.

"అవ్వ నాకు బువ్వపెట్టలేదు" అని చెప్పాడు, పోలిగాడు.

అప్పుడు రాజు కొడుకు అవ్వని చూసి-

"ఏమే అవ్వా, బువ్వ పెట్టేవ్‌కావ్?" అని అడిగాడు. అంటే అవ్వ అంది:

"బాబూ! నేనేం చేసేదీ? పాపాయి మారాం పెట్టింది." అని.

రాజు కొడుకు పాపాయిని చూసి-

"ఎందుకు పాపా ఏడ్చావూ?" - అని అడిగాడు.

ఆ పాపాయి చెప్పింది!

"ఎర్ర చీమ నన్ను కుట్టింది ..." అంది.

ఓహో! అలాగా అని చీమ నడిగేడు!

"ఏమే చీమా కుట్టేవూ? -"అని.

అంటే చీమ అంది!

"పుట్టిన రోజు పండుగనాడు-పప్పు బువ్వా పెట్టకపోతే కుట్టనూ? మరి కుట్టనూ?" అంది చీమ.

కథ కంచికీ, మనం ఇంటికీ!



# చంద్రం

అనగా అనగా ఒక ఊళ్ళో శాంతమ్మ అని ఒకతల్లి ఉండేది. ఆమెకు చంద్రం అని ఓ కొడుకున్నాడు. ఆ చంద్రం చాలా మంచివాడు. తనతోటి పిల్లలందరితోనూ చాలా స్నేహంగా ఉండేవాడు. తల్లిని చూస్తే ఎంతో అభిమానం. అమ్మంటే ఎంతో ఇష్టం. తల్లి శాంతమ్మకు కూడా అంతే; కొడుకు చంద్రం మీద ఎంతో ప్రేమ.

పాపం శాంతమ్మ చాలా బీదది. ఊరవతల ఒక చిన్న పూరి గుడిసెలో ఆమె, కొడుకూ ఉండేవారు. శాంతమ్మ ఒకరింట్లో పనిమనిషిగా పొద్దున్నుంచీ సాయంత్రం వరకూ కష్టపడి పనిచేసి, నెలకు ఓ ముప్ఫయి రూపాయలు సంపాదించేది. కొడుకు చంద్రాన్ని ఎన్నో ఇబ్బందులు పడి ఏడో క్లాసు వరకు చదివించింది, కాని ఏడో తరగతి ప్యాసయాక ఇంక చదువు చెప్పించలేకపోయింది ఆతల్లి. చదువు చెప్పిం

చాలంటే, జీతం కట్టాలీ, పుస్తకాలు కావాలీ, బట్టలు కావాలీ - వీటికింద ఆ తల్లి సంపాదించిన సొమ్ము ఖర్చు చేసేస్తే, మరి తిండికి ఎలాగ? అందుచేత చంద్రం చదువు మానిపించవలసి వచ్చింది. చంద్రం కూడా ఇక్కడ అక్కడ కూలిపని చేసి, ఏదో కొద్దిగా సంపాదించేవాడు. ఇలా కష్టపడి, ఆ వచ్చిన డబ్బుతో తల్లీ కొడుకూ బతికేవారు.

శాంతమ్మ పూరి గుడిసెలో ఉన్నా, ఆ ఊరు మాత్రం చాలా పెద్ద ఊరు, దాన్ని ఓ గొప్ప మహారాజు పరిపాలించేవాడు. ఆ మహారాజుకి ఓ పెద్దకోట ఉండేది. ఆ కోటకి దగ్గరగానే, ఓ పెద్ద ఉద్యాన వనం ఉండేది. ఆ ఉద్యానవనంలో రకరకాల పక్షులు, జంతువులు, చెట్లు పూల మొక్కలు ఎన్నో ఉండేవి. ఆ వనానికి చుట్టూ పెద్ద ఎత్తున ప్రహారీగోడ ఉండేది. ఆ వనంలో అలా కొంతదూరం వెడితే, అక్కడ ఒక ఎత్తైన బురుజు ఉండేది. ఎవరేనా ఆ బురుజు ఎక్కి చూస్తే ఊరంతా కనబడేది. విశాలంగా ఉన్న వీధులు, వరుసలుగా ఉన్న మేడలు మిద్దెలు, ఇళ్ళు, వాకిళ్ళూ అన్నీ కనబడేవి.

ఆ ఉద్యాన వనంలోకి వెళ్ళాలంటే, పెద్ద గుమ్మం తలుపులున్నాయి. అవి తీస్తేనేగాని, ఎవరూ లోపలికి వెళ్ళలేరు, ఆ గుమ్మం తలుపులు ధగధగ మెరిసిపోతూ ఉండేవి.

ఆ రాజు పేరు సువర్ణగుప్తుడు, చాలా అందమైనరాజు, పేరుకి తగ్గట్టుగానే, బంగారంలాగ మెరిసిపోతూ ఉంటాడు, అందానికి తగ్గట్టుగా మంచి గుణాలు కలవాడు. చాలా మంచి రాజు.

ఇలా ఉండగా. ఒకరోజున రాజభటులు ఆ ఊళ్ళో ఒక చాటింపు వేశారు:

ఏమనంటే - "వినండోహోయ్ - ఇందు మూలంగా, ప్రజలందరికీ తెలియజేసేదేమిటంటే - మహారాజులుగారి ఉద్యానవనం రేపటి

నుంచి మూడురోజుల వరకూ తెరిచి ఉంటుందండోహోయ్ - ప్రతి రోజూ, సాయంత్రం మూడు గంటలనుంచీ అయిదు గంటలవరకు- అనగా రెండు గంటలసేపు మహారాజులుంగారు మారువేషంతో ఆ వనంలో విహరిస్తారండోహోయ్....ఎవరైతే, ఆ మారువేషంలో ఉన్న మహారాజులుంగారిని పోల్చుకుంటారో వారికి గొప్ప బహుమానం ఇస్తారండోహోయ్.. ఉద్యానవనంలోకి ఆ మూడు రోజులూ, పెద్దలూ, పిన్నలూ, పిల్లలూ, అందరూ రావచ్చునండోహోయ్."

అని చాటింపు వేశారు.

ఆ చాటింపు ఊళ్ళో ప్రజలందరూ విన్నారు, ఇక వాళ్ళసంతోషం ఏమని చెప్పను! అందరూ ఉద్యానవనంలోకి వెళ్ళి, రాజుగారిని గుర్తించి బహుమానం పొందాలని ప్రతి వారికీ ఆశే.

మన చంద్రం కూడా ఆ చాటింపు విన్నాడు, గబగబా పరుగెత్తుకుంటూ ఇంటికి వెళ్ళాడు. తల్లికి ఈచాటింపు సంగతి చెప్పాడు. "అమ్మా అమ్మా! నేను ఉద్యానవనంలోకి వెళ్ళి, మారువేషంలో తిరుగుతూన్న ఆ మహారాజుగారిని పోల్చుకుంటానమ్మా. నాకు గొప్ప బహుమతి వస్తే, మనిద్దరం హాయిగా బ్రతకవచ్చునమ్మా. మన దరిద్రం పోతుంది. నువ్విప్పుడు కష్టపడి పనిచేయ నక్కరలేదమ్మా" అన్నాడు,

చంద్రం మాటలు విని, తల్లి ఎంతో సంతోషించింది. కొడుకుని ప్రేమతో దగ్గరగా తీసుకొని, "సరే వెళ్ళు నాయనా, దేవుడు నిన్ను రక్షిస్తాడు బాబూ" అని దీవించింది.

సరే, మర్నాడు సాయంత్రం సరిగ్గా మూడు గంటలకు, చంద్రం ఉద్యానవనం దగ్గరకు వెళ్ళాడు, ఓ! ఓ! ఏమి జనం! అందరు గేటు బయట నిలబడి ఉన్నారు. ఇంతలో భటులు బంగారు గేటు తలుపులు తెరిచారు. జనం అంతా గుంపులు గుంపులుగా లోపలికి వెళ్ళారు. చంద్రం

కూడా లోపలికి వెళ్ళాడు. ఆ ఉద్యానవనం ఎంత బాగుందనుకున్నార
అలా వెడుతూంటే, ఒక ప్రక్కన ఏనుగులు, గుర్రాలు, ఒంటె
జిరాఫీలు, పులులు, సింహాలు, కోతులు, ఎన్నో జంతువులున్నా
పిల్లలు, పెద్దలు వాటన్నిటినీ చూచి ఆనందిస్తున్నారు. ఆ రాజు
ఉద్యానవనంలో ఇంకా ఎన్నో జంతువులు పక్షులు ఉన్నాయి, చం
ఇంకా అలా వెడుతున్నాడు. అక్కడ నెమిళ్ళు నృత్యం చేస్తున్నా
అక్కడికి దగ్గరగా ఒక కొలను ఉంది. ఆ కొలనులో హంసలు,
హంసలు ఈదుతున్నాయి. ఇలాగ ఆ వనం అంతా కలకలలాడుతో
చంద్రం వాటన్నిటినీ చూస్తూ నడుస్తున్నాడు.

అలా వెడుతూంటే, దారిలో ఒక చిన్న పాపాయ్ ఏడ
నిలబడింది.

"ఎందుకు పాపా, ఏడుస్తున్నావ్ ?" అని అడిగాడు చంద్ర

"నాకు అమ్మ కావాలి - " అని ఏడ్చింది.

"మీ అమ్మ ఏదీ ?" అని అడిగాడు.

"మా అమ్మ ఇలా వచ్చి, ఎక్కడికో పోయింది.... నాకు
అమ్మ కావాలీ" - అని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆ పాపని చూస్తే చంద్రానికి జాలివేసింది.

"అయ్యో. నువ్వు దారితప్పి పోయావా పాపా ? నీకేం
లేదు. ఇలారా, నిన్ను మీ అమ్మ దగ్గరకు తీసుకువెడతాను."
చెప్పి చంద్రం, ఆ పాపాయిని ఎత్తుకొని, అలా కొంతదూరం
మెట్లెక్కి, ఆ ఎత్తైన బురుజుమీదికి తీసుకొని వెళ్ళాడు. "ఇక్కడ
చూడు పాపా ! మీ ఇల్లు ఎక్కడ వుందో చెప్పగలవా ?" అని అడి
చంద్రం.

పాప కిందికి చూస్తే ఊరంతా కనిపించింది. "ఆ! అదిగో అదే మా ఇల్లు! ఆ దేవాలయం ఉంది చూడూ, దాని కెదురుగా ఉన్నదే మా ఇల్లు" అని సంతోషంతో గెంతుతూ చెప్పింది.

చంద్రం ఆ పాపాయిని తీసుకొని ఉద్యానవనంలో నుంచి బయటికి వస్తూండగా, అతని కెదురుగా పెద్దగడ్డాలు, మీసాలు ఉన్న ఓ పెద్ద మనిషి వచ్చాడు. "ఎవరీ పాపాయి" అని అడిగాడు ఆ మనిషి. "ఈ పాపాయి తప్పిపోయింది. ఈమెని తీసుకువెళ్ళి వాళ్ళమ్మకు అప్ప చెప్పాలి" అని చంద్రం జవాబుచెప్పి, పాపని తీసుకొని వెళ్ళి పోయాడు. ఊళ్లోకి వచ్చాడు. నడవగా నడవగా దేవాలయం దగ్గరికి వచ్చాడు. "అదుగో అదే మా ఇల్లు" అని పాప చెప్పింది, ఆ ఇంటి వీధి గుమ్మంలో ఆపాప తల్లి నిలబడి, తన పాపాయి కోసం బెంగతో ఎదురు చూస్తోంది. ఆ పాపాయిని తల్లికి అప్పగించాడు చంద్రం. ఆ తల్లి ఆనందం ఏం చెప్పను, "నాయనా, నా పిల్లని తీసుకొని నాకు అప్ప చెప్పావు. నీ మేలు నేను మరచిపోలేను" - అని చెప్పి, చంద్రానికి ఇంత ఫలహారం, ఇన్ని పళ్ళూ ఇచ్చి పంపింది.

చంద్రం ఇంటికి వచ్చాడు, జరిగిన సంగతంతా తల్లికి చెప్పాడు. తల్లి చాలా సంతోషించింది. "నాయనా ! చంద్రం, నువ్వు మహారాజుని గుర్తించలేకపోయినా, రాజాలాంటి పని చేశావు, తప్పిపోయిన ఆ పాపాయిని వాళ్ళమ్మకి అప్పచెప్పావు, అంతేచాలు. భగవంతుడు నన్ను రక్షిస్తాడు బాబూ !"....అని ప్రేమతో కొడుకును బుజ్జగించింది.

సరే, మొదటిరోజు ఇలా జరిగిందా ! ఇంక రెండోరోజు చంద్రం ఉద్యానవనానికి బయలుదేరాడు, మొదటిరోజు ఆ వనంలో జంతువుల్ని చూశాడుగా ! ఈ రోజు ఏం చేశాడూ, వాటికోసం పల్లీలు, బటానీలు, శనగలు, ఏనుగులకి చెరకు గడలంటే ఎంతో ఇష్టం - అందుకని ఇన్ని చెరకు గడముక్కలు అన్నీపట్టుకొని వెళ్ళాడు, జంతువులంటే చూడండి

ఆ చంద్రానికి ఎంత ప్రేమో! ఉద్యానవనం గుమ్మందగ్గరికి వెళ్లేసరికి, దా
తలుపులు తెరిచి ఉన్నాయి, జనం గుంపులు గుంపులుగా లోనికి వెడుత
న్నారు, చంద్రంకూడా వెళ్లాడు. చంద్రం అలా వెడుతూంటే, దూరంగ
ఒక కుక్క ఏడుస్తూ మొరగడం వినిపించింది. చంద్రం గబగబా
మొరుగు వినపడే దిక్కుగావెళ్ళాడు. అక్కడ ఒకబావి దగ్గర, ఆ కుక్క
మొరుగుతూ, బావిలోకి చూస్తోంది, బావిలో ఏముందా? అని చంద్ర
చూసేసరికి, ఆ బావి లోపల ఒక చిన్న కుక్కపిల్ల ఉంది. బావిల
నీరంతా ఎండిపోయింది గనుక, ఆ కుక్కపిల్ల చచ్చిపోలేదు. బతి
ఉంది. బావిలోకి చూస్తూ తల్లికుక్క ఏడుపు- బావిలోనుంచి ఆ చిన్న
కుక్కపిల్ల ఏడుపు, అది చూస్తే చంద్రం గుండె కరిగిపోయింది. ఎల
గేనా బావిలోకి దూకి ఆ చిన్న కుక్కపిల్లని బయటకి తెచ్చి, కుక్క
అప్ప చెప్పాలి, అని నిశ్చయించుకున్నాడు చంద్రం. కానీ, బావిలో
దూకుతే మళ్ళీ పైకి రాగలడో, లేడో! బావి లోపలంతా నాచుతో నిం
ఉంది. పైకి ఎక్కి రావడానికి ఏ సహాయమూలేదు. ఏమయినా సరే ఆ
చంద్రం తెగించి, బావిలోకి దూకాడు. ఆ చిన్న కుక్కపిల్లని పట్టుకొ
ఎంతో కష్టంమీద పైకి వచ్చాడు. తల్లి కుక్క తన పిల్లని గట్టి
కౌగిలించుకొని ఒకటే సంతోషించింది. చంద్రం కాళ్ళు నాకుతూ, ఎం
విశ్వాసంతో చంద్రం కళ్ళల్లోకి చూసింది.

చంద్రం ఇంటికి వచ్చాడు, జరిగిన సంగతంతా తల్లికి చెప్పా
వెంటనే తల్లి అంది. "నాయనా, నువ్వు మహారాజుని చూడలేద
విచారం నాకులేదు. మనిషి అయినా, జంతువైనా అందరి ప్రాణం స
నమే, బావిలో పడిన కుక్కపిల్లను రక్షించి, తల్లికుక్కకు అ
చెప్పావు. అంత మంచి పని మహారాజు కూడా చేయలేదేమో అని
నమ్మకం. మంచి చేసిన వారికి భగవంతుడెప్పుడూ సహాయం చేస్తా
నాయనా!" అంది ఆ తల్లి.

సరే, ఇంక మూడోరోజున కూడా చంద్రం ఉద్యానవనంలోకి వెళ్ళాడు, అక్కడ దారికి ఒక ప్రక్కగా ఒక ముసలి తాత కూర్చుని ఉన్నాడు, ఆ తాతకు కళ్ళు కనబడవు; గుడ్డివాడు. చంద్రం అతని దగ్గరకు వెళ్ళి - "ఏం తాతా ఇక్కడ కూర్చున్నావ్ ?" అని అడిగేడు. "నాయనా, మహారాజుగారు మారువేషంలో వనంలో తిరుగుతున్నారట. ఆయనను చూచి గుర్తు పట్టడానికి వచ్చాను" అన్నాడు ఆ గుడ్డి తాత.

చంద్రానికి చిన్న సందేహం వచ్చింది. "రాజుగారిని చూడడానికి వచ్చాడట! కళ్ళుకనబడవు కదా, చూస్తానంటాడేమిటీ? "అనుకొని, "తాతా నీకు కళ్ళు కనబడవు కదా, నువ్వు రాజుగారిని ఎలా చూస్తావు? నీ మాటలు వింటూవుంటే నాకు ఆశ్చర్యంగా ఉంది." అన్నాడు చంద్రం మారు వేషంలో ఉన్న మహారాజు ఏమో అని సందేహం కూడా కలుగుతోంది. ఆ ముసలితాత చిన్న నవ్వు నవ్వుకొని, "అబ్బాయీ! నీవు చాలా తెలివైన వాడివి, చక్కగా అర్థం చేసుకున్నావు. నీ పేరేమిటీ?" అన్నాడు.

చంద్రం "నేనూ మా అమ్మ, ఊరవతల పూరిగుడిసెలో ఉంటున్నాం!" అని చెప్పి, "తాతా! నువ్వెక్కడికెళ్ళాలో చెప్పు. నేను నిన్ను జాగ్రత్తగా తీసుకువెడతాను" అన్నాడు చంద్రం. "నీ మంచి గుణానికి సంతోషించాను, నీకు భగవంతుడు మేలు చేయుగాక ! నువ్వు ఇంటికి వెళ్ళు నాయనా", అన్నాడు తాత.

చంద్రం ఇంటికి వెళ్ళి జరిగిన సంగతంతా తల్లితో చెప్పాడు. "నాయనా నీ మంచి గుణాలే నిన్ను రక్షిస్తాయి" అంది తల్లి.

ఆ మర్నాడు ఉదయమే, రాజభటులు చంద్రం ఇంటికి వచ్చి, 'మహారాజుగారు చంద్రాన్ని తీసుకురమ్మన్నారు' అని చెప్పారు. చంద్రం వాళ్ళతో వెళ్ళాడు. రాజుగారు దర్బారు హాల్లో కూర్చున్నారు. "చంద్రం, నీవు నన్ను పోల్చుకోలేకపోయినా, నీకు తెలియకుండా నీవు చేసిన మంచి పనులన్నీ నేను కనిపెడుతూనే ఉన్నాను. నీకు తగిన బహుమానం

ఇస్తున్నాను, నీవు మీ అమ్మ ఉండడానికి ఒక మంచి ఇల్లూ, నీవు ఇంకా పెద్ద చదువు చదవడానికి, మీ కుటుంబ పోషణకి కావలసిన ధనమూ ఇస్తున్నాను, నీవూ, మీ అమ్మ హాయిగా జీవించండి'' అని గొప్ప బహుమానము ఇచ్చాడు రాజు.

చంద్రానికి, అమ్మకీ ఒకటే సంతోషం. చంద్రం బాగా చదువు కొని, పెద్దవాడయాడు. రాజుగారు చంద్రానికి తన కోటలో గొప్ప ఉద్యోగం ఇచ్చారు. చంద్రం, వాళ్ళమ్మ హాయిగా ఉన్నారు.

చూశారా ! మంచివాళ్ళకి ఎప్పుడూ భగవంతుడు ఎలా మేలు చేస్తాడో !





# దోమా కోతీ

అనగా అనగా ఒక ఊళ్లో ఒక దోమ ఉండేది. ఒకనాడు ఆ దోమ అనుకుంది : “అందరూ పెళ్ళి చేసుకుంటున్నారు. అందరూ హాయిగా ఉన్నారు. నేను కూడా పెళ్ళి చేసుకుంటాను. కంచికి వెళ్ళి ఒక మంచి వాడిని పెళ్ళి చేసుకుంటాను.”

దోమ కంచికి బయలుదేరింది. అలా వెడుతూ ఉంటే దారిలో ఒక ఏనుగు ఎదురయింది.

“దోమా! దోమా! ఎక్కడికి వెళ్తున్నావు?” అని అడిగింది ఏనుగు.

“నేను కంచికిపోయి మంచివాడిని పెళ్ళి చేసుకుంటాను” అంది దోమ.

"దోమా! దోమా! నన్ను పెళ్ళి చేసుకోవూ?" అంది ఏనుగు.

"హ హ హ హ-ఎంత బాగుంది? ఏనుగట! ఏడుమూళ్ళ తొండమట! తననట - నేనట! పెళ్లాడాలట! అయ్యో! బతుకో బతుకు! నిన్ను నేను పెళ్ళాడను పో!" అని ఎగతాళిగా ఎత్తి పొడిచింది దోమ.

ఆ మాటలు విని, ఏనుగు సిగ్గుపడి వెళ్ళిపోయింది. దోమ అలాగ వెడుతూ ఉంటే దారిలో ఒక ఒంటె ఎదురైంది.

"దోమా! దోమా! ఎక్కడికి వెడుతున్నావు?"

"నేను కంచికి వెళ్ళి మంచివాడిని పెళ్ళి చేసుకుంటాను."

"దోమా! దోమా! నన్ను పెళ్ళి చేసుకోవూ?" అంది ఒంటె.

"హ హ హ హ - అబ్బే! నిన్నా! ఒంకరటింకర ఒంటెట! పొడుగాటి గొంతుట! తనట! నేనట! పెళ్ళాడాలట! అయ్యో! బతుకో బతుకు! నిన్ను పెళ్ళాడను పో!" అని ఒంటెను గేలిచేసింది దోమ.

పాపం! ఒంటె సిగ్గుపడి వెళ్ళిపోయింది. దోమ అలాగ వెళుతూ ఉంటే తోవలో ఒక గుర్రం ఎదురైంది.

"దోమా! దోమా! ఎక్కడికి వెడుతున్నావ్?" అడిగింది గుర్రం.

"నేను కంచికి వెళ్ళి మంచివాడిని పెళ్ళి చేసుకుంటాను."

## దోమా - కోతీ

"ఓహో అలాగా ! దోమా నన్ను పెళ్ళిచేసుకోవూ ?" అంది గుర్రం.

"హ హ హ హ, ఇది చాలా బాగుంది. గుర్రమట! పళ్ళన్నీ తొఱ్ఱి అట! తననట-నేనట-పెళ్ళాడాలట. అయ్యో బతుకో బతుకు !" అంది దోమ.

పాపం గుర్రం కూడా సిగ్గుపడి వెళ్ళిపోయింది. దోమ అలా ప్రయాణం చేస్తోంది. దారిలో ఒక కాకి కనబడింది.

"దోమా ! దోమా ! ఎక్కడికి వెడుతున్నావ్?"

"నేను కంచికిపోయి మంచివాడిని పెళ్ళి చేసుకుంటాను."

"దోమా! దోమా! నన్ను పెళ్ళి చేసుకోవూ ?" అడిగింది కాకి.

"బాగుంది....నిన్నెవరు పెళ్ళి చేసుకుంటారు ? కాకట ! కటిక నలుపట! కన్ను గుడ్డట! తననట-నేనట ! పెళ్ళాడాలట. అయ్యో ! సిగ్గో సిగ్గు ! నిన్ను నేను పెళ్ళాడను పో."

పాపం కాకి సిగ్గుపడి వెళ్ళిపోయింది.

దోమ అలా వెళ్ళగా వెళ్ళగా దార్లో ఒక కోతి కనబడింది.

"దోమా ! దోమా ! ఎక్కడికి వెడుతున్నావ్?" అంది కోతి.

"నేను కంచికి వెళ్ళి మంచివాడిని పెళ్ళి చేసుకుంటాను,"

"ఓహో అలాగా ! అయితే ఇంకా ఎందుకు వెడుతున్నావ్? ఇదే కంచి. నేనే ఆ మంచివాడిని, రా, నన్ను పెళ్ళి చేసుకో" అంది కోతి.

"ఓహో ! ఇదేనా కంచి! నువ్వేనా ఆ మంచివాడివి! అయితే నిన్నే పెళ్ళి చేసుకుంటాను!"

ఆనంద మానందమాయెనే
మన దోమమ్మ పెళ్ళి కూతు రాయెనే
మన కోతయ్య పెళ్ళి కొడు కాయెనే
ఆనంద మానందమాయెనే

దోమకీ, కోతికీ పెళ్ళయి పోయింది.

దోమకి గర్వం మరింత ఎక్కువై పోయింది. ఇలా ఉండగ ఒకనాడు కోతి అంది—

"దోమా ! దోమా ! నేను అంగడికి వెళ్ళివస్తాను. నువ్వు ఇంట్లో జాగ్రత్తగా వుండు. వంట వండి సిద్ధంగా వుంచేం-"

"అలాగే....అంది" దోమ. కాని, మళ్ళీ "అబ్బ ఇప్పుడెవ వండుతారు. హాయిగా పడుకుంటాను" అని మనసులో అనుక దోమ పాట పాడసాగింది.

గీ........! గీ........!
గీ........! గీ........!
ఏడుమూళ్ళ తొండముతోను ఏనుగొస్తే పొమ్మన్నానూ
గీ........! గీ........!
గీ........! గీ........!
వంకర టింకర వీపుతోనూ ఒంటెవస్తే పొమ్మన్నానూ
గీ........! గీ........!
గీ........! గీ........!

దోమా - కోతీ

తొర్రి తొర్రి పళ్ళతోనూ గుర్రం వస్తే పొమ్మన్నానూ

గీ.........! గీ.........!

గీ.........! గీ.........!

కటికి నలుపూ గుడ్డికన్నూ కాకివస్తే పొమ్మన్నానూ

గీ.........గీ.........! గీ.........!

దోమ ఇలా పాడుకుంటూ ఉంటే ఇంతలో కోతి వచ్చింది.

"ఏం దోమా! పాడుకుంటూ కూర్చున్నావా? వంటయిందా?"

"అయ్యో! వంటా! పాట సందడిలో వంట మరిచిపోయాను" అంది దోమ.

"ఓహో! నీ కింత గర్వంగా ఉందా? చూసుకో నిన్నేం చేస్తానో చంపేస్తాను."

"ఓహో! బెదిరిస్తున్నావే, ఏదీ చంపు చూద్దాం. నీ ముక్కులో దూరి దాక్కుంటాను" అని కోతి ముక్కులో దూరింది దోమ.

"హు....హు....హు అరె ముక్కులో దూరింది. ఎలాగ? ముక్కు దురద హు....హు....హచ్చి హచ్చి" కోతి గట్టిగా తుమ్మే సరికి, దోమ క్రింద పడింది. నడ్డి విరిగింది. అక్కడితో దోమ గర్వం అణిగింది.






శ్రీల చాల తెలివైన పిల్ల. పెద్దకళ్ళు, వాల్జడ, ఎప్పుడు చూచినా నవ్వు
కలకలలాడుతూ వుంటుంది. లీలకి పదమూడేళ్ళుంటాయి. అ
ఏడవతరగతి మొదటి తరగతిలో ప్యాస్ అయింది. హైస్కూలులో ఎ
దవ తరగతి చదివించాలని వాళ్ళ అమ్మా, నాన్న ఎంతో సరదాప
కాని వాళ్ళ ఊరు వెదురుపాకలో అప్పర్ ప్రయిమరీ వరకే ఉంది.
వూరికి రెండు కిలోమీటర్ల దూరంలో కొత్తపేట ఉంది. అక
హై స్కూలు ఉంది. లీల చదువుకోసం లీల తల్లిదండ్రులకు ఆ క
పేటలో కాపరం పెట్టేటంత తాహతులేదు. ఎలాగ?

లీల ఊళ్ళోనే సూర్యకాంతం అనే అమ్మాయి కూడా
ఏడవ తరగతి ప్యాస్ అయింది. అదే వయసు, కొస్త సన్నగా పొ
ఉంటుంది. అంతే తేడా. తెలివైన పిల్లే!

ఆఖరుకి ఏమి నిశ్చయించారంటే - లీల, సూర్యకాంతం వాళ్ళ వెదురుపాక నుంచి రోజూ కొత్తపేటకి జతగా నడిచి వెళ్ళి బడిలో చదువుకొని సాయంత్రం ఇంటికి జట్టుగా కలిసిరావడానికి నిశ్చయించుకున్నారు.

వెదురుపాక నుంచి కొత్తపేటకు వెళ్ళే రోడ్డు రెండు కిలోమీటర్లు. కాని అడ్డదారిని పొలాలూ పొదలూ దాటి వెళ్తే ఒకటిన్నర కిలోమీటర్లే! సాధారణంగా ఈ దారిని ఎవ్వరూ వెళ్ళరు. ఎందుచేతనంటే, దారిలో కొంతభాగం పొదలూ, ముళ్ళడొంకలూ - ఒక చిట్టడవిలాగా గుబురుగా చెట్లు పెరిగి ఉంటాయి.

లీల, సూర్యకాంతం - ఇద్దరూ కాస్త ధైర్యం గల పిల్లలే. అంచేత ఎప్పుడైనా ఇంట్లో ఆలస్యం అయితే, వాళ్ళు గబగబా ఈ అడ్డదారిని బడికి వెళ్తూ ఉంటారు - క్రూరజంతువులూ, దొంగభయాలు లేవు గనుక.

కొత్తపేట బడిలో శారద టీచరుకి పువ్వులంటే ఎంతో ఇష్టం. అంచేత అప్పుడప్పుడు ఆడపిల్లలు గులాబీ పువ్వులనీ, చామంతి పువ్వులనీ-ఏవో పువ్వులు తీసుకెళ్ళి 'బహుమతి' ఇస్తూ ఉంటారు. శారద టీచర్ "థాంక్యూ" అని నవ్వుతూ పుచ్చుకుంటారు.

ఒక రోజున ఏం జరిగిందో తెలుసా ? సూర్యకాంతం - కొత్తపేటలో వాళ్ళ మామయ్య ఇంట్లో ఏదో పండుగ అయితే, అక్కడికి పొద్దున్నే వెళ్ళిపోయింది. అంచేత లీల ఒక్కతే బడికి బయలు దేరింది.

బడి సరిగా పది గంటలకి ప్రారంభం. 9-50 నిమిషాలకి పిల్లలందరూ బారులు తీర్చి ప్రార్థన చేస్తారు. తరువాత అందరూ వరుసగా వారివారి తరగతుల్లోకి వెళ్తారు.

ఆ రోజున లీల ప్రార్థన సమయానికి రాలేదు. పది గంటలు కొట్టారు. రాలేదు; క్లాసులో శారద టీచర్ హాజరుపట్టి తీసుకోవాలని పేర్లు పిలిచారు.

లక్ష్మి పి. వి. - ప్రజంట్

మాణిక్యాంబ - ప్రజంట్

నిర్మల, డి. - ప్రజంట్

ప్రమీల - ప్రజంట్

రామాయమ్మ - ప్రజంట్

అనూరాధ - ప్రజంట్

భానుమతి - ప్రజంట్

చంద్రిక - ప్రజంట్

జమున - ప్రజంట్

సూర్యకాంతం - ప్రజంట్

లీల, కె. - (పేరు పలకలేదు)

"ఏం సూర్యకాంతం నువ్వు వచ్చావే, ఏదీ నీ స్నేహితురాలు లీల రాలేదేం ఇవాళ ఇంకా?" అని అడిగింది శారద టీచర్.

"అదేమోనండీ, నేను ముందుగా వచ్చేశా" అంది సూర్యకాంతం.

తిరుమలమ్మ - ప్రజంట్

విమలాబాయి - ప్రజంట్

వత్సలా - ప్రజంట్

అదే సమయానికి లీల కంగారుపడుతూ గబగబా క్లాసు గది లోనికి వచ్చింది. "సారీ టీచర్, ఆలస్యం అయిపోయింది" అంది. శారద టీచర్ లీలవైపు చూశారు. తలమీద జుత్తంతా రేగి ఉంది. ముఖం నిండా చెమటలు! చేతిగాజులు రెండు విరిగి పోయినట్టున్నాయి. శారద టీచర్‌కి కోపం వచ్చింది.

"ఏం లీలా! ఎందుకు ఆలస్యంగా వచ్చావు? ఎక్కడికి వెళ్ళావు?" అని గట్టిగా అడిగింది. "లేదండీ టీచర్, సూర్యకాంతం కోసం చూసి చూసి, రాకపోతే నేను గబగబా అడ్డదారి వెంట వచ్చాను టీచర్. అక్కడ ...అక్కడ....అడవిచామంతి పువ్వులు ఉంటే మీ కోసం కోసి తెద్దామని వెళ్ళాను టీచర్...." అంది కంగారుగా.

"అయితే ఇంత ఆలస్యమా! అదేమిటి, నీ మెడలో పూసల హారం!"

"అది కాదండి టీచర్! అప్పుడేమో....అప్పుడేమో! గడ్డి పువ్వులు కోస్తూ ఉంటే - ఈ తెగిపోయిన పూసలహారం దొరికింది టీచర్....!" అంది లీల.

"ఆ అడవిలో పూసల హారాలు దొరుకుతాయా! అబద్ధాలూ నువ్వూను. ఎప్పుడు నేర్చుకున్నావ్ ఈ అబద్ధాలు! ఊ....తరువాత? ఏవీ ఆ పువ్వులు ఏవీ...."

"తరువాత టీచర్....ఆ పువ్వులు అక్కడ పారేసి పరుగెత్తుకు వచ్చేశాను టీచర్!"

"బాగుంది .... అడవిపువ్వులు కోసుకుంటుంటే పూసలహారం దొరికిందట ఈ అమ్మాయికి! - అంచేత ఆ పువ్వులు అక్కడే పారేసి, ఈ పూసలహారం మెడలో వేసుకుని వచ్చింది, ఆలస్యంగా తగుదునమ్మా

అని. చెప్పు నీ కెవరు ఆ పూసలహారం ఇచ్చారు?....ఆ పువ్వులు ఎందుకు తేలేదు. నీ తల వెంట్రుకలన్నీ చెదిరి వున్నాయెందుకు ?" కోపంగా అడిగింది టీచర్,

"అక్కడ....అక్కడ ఒక రౌడీ నా వెంట పడ్డాడు టీచర్ ! నాకు భయంవేసి పరుగెత్తుకుని వచ్చాను. ఆ తొందరలో పువ్వులను పారేశాను టీచర్ !"

"సరిసరి ! నేను అనుమానించినట్టే అయింది. ఎవడా రౌడీ ? వాడే నీకు ఆ పూసలహారం ఇచ్చాడా ! చెప్పు !?"

"లేదండీ....వాడెవడో నాకు తెలియదండీ ! నన్ను పట్టుకోడానికి వెంట తరిమాడండీ - నేను పరుగెత్తుకు వస్తూ ఉంటే త్రోవలో రాయి తగిలి పడిపోయానండి. అంచేత నా జడా, జుత్తు రేగిపోయిందండీ,"

"అబద్ధాలు ! నీవంటి అమ్మాయిలు బడిలో చదివితే బడికి అప్రతిష్ఠ....నేను ఇటువంటి పిల్లల్ని బడిలో ఉంచను. బడికి అపకీర్తి ! ఫో....గెటౌట్........" అని అరిచింది టీచర్,

శారద టీచరు లీలను గెటౌట్ అనగానే సూర్యకాంతానికి ఏడుపు వచ్చి లేచి - "టీచర్, లీల మంచి పిల్లేనండి.... ఆ అమ్మాయి అబద్ధాలు ఆడదండీ.... నిజమే అయి ఉంటుందండీ !.... లీల ఆలశ్యానికి నేనే కారణమండీ ! చెప్పకుండా, పొద్దున్నే ఈ ఊరు వచ్చేశానండి, పాపం ఒంటరిగా వస్తూ ఉంటే ఎవరో దారి కాసి........"

"చాలు, నువ్వు సమాధానం చెప్పనక్కరలేదు. ఆ దిక్కుమాలిన చవకబారు రంగుపూసలొకటి దీనికి దొరికాయట అడవిలో !....ఏదీ.... ఆ హారం ఇలా ఇయ్యి చూస్తాను" అని కోపంగా అడిగింది. లీల, ఆ సగం తెగిన పూసలహారం టీచరు చేతికి ఇచ్చింది...."సరే! నువ్వు వెళ్ళు.

మీ నాన్నగారితో ఈ సంగతంతా చెబుతాను. సరియైన సమాధానం వస్తేనే గాని నిన్ను క్లాసులోనికి రానీయను"

అని ఆ శారదా టీచర్ తనపర్సులో ఆ పూసలహారం పెట్టుకుంది. లీల, సిగ్గుతో తలవంచుకొని, ఏడుస్తూ ఇంటికి వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం ఒక రిక్షామీద ప్రత్యేకంగా శారదా టీచర్ లీల ఇంటికి వచ్చింది....లీల నాన్నకి జరిగిన సంగతంతా చెప్పింది, లీలని వీథిలోనికి పంపకుండా ఇంట్లోనే బంధించి ఉంచమని సలహా ఇచ్చి వెళ్ళిపోయింది, అ రాత్రి లీలతండ్రి లీలని పిలిచి - "ఏం లీలా నిజం చెప్పమ్మా ?" అని అడిగాడు.

"నిజంగానే నాన్నా ! ఆ పొదలలో నేను గడ్డి పువ్వులు కోస్తూ ఉంటే అక్కడ ఒక హారం దారం సగం తెగి కిందపడి ఉంది....అది తీసి నేను నామెడకి కట్టుకున్నాను. ఇంతలోనే నల్లనికోటూ, పాంటుతో ఒకడు ఎవడో నావైపు గబగబా వచ్చాడు. నాకు భయం వేసింది. పరుగెత్తాను. నా వెనుకనే నన్ను పట్టుకుందుకు వచ్చాడు. నేను ఇటూ అటూ పరుగెత్తి, గుబురుగా ఉన్న ఒక పొద చాటున దాగాను. వాడు వెళ్ళిపోయాక, బడికి పరుగెత్తుకుని వెళ్ళాను నాన్నా"- అని లీల దీనంగా చెప్పింది.

"సరేలే.... రిపోర్టుచేసి ఆ రౌడీలను పట్టిస్తాలే"-అని తండ్రి అన్నాడు....

"నాన్నా ! ఇక నేను ఆ బడికి వెళ్ళను నాన్నా ! నాకు చాలా అవమానంగా ఉంది. అందరూ నేనేదో తప్పు చేసినట్లు అంటున్నారు" అని లీల అంది.

ఇంతలో అక్కడికి లీల ఫ్రెండ్ సూర్యకాంతం వచ్చింది. "ఐ యామ్ సారీ" లీలా ! నేను నీ వెంట ఉంటే ఇది జరిగేదికాదు. అప నిందపాలు అవవలసి వచ్చింది" అని అంది.

ఆ మర్నాడు లీల బడికి వెళ్లలేదు. సూర్యకాంతం ఒక్కర్తే వెళ్లింది. తోటి విద్యార్థులందరికీ- "లీల మంచిదే.... నిజంగానే ఎవరో రౌడీ వెంట తరిమి ఉంటాడు"- అని నచ్చచెప్పింది.

"అయితే మరి- ఎక్కడైనా అడివి చెట్ల పొదల్లో ముత్యాల హారాలు దొరుకుతాయా !.... ఇందులో ఏదో గమ్మత్తు ఉంది...." అని అంది ఒక అమ్మాయి.

"సరే- లీలా వాళ్ల నాన్నగారు పోలీసులకి రిపోర్టు చేస్తారట. చూద్దాం...." అని సూర్యకాంతం అంది.

సాయంత్రం బడి ముగిసింది. సూర్యకాంతం ఒంటరిగా ఇంటికి బయలుదేరింది.... కాని సాయంత్రం 6, 7, 8, 9 గంటలయినా సూర్య కాంతం ఇంటికి రాలేదు !

ఆ మర్నాడు క్లాసులో అంతా గోల ! ఆశ్చర్యపోయారు.

సూర్యకాంతం మిస్సింగ్....

అంతేకాదు.... శారదా టీచరు పర్సుకూడా ఎవరో దొంగిలించారు ! అందులోని హారంకూడా మిస్సింగ్.

అరే ! ఇదేమిటి !....

ఆ రౌడీ ఎవరు ? ఆ పూసల హారం ఎవరిది ? సూర్యకాంతం ఏమయింది ? పోలీసువారు ఏం చేస్తున్నట్లు.... లీల మీద పడిన నింద నిజమా ! అబద్ధమా ! లీల దోషా, నిర్దోషా ?

అంతా అగమ్యంగా వుంది.

పోలీసులకు లీల నాన్నగారు రిపోర్టు చేశారు. ఎవడా నల్లదుస్తుల రౌడీ-పొదలచాటున ఎందుకు తిరిగాడు ! ఆ పూసల హారం ఎవరిది ? ఆ పర్సు ఎవరు దొంగిలించారు. సూర్యకాంతం అనే అమ్మాయి ఏమ యింది. ఈ సమస్యలన్నీ తెలివిగా పరిష్కరించాలి. ఇందుకోసం ప్రత్యే కంగా ఒక డిటెక్టివ్‌ని నియమించారు.

ఆ డిటెక్టివ్ పేరు మిష్టర్ గోపి....గోపి ఒక సన్యాసిదుస్తులు ధరించి మారువేషంలో ఆ చిట్టడవి దగ్గరికి వెళ్ళాడు

"సాంబశివా శివసాంబశివా శివసాంబశివా శివసాంబశివా" అను కుంటూ అడవిలోకి వచ్చి ఒక మర్రిచెట్టు నీడని కూర్చున్నాడు, ఆసనం వేసి. దూరంగా పొదలచాటున నిజంగానే ఒక నల్లదుస్తుల అబ్బాయి హేట్ పట్టుకుని ముఖం కనబడకుండా గబగబా నడిచి వెళ్ళిపోతున్నాడు. డిటెక్టివ్ గోపీ ఆ అబ్బాయి వెనకాలే వెళ్ళాడు. కాని ఆ నల్లదుస్తుల అబ్బాయి అదృశ్యుడయ్యాడు. సన్యాసి వేషంలో ఉన్న డిటెక్టివ్ గోపీ మళ్ళీ తిరిగి తన ఆసనం దగ్గరికివచ్చి చూసేసరికి వాని పోలీసు దుస్తులు ఉన్న సంచీ ఎవరో ఎత్తుకుపోయారు.

అరె! ఎవడో మాయలమారి దొంగ ఈ అడవిలో ఉన్నాడే——

"హరహర శివ శివా" అంటూ కూచున్నాడు గోపీ ఆ రాత్రల్లా.

ఆ మర్నాడు ఉదయం పోలీసు దుస్తులలో ఉన్న ఇంకో అబ్బాయి ఒక నగల వర్తకుడి షాపుకివెళ్ళి ఒక హారాన్ని తీసి-చూపించి, ఏమండీ! ఈ హారం మీ షాపులోనిదేనా ? అని అడిగాడు. "అవును ఈ హారం మా దుకాణంలోనిదే ! ఈ మధ్యనే పోయింది. అసలు మీకిది ఎక్కడ దొరికింది ?" అని అడిగాడు. "అదంతా మీ

కెందుకు? నేను పోలీసు డిపార్టుమెంటుకు చెందిన డిటెక్టివ్ సూరిని"
అని చెప్పాడు.

వెంటనే డిటెక్టివ్ సూరి టెలిఫోను తీసి "హల్లో! ఐ యా
డిటెక్టివ్ గోపీ. ప్లీజ్ సెండ్ ఎ డజన్ పోలీస్‌మెన్ విత్ గన్స్.

"ఎక్కడికి?"

వెదురుపాక అడవి దగ్గరకి- అక్కడ దాగుకొని వున్నాడు
దొంగ. మీరు వెంటనే ఒక డజన్ రైఫిల్ పోలీసులను పంపండి.
చుట్టూఉన్న దారులన్నీ కాయండి అని చెప్పాడు డిటెక్టివ్ సూరి.

వెంటనే పోలీసులు ఆ అడవి చుట్టుముట్టారు. మర్రిచెట్టు కి
కాషాయ వస్త్రాలతో కూర్చున్న డిటెక్టివ్ గోపీ ముక్కు మూసు
కొంగజపం చేస్తున్నాడు- తన యూనిఫామ్ ఎవరు కాజేశారా అని!.

ఇంతలో ఒక ఆడగొంతుక: "పట్టుకో పట్టుకో" అని అరచింది
పోలీసులు నాలుగువైపులా వెళ్లి ఎవడు కనబడితే వాడిని పట్టుకున్నా
ఒక పోలీసు కాషాయ దుస్తులలోవున్న గోపీనే ఒక దొంగ అను
వాడిని పట్టుకొని లాఠీతో కొట్టడం ప్రారంభించాడు.

"ఐ యామ్ గోపీ, డిటెక్టివ్ గోపీ! నన్ను కొడతారెందుకు
అన్నాడు గోపీ. కాని వాని మాటలు వినకుండా గోపీని త్రాళ్లతో
వేశారు. ఇంతలో పోలీసు దుస్తులలోవున్న డిటెక్టివ్ సూరి వచ్చాడు
డిటెక్టివ్ గోపీ ఆశ్చర్యపోయాడు.

వీడెవడు చెప్మా నా దుస్తులు తొడుక్కుని నన్నే బోల్తా కొ
చాడు, అనుకుంటూ వుండగా "ఐయామ్ డిటెక్టివ్ సూరి" అని
గొంతుతో అన్నాడు. ఈ డిటెక్టివ్‌లంతా అంతే. గొంతుకలు వ
మాట్లాడుతారు అనుకున్నాడు గోపీ—

అసలు నిజానికి ఏమిటి జరిగిందో తెలుసా? డిటెక్టివ్ సూరి ఎవరోకాదు; తప్పిపోయిన సూర్యకాంతమే!— మారువేషంలో- మొగ దుస్తులతో తిరిగి, ఆ అడవిలో ఆఖరికి పోలీసు దుస్తులు అపహరించి— రత్నాలూ, ముత్యాల వర్తకుడి దగ్గరికి వెళ్ళి, తను భద్రపరచిన ఆ హారాన్ని చూసి, వాటిని దొంగిలించినవాడు ఆ అడవిలో దాగున్నాడని తెలిసి, పోలీసువారి సహాయంతో వాడిని పట్టుకుంది.

ఆ అపురూప రత్నాల ముత్యాలహారం ఆఫ్రికాలోని ఒక గొప్ప రాణీకి చెందినదట. అవి ఆ రాణి హిందూదేశపు వర్తకులకు అమ్మితే "వజ్రాలు అండ్ వజ్రాలు" కంపెనీవారు అవి కొని, తమ షాపులో అమ్మకానికి పెట్టారట. ఆ హారం విలువ లక్ష రూపాయలు.

అంచేత బొంబాయిలో కాపురం ఉంటున్న దొంగవ్యాపారి మిష్టర్ హ్రిక్ అనే వాడు మెల్లగా హారాన్ని ఎత్తుకుని అడవి మార్గాల ద్వారా పోతున్నాడు. వెదురుపాక అడవి చేరుకునేసరికి అక్కడ డొంకలో ఎక్కడో ఆ హారాల పెట్టె పడిపోయిందట. దానిని వెతుకుతూ ఉండగా లీల ఆ దారిని వెళ్ళింది - ఆ హారం దొరికితే తీసింది! లీలని హ్రిక్ పట్టుకోపోయాడు—లీల పారిపోయింది. ఆ మర్నాడు సూర్య కాంతం ఆ హారం ఎక్కడిదా అని తెలుసుకుందుకు మారు వేషాలువేసి. రెండురోజులు ఆ అడవిలోనే పళ్లు కాయలు తింటూ వెతగ్గా ఒక నగల పెట్టెమీద నగల వర్తకుని పేరు వుంది....

ఆ హ్రిక్ ఆ అడవిలోనే ఇంకా తిరుగుతున్నాడని తెలిసి, పోలీసులకి టెలీఫోనుచేసి దొంగని పట్టుకుంది.

ఇక అసలు డిటెక్టివ్ గోపీ— తల గోక్కుంటూ తన పోలీసు స్టేషనుకి తిరిగివచ్చాడు. సూర్యకాంతం అనే అమ్మాయి— తన ఫ్రెండ్

లీల మీద పడిన అపవాదును పోగొట్టాలనే దీక్షతో ధైర్యంగా ఆ అడవి గాలించి దొంగని పట్టుకుంది. లక్ష రూపాయల విలువైన హారాని వెతికి తేవడమే కాకుండా, లీలకు అపనిందరాకుండా చేసినందుక అందరూ సంతోషించారు. వజ్రాలు అండ్ వజ్రాలు కంపెనీవారు వేల రూపాయలు డిటెక్టివ్ సూరికి బహూకరించారు. సూర్యకాం అందులో సగం- పదివేల రూపాయలు లీలకి ప్రజంటుగా ఇచ్చింది- ఇదీ కథ.






అనగా అనగా ఒక నాన్నా, ఒక అమ్మా ఉన్నారు. వాళ్ళకి ముగ్గురు పిల్లలు. జయ, వేణు, గోపు అని వాళ్ళ పేర్లు. వాళ్ళనిచూస్తే వాళ్ళ అమ్మా, నాన్నకి ఎంతో ముద్దు. నాన్న అట్టే ముద్దుచేస్తే అమ్మ వద్దంటుంది. అమ్మ అట్టే ముద్దుచేస్తే నాన్నకి ఇష్టం ఉండదు. ఎందుకంటే అట్టే ముద్దుచేస్తే పిల్లలు చెడిపోతారని. అయినా ఆ నాన్నా అమ్మా ఆ పిల్లల్ని ఒక్కసారేనా కోప్పడేవారుకారు.

వేణూ, గోపూ కాస్త అల్లరి చేసేవారు. అయినా ఆ అల్లరి చూసీచూడనట్టు అమ్మా నాన్నా ఊరుకొనేవారు.

ఒకనాటిరాత్రి గోపూ, వేణూ వేగిరం పడుకోకుండా రాత్రి పదిన్నర గంటలవరకూ బాతాకానీ వేశారు. జయ తొమ్మిది గంటలకే నిద్రపోయింది. ఆ మర్నాడు పొద్దున్న వాళ్ళులేచి చూచేసరికి వాళ్ళ పరుపు

మీద ఒక చిన్న కాగితం మడత పడి ఉంది. వేణు ఆ కాగితం తీసి చూచాడు. అది ఒక చిన్న ఉత్తరం.

"పిల్లలూ !

మీ ముగ్గురిలో జయ మంచిపిల్ల. బాతాకానీ చేయకుండా సరిగా టైముకి నిద్రపోయింది. 'జయ'కి నా ముద్దులు.

ఇట్లు మీ

ప్రియమైన పిన్ని"

ఈ ఉత్తరం ముగ్గురు పిల్లలూ చదివారు. గబగబ లేచి ఆ ఉత్తరాన్ని వాళ్ళ అమ్మకి చూపించారు.

"అమ్మా ! ఎవరే ఈ 'పిన్ని' ?"— అని అడిగారు.

"అదేమో ! నాకు తెలియదు. మీ నాన్నని అడగండి" అని అమ్మ చెప్పింది.

ముగ్గురూ నాన్న దగ్గరికి పరుగెత్తి వెళ్ళారు.

"నాన్నా ! నాన్నా ! ఈ ఉత్తరం చూడు. పిన్ని రాసింది. నాన్నా ఎవరాపిన్ని నాన్నా ?" అని అడిగారు.

"అదేమో నాకు తెలియదుగాని, ఈ పిన్ని ఎవరో మంచిపిన్ని అయివుంటుంది. మీరు మంచిపనులు చేస్తే ఇటువంటి ఉత్తరాలు రాస్తుందేమో ?" అని నాన్న అన్నాడు.

ఆ రాత్రి వేణూ గోపూ బాతాకానీ చేయకుండా వేళకే పడుకున్నారు. ఆ మర్నాడు పొద్దున్నలేచి పరుపుమీద చూచారు. చీటీలేదు ! పళ్లు తోముకొని, ముఖం కడుక్కొని గదిలో అలమార దగ్గరకువెళ్ళి

చూచేసరికి అక్కడ ఒక కొత్త బిస్కటుపెట్టె ఉంది. ఆ పెట్టెకి ఒక చీటీ కట్టి ఉంది. దానిమీద "బహుమానము" అని రాసి ఉంది.

వేణు, గోపూ గబగబ ఆ పెట్టెవిప్పి చూశారు. అందులో ఇలా రాసి ఉంది.

"పిల్లలూ !

మీరు వేళకు నిద్రపోతున్నందులకు మీకు ఈ బహుమానము.

ఇట్లు మీ

పిన్ని"

* * *

ఇలాగే ఆ మర్నాడు పెరటి గుమ్మందగ్గర ఒక చీటీ దొరికింది అందులో ఇలా రాసి ఉంది.

"గోపూ !

నీవు సరిగా పళ్లు తోముకోలేదు. నిన్నుచూస్తే నాకు అసహ్యం.

ఇట్లు నీ

పిన్ని"

ఇలాగ ప్రతిరోజూ ఏదో ఒక బహుమానమో లేదా ఒక చీవాట్ల ఉత్తరమో పిల్లలకు దొరుకుతుండేది. అయినా ఆ మంచి పిన్ని ఎవరో ఎవరికీ తెలియలేదు.

ఒకనాడు వాళ్ళ అమ్మ ఏదో తొందర పనిమీద ఊరికి వెళ్ళింది. వారం రోజులవరకూ రాదు. జయ, వేణు గోపులకు ఏమీ తోచలేదు.

ఇంకోచిత్రం ఏమిటంటే "పిన్ని" కూడా చీటీలు, ఉత్తరాలు, ఓ
మానాలు పంపడం మానేసింది.

"నాన్నా ! మేము రోజూ ఎన్ని మంచి పనులు చేసినా 'పి
బహుమానాలు పంపదేమి ?" అని వాళ్ళ నాన్నని వాళ్ళు అడిగారు.

"అదేమో నాకేం తెలుసు ? ఆ 'పిన్ని' ఎవరో తెలుస్తే ఓ
డును. మీ అమ్మ ఊళ్ళోలేకపోవడం, 'పిన్ని' బహుమానాలు ఆగి
డం చూస్తే చిత్రంగానే ఉందికదూ !" అని నవ్వుతూ అన్నాడు నా

ఆ నవ్వులలో అర్థం ఉంది. జయ, వేణూ, గోపూ అది
పెట్టేశారు. ముగ్గురూ కలిసి రహస్యంగా ఏదో ఆలోచించారు.

ఆ మర్నాడు వాళ్ళ అమ్మ ఊరునుంచి తిరిగివచ్చింది. గది
వెళ్ళింది, అక్కడ టేబిలుమీద, అద్దం ధువ్వెనా ఉన్నచోట ఒక
ఉంది. అమ్మ ఆ చీటీవిప్పి చదివింది,

"పిన్నీ ! నీవంటి మంచి అమ్మ ఈ ప్రపంచంలో లేదు సు

ఇట్లు
నీ ప్రియమైన పిల్లలు"

అమ్మ అది చూసి నవ్వుకుంది, నాన్న కూడా నవ్వేడు.
పిన్ని ?" అని నాన్న గమ్మత్తుగా అడిగాడు.

"ఇదుగో ! ఈ అమ్మే ఆ పిన్ని" అని పిల్లలు గొల్లున న




అనగా అనగా ఒక అడవిలో పులులూ, సింహాలూ, కోతులూ, అడవి పందులూ, వెలుగుబంట్లూ, పక్షులూ, ఇంకా ఇంకా ఎన్నో ఉండేవి.

ఆ అడవికి రాజు ఎవరో తెలుసా? సింహం.

ఆ సింహం ఒకనాడు తన మంత్రి గాడిదను పిలిచి అడవిలో ఒక పెద్ద టీ పార్టీ ఏర్పాటు చేయమంది.

గాడిద ఆ టీ పార్టీకి అడవిలోని జంతువు అన్నిటినీ పిలిచింది. అన్నిపక్షుల్నీ పిలిచింది. పాముల్ని పిలిచింది. అందరినీ పిలిచింది.

అడవిరాజు సింహం టీపార్టీకి అందరూ వచ్చారు.

పులి, చారచారల కోటు తొడుక్కొని వచ్చింది.

చిరుతపులి చుక్కచుక్కల చీరె కట్టుకుంది.

నెమలి, తన ఊదా, నీలి రంగు పింఛంతో వొయ్యారంగ
వచ్చింది.

సీతాకోక చిలుక రంగురంగుల చీర కట్టింది.

చిలుక ఆకుపచ్చని కోక కట్టింది.

కోడిపుంజు ఎఱ్ఱని కుచ్చుతలపాగాతో వచ్చింది.

చీమ సింగారించుకొని వచ్చింది.

పాము పడగవిప్పి వచ్చింది. అందరూ వచ్చారు. కాని —
ఒక్కరు రాలేదు.

ఎవరో తెలుసా ?

పాపం, కోయిల రాలేదు,

* * *

కోయిల ఎందుకురాలేదు ? ఎందుకు రాలేదో తెలుసా ? దా
మంచి మంచి బట్టలే లేవు.

పాములాగ గొప్పగా పడగలేదు.

కోడిపుంజులాంటి ఎఱ్ఱని తలపాగా లేదు.

చిలుకలాంటి పచ్చని చీర లేదు.

సీతాకోక చిలుకలాంటి రంగురంగుల బట్టలులేవు.

నెమలి పింఛంలాంటి ఈకలు లేవు.

చిరుతపులిలాంటి చుక్కల చీరెగాని,

పెద్దపులిలాంటి గీరల కోటుగాని,

వెలుగుబంటిలాంటి బొచ్చుకోటుగాని- ఏమీలేవు.

బూడిదరంగు వాళ్లతో ఎలా వెళ్తుంది పాపం?

అంచేత సింహంరాజు టీపార్టీకి కోయిల వెళ్ళలేదు.

టీపార్టీలో సింహం అడిగింది:

"అందరూ నా టీపార్టీకి వచ్చారా?" అని.

అందరూ వచ్చారని అరచింది చెమిటి కాకి.

"సరే-నేటి సభ ఒక ప్రార్ధనతో ప్రారంభిద్దాం" అంది సింహం.

గాడిదగారు, తగుదునమ్మా అంటూలేచి గాడిదకాంభోజి రాగంలో ఓండ్ర పెట్టారు.

"ఛీ! ఛీ! ఇదేమిపాట! ఏదీ కోయిలమ్మ ఏదీ? రాలేదేమీ!" అని సింహంరాజు మంత్రి గాడిదని అడిగారు.

"అదేమో! నాకేం తెలుసూ?" అని గాడిద చెప్పింది.

"అయితే మీరందరూ ఇక్కడే ఉండండి. నేను పిలుచుకొని వస్తాను" అని ఆ సింహం బయలుదేరింది. తిన్నగా కోయిల కాపురం ఉన్న మామిడి చెట్టుదగ్గరికి వచ్చింది.

"కోయిలా! కోయిలా! నా టీపార్టీకి ఎందుకు రాలేదు?" అని సింహం అడిగింది, "నేను రాను. నాకు సిగ్గు" అని కోయిల విచారంగా అంది.

"అయ్యో! సిగ్గెందుకూ! నీ కెందుకు అంత విచారం" అని సింహం అడిగింది,

"అయ్యో! నాకు రంగు రంగుల చీరెలున్నాయా, బొచ కోట్లున్నాయా, తళుకు తళుకు పింఛం ఉందా? నేనెలా వచ్చేది? నను చూచి అందరూ నవ్వుతారు"- అంది కోయిల.

"కోయిలా! ఆ వచ్చిన జంతువులకీ, పక్షులకీ పైపై షోకులేగా. వాళ్ళలో ఎవరైనా నీలాగ పాడగలరా! నీవులేనిదే నా టీపార్టీ నిం లేదు. నీ పాటతో మమ్మల్ని ఆనంద పరచవూ?" అని సింహం అం

అప్పుడు కోయిల బయలుదేరి సింహం టీపార్టీకి వచ్చిం ఎవ్వరికీ కనిపించకుండా చెట్టుకొమ్మల్లో దాంకొని ఇలా పాడింది:

"కుఊ కుఊ కుఊ కుఊ కూసి పాడెదన్
వందానంబూ వనరాజమా! వనరాజమా!"

పాట ముగిసిన తరువాత సింహం ఇలా మాట్లాడింది.

"మృగములారా! చూశారా ఆ కోయిల! ఆహా ఎంత హాయి పాడింది! మీకు పైపై హంగు రంగులు ఎన్ని ఉన్నా ఆ కోయిలపా ఈ సభకి నిండు కలిగించింది.

నేటినుండి ఈ కోయిలనే నా ఆస్థాన గాయకురాలిగా నియమి న్నాను" అని గంభీరంగా ఉపన్యసించింది.

జంతువులన్నీ చప్పట్లు చరిచాయి. సభ ముగిసింది!





# చెప్పుడుమాటలు

మన తెలుగువారికి ఇద్దరు వ్యక్తులు కలిసి జాయింటుగా వర్తకం చేయడం తెలియదంటారు. ఇతర దేశాల్లో అది కాదు. ఎందరో కొందరు కలసి కొంత కొంత డబ్బు వేసుకొని ఉమ్మడిగా వర్తకం చేస్తారు. ఆ వర్తకంలో వచ్చిన లాభం పంచుకుంటారు. ఇలాగ ఉమ్మడిగా కలసి మెలసి వర్తకం చేయాలంటే ఒకరిలో ఒకరికి నమ్మకం ఉండాలి. అంతేకాదు. ఈ వర్తకం నడపడానికి అందులో ఒకరికో ఇద్దరికో అనుభవం ఉన్నవాళ్ళకి పూర్తి అధికారమిచ్చి పని చేయించాలి.

అనగా అనగా అమరావతి పట్టణంలో కొండయ్య, కూర్మయ్య అని ఇద్దరు వర్తకులుండేవారు. కొండయ్య పేరుకు తగినట్టుగానే పొడుగ్గా ఉంటాడు. కూర్మయ్య పొట్టిగా ఉంటాడు. ఇద్దరూ మంచి వారే! మంచి నమ్మకస్తులు. ఒక నాడు వాళ్ళిద్దరికి జాయింటుగా వ్యాపారం చేయాలని బుద్ధి పుట్టింది. చెరి రెండువేల రూపాయలు వేసుకొని ఒక కొట్టు పెట్టారు. ఆ కొట్టు ప్రారంభించిన నాటినుంచి

వాళ్ళకి బాగా బేరం జరిగేది, ఎందుకంటే అది కొత్తకొట్టు. ఇం
కాకుండా వాళ్ళకొట్లో ఒక వింత ఉంది. అందులో ఒకడు పొడుగు
ఒకడు పొట్టి. పొట్టివాడు గల్లాపెట్టె దగ్గర కూచొని వస్తువులు తూ
పొట్లాలుకట్టి డబ్బులు పుచ్చుకొనేవాడు. పొడుగాయన సామా
అందిస్తూ ఉండేవాడు. ఎంతఎత్తు బీరువాలు, మంచెలమీద ఉన్న వ
వైనా నిచ్చెన అవసరం లేకుండా అందుకొని ఇచ్చేవాడు. అంచే
అందరికీ ఇది చూడడానికి ముచ్చటగా ఉండేది.

వీళ్ళిద్దరి జాయింటు వ్యాపారం రోజుకిరోజూ పెరిగిపోయిం
ఇద్దరూ బోలెడు డబ్బు ఆర్జించారు. కూర్మయ్య గల్లాపెట్టెమీద కూర్చు
కూర్చొని వినాయకుడిలాగున పెద్దబొజ్జ కూడా పెంచాడు. ఆ బొ
నిండా రూపాయిలే అని వీధినిపోయే కుర్రాళ్ళు గమ్మత్తుగా అనే వా
కూడాను.

ఇలా ఉండగా కొన్నాళ్ళయాక, ఒకనాడు కొట్టు సెలవు రో
కొండయ్య గాలి షికారుకి వెళ్తూ త్రోవలో ఒక స్నేహితుడిని కలిశా
ఈ స్నేహితుడికి కొండయ్య వ్యాపారంలో బాగుపడడం ఏమీ కిట్టలే
అంచేత పుల్లలు పెట్టడం మొదలెట్టాడు.

"ఏమోయ్ కొండయ్యా! మీ వ్యాపారం బాగా సాగుతోందా?

"ఓ!"

"ఎందుకు బాగుపడదు? కష్టం అంతా నీది; ఫలం అంతా వా
ఇది లోక ధర్మమే."

"అదేమిటోయ్! అలా అంటావు? మా కూర్మయ్య అల
వాడు కాదు."

"అది కాదోయ్! వాడు కూర్చొని హాయిగా ఆర్జిస్తే నీ
పొద్దస్తమానం నిలిచి, కూలీచాకిరీ చేయడమేగా? డబ్బు ఎవరికి కా

అందరూ ఏమంటున్నారో తెలుసా ? ఆ కొట్టు కూర్మయ్యదే అనిన్నీ, నువ్వు జీతం రాళ్ళకి కూలీపని చేస్తున్నావని అంటున్నారు. అయినా మీ సంగతి నా కెందుకులే'' అని అన్నాడు.

కొండయ్యకి మనసులో కష్టం అనిపించింది. "అవును. తాను ఎందుకు నిలబడి పనిచేయాలి! వాడు కాలుమీద కాలు వేసుకొని ఎందుకు కూచోవాలి. రేపటినుంచి నేనే గల్లాపెట్టె దగ్గర కూచుంటాను. వాడే సామాన్లు అందిస్తాడు.'' అనుకుంటూ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు కొట్టు తెరవగానే కొండయ్య గల్లాపెట్టె దగ్గర కూచున్నాడు. అదిచూసి కూర్మయ్య ఆశ్చర్యపోయాడు. "ఏమోయ్ కొండయ్యా ! నా జాగాలో కూచున్నావు ?'' అని అడిగాడు.

"ఇది నీజాగా అని రాసిఉందా ? ఈ జాగాపై నీకు ఎంత హక్కు ఉందో నాకు కూడా అంత హక్కు ఉంది తెలుసా ? ఇకముందు నీ పప్పులు ఉడకవులే ! నేనే ఇక్కడ కూచుంటాను. నువ్వు సామాన్లు అందియ్యి'' అన్నాడు.

కొండయ్యలో ఈ మార్పు రావడం కూర్మయ్యకి ఆశ్చర్యం వేసింది. సరే, ఆ రోజునుంచీ తానే సామాన్లు అందిస్తానన్నాడు.

ఇంతలో ఒకావిడ కొట్టుకువచ్చి, "ఏమండీ పది పైసలు కరక్కాయలు ఇస్తారా ?'' అని అడిగింది. కరక్కాయలు ఎక్కడున్నాయో మన కూర్మయ్యకు తెలిస్తేగా ! ఈ డబ్బామూత, ఆ డబ్బామూత తెరుస్తూ వెతుకుతున్నాడు. ఇంతలో ఆ వచ్చినావిడకు విసుగెత్తి. ఇంకో కొట్లో కొనుక్కుంటాననుకుంటూ వెళ్ళిపోయింది.

పొద్దున్నే వచ్చిన బేరం పోయినందుకు కొండయ్యకి కోపం వచ్చింది. "శనిలాగున నువ్వు గల్లాపెట్టె దగ్గర కూచున్నావు గనుకనే బేరం చెడిపోయిందని'' కూర్మయ్యను అన్నాడు. ఇద్దరూ ఏదో వాదించు

కున్నారు. ఇంతలో అగ్గిపెట్టె కావాలంటూ ఒక కుర్రాడు వచ్చాడు. ఆ పెట్టెలు బీరువా మీది అంతస్తులో వున్నాయి. కూర్మయ్యగారికి, అందు తేగా! ఒక స్టూలు వేసుకున్నాడేగాని అవి అందలేదు. ఎలాగో అంతస్తులు ఎక్కి తీయబోయేసరికి బీరువా వొరిగి అందులో సామానులన్నీ క్రింద పడిపోయాయి.

ఇదీ కారణం. ఇద్దరు వర్తకసోదరులూ పోట్లాడుకొని, తమకొట్టు మూసివేశారు. ఇద్దరు విడిపోయారు కూడాను!

చెప్పుడుమాటలు ఎంత చెడుగేనా చేస్తాయి! ఏం?






# ఆటలరాయుడు

అనగా అనగా ఒక ఊళ్ళో ఒక ముసలి బీద తాత ఉన్నాడు. ఆ తాతకి ముగ్గురు కొడుకులు. ఒకనాడు ఆ తాత ముగ్గురు కొడుకులను దగ్గరకు చేర పిలిచాడు.

"రాముడూ, భీముడూ, రంగడు ఇలా రండ్రా! నేను ముసలి వాడినై పోయాను. ఇంకా కష్టపడలేను. మీరే కష్టపడి డబ్బు ఆర్జించాలి నన్ను పోషించాలి" అన్నాడు!

"అలాగే నాన్నా! ఇప్పుడే వెళ్ళి ఉద్యోగంలో ప్రవేశిస్తాము. పదరా భీముడు, పదరా రంగడు!" అన్నాడు రాముడు.

రాముడు, భీముడు, రంగడు ముగ్గురూ బయలుదేశారు. తిరిగా
తిరిగారు, తిరిగారు ఉద్యోగం కోసం.

రాముడు ఒక ఆఫీసుకి వెళ్ళాడు.

"ఏమండీ! మీ ఆఫీసులో ఏదైనా ఉద్యోగం ఇస్తారా.
చేస్తాను" అని అడిగాడు.

"ఉద్యోగాలు ఖాళీలులేవు వెళ్ళు వెళ్ళు" అని గదిమాడు ం
మాని.

ఒక షాపు దగ్గరికి వెళ్ళాడు భీముడు.

"ఏమండీ! మీ షాపులో ఉద్యోగం ఇస్తారా చేస్తాను."అన్నా

"మాకే బేరాలులేక చస్తుంటే నీకు ఉద్యోగమా! వెళ్ళవయ
అన్నాడు షావుకారు.

రాముడు మరోచోటికి వెళ్ళాడు.

"ఏమండీ! ఏదైనా కూలిపని చేస్తాను. పని ఉందా?" అని
గాడు.

"ఇప్పటికే బోలెడుమంది కూలీలు ఉన్నారు. ఇంక వ
అన్నాడు కామందు.

భీముడు ఒక స్కూలు దగ్గరికి వెళాడు.

"ఏమండీ! టీచరమ్మగారూ, మీ బడిలో బంట్రోతు ఉద్యో
ఉందా?" అని ప్రాధేయపడ్డాడు,

"లేదు. లేదు. ఇద్దరు బంట్రోతులున్నారు. చాలు. ఇప్పుడవసరం లేదు" అంది టీచరమ్మ.

రాముడు, భీముడు, రంగడు ముగ్గురూ ఓ చోట చేరారు.

"అయ్యో రామా ! ఎక్కడికెళ్ళినా ఉద్యోగం దొరకలేదు, ఎలాగ ?" అని నిట్టూర్చాడు రాముడు.

"కట్టుకున్న బట్టలు చిరిగిపోయాయి. తలకు నూనె లేదు. ఎలాగ ?" అన్నాడు రంగడు.

"ఇంత దరిద్రం ఎప్పుడూలేదు" అని కూలబడ్డాడు రాముడు.

"దరిద్రదేవత మనల్ని పట్టి పీడిస్తుందేమో !" అని బాధ పడ్డాడు భీముడు.

"ఆ ధనదేవతకేనా కరుణ రాదు" అని గొణిగాడు రంగడు.

"ఓ ధనదేవతా ! మామీద కరుణరాదా ?

దేవా కావగ రావోయీ
దేవా కావగ రావోయీ
నేడే జననం
రేపే మరణం

ఆహా ! మాదూ
గతి ఇంతేనా"

"అబ్బాయీ ! నేనే ధనదేవతని. మీరు పడుతున్న కష్టాలు చూసి కనికరించి వచ్చాను. మీ కష్టాలు తీరేవరకూ మీతో కొంతకాలం ఉంటాను. సహాయం చేస్తాను" అంది.

"నమస్కారం ధనదేవతా! నమస్కారం. నీవు మాతో ఉంటే ఇక మాకేమి కొదువ?" అన్నాడు రాముడు ఆనందంగా.

"మీతో కొంతకాలం వరకే ఉంటాను. ఈలోపున మీ మీ అదృష్టాలు మీరే చూసుకోవాలి" అంది ధనదేవత.

"చిత్తం! మహాప్రసాదం" అన్నాడు రాముడు.

ధనదేవత అప్పటి నుంచి ఆ ముగ్గురు అన్నదమ్ముల దగ్గర ఉంది. అంటే ఏమిటి? వాళ్ళు కోరిన ధనం అడగ్గానే ఆ ధనదేవత ఇచ్చేది.

ఓ రోజు రాముడు ధనదేవతని ఇలా అడిగాడు!

"ధనదేవతా! నాకు పదివేల రూపాయిలు కావాలి" అని.

"ఇంద తీసుకో....ఇదిగో అబ్బాయ్!" అంటూ,

"రహస్యం! ఈ ధనంతో నువ్వేమిటి చేస్తావు?" అని అడిగింది ధనదేవత.

"నేను వ్యాపారం చేస్తాను దేవీ!" అన్నాడు రాముడు వినయంగా.

"సరే మంచిది! శుభమగుగాక" అని దీవించింది ధనదేవత.

మరునాడు భీముడు ధనదేవతని,

"ధనదేవతా! నమస్కారం. నాకు పదివేల రూపాయలు కావాలి" అని అడిగాడు.

"సరే, ఇంద తీసుకో, ఇదుకో అబ్బాయ్! ఒక రహస్యం. ఈ ధనంతో నీవేమిటి చేస్తావు?" అని అడిగింది ధనదేవత,

"నేనా ? నేను గొప్ప చదువు చదువుకుంటాను. గొప్ప ఉద్యోగం చేస్తాను. అందుకు ఈ ధనం" అన్నాడు అణకువగా భీముడు.

"సరే, తీసుకో ! నీకు శుభమగుగాక !" అని ఆశీర్వదించింది ధనదేవత.

ఆ సాయంత్రం మూడోవాడు రంగడు మెల్లగా ధనదేవత దగ్గరకు వచ్చి-

"ధనదేవతా ! నమస్కారం !" అన్నాడు.

"ఏమిటి నాయనా ! నీకేమి కావాలి ?" అని అడిగింది దేవత రంగడిని.

"అరవై వేల రూపాయలు కావాలి !" అన్నాడు రంగడు.

"అరవై వేలా ?" ఆశ్చర్యపోయింది ధనదేవత !

"అహా ! కనీసం అరవై వేలు"

"సరే, ఇంద. ఇదిగో అబ్బాయీ! చిన్న రహస్యం. ఈ ధనంతో నువ్వేమిటి చేస్తావు ?" అని అడిగంది ధనదేవత.

"అదంతా నీకెందుకు ? ఆడుతానో, పాడుతానో, ఖుషీగా కాలం గడుపుతానో! నీవు ఉంటూ ఉండగా నాకేం కొదువ" అన్నాడు నిర్లక్ష్యంగా రంగడు.

"సరే, ఇంద తీసుకో !" అంది ధనదేవత,

రాముడు పదివేలుపెట్టి ఒక వ్యాపారం ప్రారంభించాడు. భీముడు పదివేలుపెట్టి చదువుకుంటున్నాడు. మన రంగడున్నాడే, వాడు పూల రంగడిలా తయారయాడు.

"రండిరా రండి. ఈరోజు సినిమాకి వెళదాం" అంటూ తన నేస్తాలను పిలిచాడు.

"రేపు సరదాగా గాలిపటాలు ఎగరేసుకుందామా !" అన్నారు అతని నేస్తాలు.

"ఓ బొంగరాలాట ఆడుదాం" అన్నాడు రంగడు.

"ఆ తోటలో గొల్లభామలు. తూనీగలు ఉన్నాయి. వాటిని పట్టుకుందాం" అన్నాడు వాళ్ళలో ఒక కుర్రవాడు.

"రంగు రంగుల చీరెలు కట్టుకున్న సీతాకోక చిలకల్ని కూడా పట్టుకుందాం" హుషారుగా గంతులేశాడు రంగడు.

"హోయీ ! హోయీ !
ఆటలలోనే హోయీ !
చేతిలోను డబ్బు ఉంటె
నేతిలోను రొట్టె
జేబులోను డబ్బు ఉంటె
డాబుకేమి కొదువ"

ఇలా కేరింతలు కొడుతూ, పాటలు పాడుకుంటూ, రోజూ డబ్బు ఖర్చు పెట్టి సరదాగా కాలక్షేపం చేశాడు. కొన్నాళ్ళయాక – ధనదేవత ఓరోజు – "అబ్బాయిలూ ! అబ్బాయిలూ ?" అని పిలిచింది.

"ఎందుకు ? ఎందుకు పిలిచావు ధనదేవతా !" అని అడిగారు రాముడు, భీముడు.

"ఎందుకు పిలిచావో త్వరగా చెప్పు. నేను ఈరోజు సినీమాకి వెళ్ళాలి" అని తొందర చేశాడు రంగడు.

"ఇదిగో వినండి. ఈ రోజున ఇప్పుడే నేను మిమ్మలను విడిచి వెళ్ళిపోతున్నాను. ఇన్నాళ్ళూ మీ దగ్గరే ఉన్నాను. ధన సహాయం చేశాను. ఇప్పుడు వెళ్ళిపోవాలి" అంది ధనదేవత.

"ఆఁ వెళ్ళిపోతావా ?" అని కంగారుపడ్డాడు రంగడు.

"అవును మరి, కొంతకాలం వరకే ఉంటానని చెప్పేనుగా ఏమోయ్ రాముడూ నువ్వేమంటావు !" అంది ధనదేవత.

"ధనదేవతా ! నీ సహాయాన్ని మరిచిపోను. నీవు ఇచ్చిన ధనంతో వ్యాపారం పెట్టి లాభం పొందేను. ఇప్పుడు నువ్వు వెళ్ళినా, నేను కష్టపడి బతకగలను." అన్నాడు రాముడు.

"ఓయీ, భీమన్నా ! నీ సంగతేమిటి ?" అంది దేవత.

"దేవతా ! నీ సహాయం వలన నేను చదువుకొని ఉద్యోగం సంపాదించాను. నీవు చేసిన మేలు మరిచిపోను" అన్నాడు భీముడు కృతజ్ఞతగా.

"ఓయీ రంగడూ ! నువ్వేమంటావు ?" అంది ధనదేవత.

"ఓ ధనదేవతా ! నీవు నన్ను విడిచి వెళ్ళిపోతావా ? నువ్వు వెళ్ళిపోతే ఎలాగ ?" అన్నాడు రంగడు దిగులుగా.

"ఏం ? నీకు మొదట అరవై వేలు ఇచ్చానుకదా ! తరవాత కూడా అడిగినపుడల్లా ఇస్తూనే ఉన్నాను. అదంతా ఏమయినట్టు ?" అంది ధనదేవత,

"అంతా ఖర్చు చేసేశాను ధనదేవతా! ఆటల్లోను, పాటల్లోను ఖర్చు చేసేశాను." అన్నాడు రంగడు మరింత దిగులుగా.

"అయితే ఇప్పుడు నీ దగ్గర ఏమీ లేదా?" అని అడిగింది ధ దేవత.

"ఒక్క పైసా అయినా లేదు. ఇప్పుడు సినిమాకి వెళదామం టిక్కెట్టుకి డబ్బులు లేవు" అన్నాడు రంగడు.

"పిచ్చివాడా ఇంతేనా! నీకు డబ్బిచ్చి మంచి అవకాశం ఇ దుబారా ఖర్చుచేసి అవకాశం పాడుచేసుకున్నావు. ఉత్త ఆటలరాయు వయిపోయావు. నీ పని ఇంతే! నీ అన్నలు చూడూ! ఇచ్చిన అ కాశం పోగొట్టుకోకుండా బాగుపడ్డారు. అందుకే అంటారు:

దేనికి అయినన్ సమయము కలదు
దేనికి అయినన్ మితిగలదూ
సమయము తప్పుచు
మితి మీరుచునూ
ఎల్లవేళలా ఆటలు ఆడిన
ఎల్లవేళలా పాటలు పాడిన
బువ్వేటు మనకు వచ్చున్!"

అందుచేత నీ తప్పుకి నీవే అనుభవించు. నేను వెళుతున్నాను అని చెప్పి ధనదేవత అదృశ్యమయింది.

రంగడు దిగులుగా కూలబడి నిట్టూర్చాడు. "బాలల్లారా! న బుద్ధి వచ్చింది. నాలాగా దుబారా ఖర్చుచేయకండేం? పనికి వచ్చే ఖ చేయండి" అంటూ లెంపలు వేసుకున్నాడు.



# కోతులకోటయ్య

అనగా అనగా ఒక ఊళ్ళో కోటయ్య అని ఒక కోతులవాడు ఉండేవాడు. అతడిని అందరూ 'కోతుల కోటయ్య' అని పిలిచేవారు. అతడి దగ్గర రెండు కోతులు ఉండేవి. రోజూ ఆ కోతుల కోటయ్య ఆ రెండు కోతులకీ మెళ్ళో తాళ్ళు కట్టి, ఆడించడానికి వీధుల్లోకి తీసుకువెళ్ళేవాడు. ఒక చేతిలో డోలు, ఇంకొక చేతిలో ఒక చిన్న బెత్తం పట్టుకొని, రోడ్డు పక్కన చెట్టుకింద డోలు వాయించేవాడు. ఆ డోలు విన్న జనం చుట్టూ మూగేవారు.

కోటయ్య, ఆ కోతుల్లో ఒకదానికి 'రామయ్య' అనీ, రెండవ దానికి 'సీతమ్మ' అని పేర్లు పెట్టాడు. రామయ్య కోతికి చిన్న పంచెకట్టి, చొక్కా వేసేవాడు. సీతమ్మ కోతికి చిన్న చీరకట్టి రవికె తొడిగి, మెళ్ళో పూసలు అవీవేసి ముస్తాబు చేసేవాడు.

డోలు వాయిస్తూ, 'రామయ్యా అడవికి వెళ్ళు'' అని కోటయ్య తనచేతిలో ఉన్న బెత్తం చూపుతూ అనగానే వెంటనే రామయ్య టక్

టక్ మంటూ వెళ్ళేది. "ఇదిగో, సీతమ్మ! నీ రాముడు అడవికి వెళ్ళిపో తున్నాడు." అనగానే సీతమ్మ చప్పున పరుగెత్తుకుంటూ వెళ్ళి మొగకోతి కాళ్ళకి అడ్డంగా పడుకునేది.

'అశోకవనంలో సీత ఎలా కూర్చుంది?' అని కోటయ్య అనగానే ఆ సీతమ్మకోతి, విచారంగా తల వంచుకుని కూర్చుని. వెక్కి, వెక్కి ఏడుస్తూన్నట్లు నటించేది. ఇంతేకాక, ఇంకా డాన్సులు, కుప్పిగంతులు, ఎన్నో వినోదాలు, ఆ కోతుల చేత చేయించేవాడు. ఇవన్నీ చూచి పిల్లలూ పెద్దలూ ఎంతో ఆనందించి, తలో అయిదు పైసలు పది పైసలూ ఆ కోటయ్య డబ్బాలో వేసేవారు. ఇలా ఒక్కొక్క ఆటకి రెండు మూడు రూపాయలు సంపాదించేవాడు.

జనం వెళ్ళిపోయాక ఒక పావుగంట పోనిచ్చి మళ్ళీ డప్పు కొట్టేవాడు. మళ్ళీ జనం మూగేవారు. మళ్ళీ కోతుల చేత ఆడించేవాడు. మళ్ళీ డబ్బు సంపాదించేవాడు.

ఇలాగ కోతుల కోటయ్య పొద్దున్నుంచీ సాయంత్రం వరకు ఆ కోతులకు కొంచెం కూడా విశ్రాంతి ఇవ్వకుండా గెంతించి రోజుకు సుమారు పది పదిహేను రూపాయలు సంపాదించేవాడు. ఇలా ఉండగా ఒకసారి ఏమయింది? కోతుల కోటయ్య ఒక కోతినే తీసుకువచ్చి ఆడిస్తు న్నాడు. చూస్తున్న జనం "ఏమయ్యా ఎప్పుడూ రెండు కోతులను తీసుకు వచ్చేవాడివే! ఈ రోజు ఒక్క కోతినే తీసుకువచ్చావేం?" అని అడిగారు. అడిగితే కోతుల కోటయ్యా "ఏం చేయను బాబయ్య!" ఈ పాడుకోతులు చెప్పినమాట వింటేనా? చెప్పిన పనిచేయకపోతే ఈ కర్రతో ఒకటిచ్చుకున్నాను. దాంతో అది చచ్చింది." అన్నాడు కొంచెమైనా జాలిలేకుండా "మరి ఈకోతి కూడా చచ్చిపోతే?" అని అడిగాడు ఒక పిల్లవాడు.

"ఎందుకు చస్తది బాబయ్యా! ఒకవేళ చచ్చినా ఇంకో కోతిని తెస్తాను. నాపనే అది"- అని ఎంతో తేలిగ్గా జవాబిచ్చేశాడు. ఆ సీతమ్మ కోతికి డ్రెస్సు మార్చేసి. లంగా తొడిగి, ఆ కోతిని జనానికి చూపిస్తూ, "చూశారా! ఈ కోతి. దీని పేరు రంభ. ఈ రంభ భరతనాట్యం చేస్తుంది. ఏదీ రంభా! భరతనాట్యం చెయి" అని డోలు వాయించాడు. భరతనాట్యం డ్రెస్సులో ఉన్న ఆ కోతి నిలబడలేక నిలబడలేక ముందు రెండు కాళ్లూ పైకెత్తి, వెనక కాళ్ల మీద నిలుచుంది.

"ఊఁ గంతూ" అంటూ, కర్రచూసి బెదిరించాడు కోటయ్య. పాపం ఆ కోతి గెంతలేకపోయింది. ఏదో బాధతో ఉన్నట్లు కనిపించింది. కోటయ్య తన బెత్తంతో ఒక్కటి వేశాడు. దానికి ఆ కోతి కిందపడి విలవిలకొట్టుకుంది. జనమంతా జాలిగా చూస్తూ, గుంపులుగా నిల్చు న్నారు. ఇంతలో అక్కడికి ఒక కారు వచ్చి ఆగింది. కారులోనుంచి ఓ పెద్దమనిషి దిగి. కోతి దగ్గరకు వచ్చి చూచాడు, "ఏమయ్యా కోతు లవాడా! నోరులేని అమాయకపు కోతిని ఎందుకు అంతగట్టిగా కొట్టావ్? ఈ కర్ర తీసుకొని నిన్నొక్కటి కొడితే ఎలా ఉంటుంది? ఆ జీవిని నీవు హింసించినట్లు నిన్ను హింసిస్తే?" అని గట్టిగా కోపంతో అరిచాడు. ఆ పెద్ద మనిషి ఎవరంటే - అతనొక పశువుల డాక్టర్. అతడు నెమ్మ దిగా ఆ కోతిని ఒళ్ళోకి తీసుకొని, దాని ఒళ్ళంతా పరీక్షించి చూశాడు, కోతికి అరికాలులో చిన్న ముల్లు విరిగింది. తలమీద గాయపడి ఉంది.

"ఇదిగో చూశావా, దీనికాలులో ముల్లు - దాన్ని గెంతమంటే పాపం ఆ కోతి ఎలా గెంతగలదు? నోరులేని జంతువు దాని బాధ ఎలా చెప్పగలదు? పైగా తలమీద ఇంతగాయం పడేటట్లు కొడతావా?" అని చీవాట్లుపెట్టి చికిత్స చేయడానికి ఆ కోతిని కారులో ఆసుపత్రికి తీసుకు పోయాడు.

కోతుల కోటయ్య భయంతో గుడ్లప్పగించి చూస్తూ నిలః పోయాడు. అక్కడ నిల్చున్న జనం అంతా ఆ కోతులవాడివేపు చ చర చూస్తూ తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.

నోరులేని జంతువుల్ని, పక్షుల్ని మనం హింసించవచ్చా మీ: చెప్పండి !






## రంగము - 1

[లలిత ఇంట్లో ముందు గది: గదిలో కుడివైపు ఒక చిన్న టేబిలు, టేబిలుపై బడి పుస్తకాలు. ఎడమ వైపు ఒక బల్ల, పడక కుర్చీ, టిఫిను బల్ల - నేల మీద నలిపి పారవేసిన చిత్తు కాగితాలు.

తెర లేచేసరికి లలిత టేబిలు దగ్గర ఒక కుర్చీలో కూచొని కాంపొజిషన్ రాస్తూ, కాగితాలు చింపి, నలిపి ఉండలు కట్టి కింద పడేస్తూ వుంటుంది. ఒక పక్క నుంచి పని మనిషి లచ్చి చీపురు కట్టతో తుడుస్తూ వచ్చి-]

లచ్చి : లలితమ్మగోరూ! లెగండీ! ఇలా కాగితాలు గజిబిజిగా పడేత్తే ఎలా అమ్మొగోరూ!

లలిత : (చిరాకుతో) ఛీ! ఉండవే! నేను కాంపోజిషన్ వ్రాసుకుంటుంటే మధ్య నీ గొడవేమిటి ?

లచ్చి : రాసుకోండి అమ్మగోరూ! రాసుకోండి, కాని ఇలా కాగితాలు చించి పారెయ్యాలా !

లలిత : కాంపోజిషన్ రాయడం అంటే ఏమిటనుకున్నావు. నీ చీపురుకట్ట అనుకున్నావా : నాకు ఆలోచన తట్టక నేను ఇది అవుతుంటే !

లచ్చి : అది కాదు చిన్నమ్మగోరూ! ఇప్పటికప్పుడే రెండుసార్లు తుడిచాను. మరి నాకు మాత్రం పనులు లేవా! కాస్త జరగండి. ఈ కుర్చీ కింద ఊడ్చేస్తాను.

లలిత : నేను జరగను, నన్నేం చేస్తావే.

లచ్చి : ఎల్లిపోతాను....(తల్లి ప్రవేశం). చూడండమ్మగోరూ యీ లలితమ్మ లెగమంటే లెగరు!

తల్లి : ఏమిటే లలితా ఏమిటి ?

లలిత : అది కాదే అమ్మా! నేనేమో హోంవర్కు చేసుకుంటుంటే యీ లచ్చి వచ్చి నన్ను పొమ్మంటోందే!

లచ్చి : నే నేనన్నానమ్మా! కాస్త జరగమ్మా అన్నాను.

తల్లి : లేవమ్మా ఒకసారి!

లలిత : (కోపంగా) సరే లేచిపోతానులే !

(అంటూ చరచరా ఇంకో కుర్చీలో కూచొని కాగితప్పువ్వులు కత్తిరిస్తూ వుంటుంది)

లచ్చి : ఇదిగో చూడమ్మగోరూ, ఇక్కడంతా....

తల్లి : ఒసేవ్ లలితా ! చెప్తే తెలియదూ ? ఇంటినిండా ఆ కాగితపు ముక్కలు పడేయకూ !

లలిత : ఇంట్లో కాకపోతే ఎక్కడ ? వీధిలో కూచొని కత్తిరించుకోవాలా?

తల్లి : ఇంట్లోనే కత్తిరించుకో తల్లీ ! ఇదిగో చూడు ఇక్కడంతా చెత్తాచెదారం ఎలా చేశావో ?

లలిత : తుడవడానికి లచ్చి వుందిగా !

లచ్చి : అదేనమ్మా నా పని! ఇప్పటికిప్పుడే రెండుసార్లు గది తుడిచానా ! నా మాట అమ్మగోరు వింటేనా !

లలిత : ఏమిటి ! నీమాట నేను వినాలా! నీ పనులన్నీ నేను చేయాలా ! నాకు మరి బడీ చదువూ వద్దా ? అమ్మా ! అలాగయితే నేను చదువుమానేసి ఇంట్లో కూచొని యీ లచ్చి పనులన్నీ ఇక నేనే చేస్తా మరి.

**(అంటూ కోపంగా వెళ్ళి లచ్చి చేతిలోవి చీపురు కట్టను తీసి బరబర నేలను ఊడుస్తూ వుంటుంది.)**

తల్లి : అబ్బబ్బబ్బ ! ఇంతున్నావో లేదో ఎంత అల్లరి దానవయి పోయావే ! కత్తిరించుకుంటే కత్తిరించుకోగాని, గదంతా చెత్త చెత్తగా చేయకు తల్లీ ! ఎవరేనా వచ్చి చూస్తే ఛీ ఛీ అంటారు.

**(అంటూ లోవికి వెళ్ళిపోతూ వుండగా లచ్చి, లలిత చేతిలోవి చీపురును తీసుకుంటుంది)**

తల్లి : రా ! లోన నీ కోసం వుంచిన పాలు చల్లారిపోతున్నాయి.

లలిత : నేను రాను. నువ్వే ఇక్కడికి తెచ్చియియ్యి!

తల్లి : ఆహాహా! ఏం! తినేస్తున్నావే తల్లీ! నువ్వు నాకు పని సహాయం చేయడానికి బదులు నేనే నీకు చాకిరీ చేయాలా! (చీర కొంగుతో కన్నీరు తుడుచునంటూ) "ఛీఛీ ఇటువంటి అల్లరి పిల్లలు పుడితేనేం, పుట్టక పోతేనేం!

నాన్నమ్మ : (ప్రవేశించి) ఎందుకు సుందరీ ఏడుస్తున్నావు.

తల్లి : అదుగో చూడండి (క్రింద పడివున్న కాగితం ముక్కలు చెత్తా చూపిస్తూ) ఇదంతా మీనించే అత్తగారూ!

నాన్నమ్మ : నేనేంచేశానే!

తల్లి : మీరంటే మీరు కాదు! మీ మనమరాలు.

నాన్నమ్మ : అదేమి చేసిందే!

లలిత : (ముద్దుగా) చూడు నాన్నమ్మా యీ అమ్మ!

తల్లి : ఇంట్లో ఒక్క పని సహాయం చేయదుకదా! ఉత్త అల్లరి పిల్ల అయిపోయింది.

నాన్నమ్మ : అదేమిటే అలా అంటావూ! మన ఇరుగుపొరుగువాళ్లు మన లలితని ఎంతో మెచ్చుకుంటున్నారు.

తల్లి : సరిసరి! ఎవరో వెర్రివాళ్ళు మెచ్చుకోవాలిగాని! వాళ్ళెవరో మనింటికివస్తే తెలుస్తుంది.

(పక్కింటి పిన్ని ప్రవేశం)

పిన్ని : ఏమిటి వదినెగారూ ఇంటికివస్తే తెలుస్తుందంటున్నారు.

తల్లి : మంచి సమయానికి వచ్చారు. మా లలితండీ, ఇది మా పె
సమస్య అయిపోయింది.

పిన్ని : ఏం? ఏం చేసింది?

తల్లి : ఏమిచేమిటి! ఉత్త అల్లరిపిల్ల అయిపోయింది.

పిన్ని : అదేమిటండీ అలా అంటారు? మీ లలిత చాలా మంచి పిల్ల
నేను అటువంటి మంచిపిల్లని ఎక్కడా చూడలేదు.

తల్లి : సరిసరి, మీరే మెచ్చుకోవాలి. ఇంట్లో ఒక్క పనైనా చేయద
ఇంట్లో తల్లికి సహాయం చేయకపోతే ఎలాగ చెప్పండి?

**(లలిత ఇంతలో ఒక కుర్చీ తెచ్చివేసి, పిన్నిగారిని కూచోమంటుంది)**

పిన్ని : ఇదిగో చూశారా: నేను కుర్చీవేయమన్నానా! పెద్దలయెడ
మర్యాదా, భక్తీగల పిల్ల మీ లలిత.

తల్లి : ఇవన్నీ దొంగ వేషాలండి, ఈ ఇచ్చకాలబుచ్చిని మీరే మెచ
కోవాలి.

పిన్ని : మీరలా అనకండీ! మొన్న నాకు జ్వరంవచ్చి నేను పడుక
వుంటే మా ఇంటికి మీ లలితవచ్చి ఎంతో సహాయం చేసింది.

తల్లి : దాని మొహం! అది సహాయంచేయడం కూడానా! ఇక్కడు
వస్తువు అక్కడ పెట్టమంటే ఇంట్లో పారిపోతుంది.

పిన్ని : అయ్యో అలా అనకండి సుందరమ్మగారూ! నా నుదిట్లికి మం
రాసింది. ఓపిగ్గా కూచొని ఒళ్ళంతా పట్టింది. వంటింట్లోకి
తానే స్వయంగా స్టవ్వువెలిగించి కాఫీ చేసింది. గ్లాసులు కడిగ

తల్లి : మీ ఇంట్లో ఈ పనులు చేయడానికి ఎవ్వరూలేరా?

పిన్ని : మా చెల్లెలు ఉండేదికాని ఊరికెళ్ళింది. ఈ లలితే తనంతట తాను కలిపించుకొని పనులన్నీ చేసిపెట్టింది. బంగారు తల్లి !

తల్లి : మీరు చెప్పిన మాటలు నమ్మలేకుండా వున్నాను వదినెగారూ ! పొరుగింటి పుల్లకూర రుచిలాగ వుంది దీని సంగతి చూస్తే! సరే ! మీరేదో వచ్చినట్టున్నారు !

పిన్ని : ఏం లేదు ! ఇంట్లో ఏమీ తోచలేదు, మీ ఇంట్లో గ్రామ ఫోను రికార్డులు వుంటే ఒకసారి ఇవ్వండి, రేపు తిరిగి ఇచ్చేస్తా.

తల్లి : అయ్యో దేముడా రికార్డులా ! మా లలిత ఏం చేసిందో తెలుసా ? రికార్డులన్నీ అలమారులోంచి తీస్తూ తీస్తూ, కోపంవచ్చి కింద పడవేసిందండీ ! అన్నీ రికార్డులూ ముక్కలు ముక్కలయి పోయాయి.

పిన్ని : పాపం ! పొరపాటున చెయ్యి జారిపోయి వుంటుంది. నే వెళ్ళొస్తానండి. లలితా ! వెళ్ళొస్తానూ ,

లలిత : మంచిది పిన్నిగారూ.

( పిన్నిగారు వెళ్ళిపోతారు )

లలిత : పిన్నిగారూ ! పిన్నిగారూ ! మీ సంచి మరిచిపోయారు (అంటూ

పిన్నిగారి సంచీని పట్టుకుని గబగబ వెళ్తుంది)

నాన్నమ్మ : చూశావా శ్యామలా ! పక్కింటి సూరమ్మ ఏమన్నారో ! మన లలితంటే నీకెందుకు పడదో నాకు తెలియకుండా వుంది. (అంటూ వెళ్ళిపోతుంది)

తల్లి : బాగుంది ! ఆఖరికి నిష్టూరమంతా నామీద పడింది ? ఇంత అ
చేస్తున్నా యీ లలితని అందరూ మంచిపిల్లని అంటారే
ఆశ్చర్యంగా వుంది. సరే వాళ్ళబడి టీచర్ని అడిగితే దీని సం
బయటపడుతుంది. అక్కడ ఎంత అల్లరి చేస్తోందో !....రేపు
టీచరు గారింటికి వెళ్ళి దీని సంగతంతా అడుగుతా !

( తెర )

# రంగము - 2

## ( టీచరుగారి ఇల్లు )

( గదిలో పుస్తకాలు, టేబిలు, కుర్చీలు, గోడమీద కాలెండరు, మొదలైన
వుంటాయి )

తల్లి : (బైటనుంచి) టీచరుగారూ ! టీచరుగారూ

టీచరు : ఏవరదీ !....లోనికి రండి.

తల్లి : (ప్రవేశం)

టీచరు : రండి, కూర్చోండి,

తల్లి : (కుర్చీమీద భయంభయంగా కూర్చుంటుంది)

టీచరు : తమరెవరో....

తల్లి : నేను మీ క్లాసులో చదువుతున్న ఒక అమ్మాయి తల్లినండి

టీచరు : ఎవరు ?

ఇద్దరు లలితలు

తల్లి : లలిత.

టీచరు: ఓ ! లలిత మీకూతురా ! ఆమెను గురించే మీతో కలవాలను కుంటున్నాను. మీరే వచ్చారు.

తల్లి : అదేనండి. అది బడిలో ఎలా చదువుతోందా తెలుసుకుందామని వచ్చాను.

టీచరు: ఆ సంగతి చెబుదామనే వద్దామనుకున్నాను. అటువంటి అమ్మాయికి మీరు తల్లి అవడం మీ అదృష్టం అనుకోండి.

తల్లి : (ఆశ్చర్యంగా) అదృష్టమా !

టీచరు: క్లాసులో ఎప్పుడూ ఫస్టు మార్కులే వస్తూ వుంటాయి. చాలా తెలివైన పిల్ల !

తల్లి : ఎవరు ? మా లలితే !

టీచరు: అవునండి, మాబడి అంతటికీ పేరు తెచ్చే పిల్ల ! మీ లలితని ఆలిండియా పోటీలకు పంపాలనుకుంటున్నాం, మా స్కూలు తరఫున.

తల్లి : మీరు పొరబడుతున్నారు. ఆ లలిత అని పేరుగల అమ్మాయి ఒక్కరే వున్నారు, జి. లలిత.

తల్లి : అవును, జి. లలిత మా అమ్మాయేగాని మీరు మా లలిత మంచి పిల్ల అంటున్నారేమిటి !

టీచరు: ఏమీ ! నిజంగానే చెబుతున్నానండి, మీ లలిత చదువులో ఫస్టు, పాటల్లో ఫస్టు, వ్యాసరచనలో ఫస్టు, ఆటల్లో ఫస్టు. నడవడికలో ఫస్టు !

తల్లి : అదేమి ఫస్టో! మీరు ఒకసారి మా యింటికి వచ్చి చూస్తే తెలుస్తుంది దాని సంగతి.

టీచరు: ఏమీ? మీ మాట వినదా!

తల్లి : అయ్యో! ఏమని చెప్పేది. మాట వినదు, ఉత్త అల్లరి, సోమరిపోతు! కోపిష్టి, ఉత్త గయ్యాళి పిల్లనుకోండి.

టీచరు: ఛ ఛ! అదేమిటండీ అలాగంటారు. మీ లలిత బంగారు తల్లి! మా బడిలో బెస్టు స్టూడెంటు.

తల్లి : మీరు ఒకసారి మా ఇంటికి రండి చూద్దురుగాని.

టీచరు: మీరు చెప్పిన మాటలు నేను నమ్మలేకుండా వున్నాను.

తల్లి : మీరు ఇవాళ సాయంత్రం ఒకసారి రండి, ఆ అల్లరి మీ కళ్ళారా చూద్దురుగాని.

టీచరు: సరే! సాయంత్రం 5 గంటలకి రమ్మంటారా?

తల్లి : రండి. కాని ఒక విషయం, మీరు మా ఇంటికి వస్తున్నట్టు మా లలితకు తెలియకూడదు. కాస్త మాటుగా వచ్చి మా ఇంటి ముందు గదిలో ఒక కాన్వాసు పడక కుర్చీ వుంది. అందులో కూర్చొని, పేపరు చదువుతూ, మీ ముఖం కనపడకుండా కూర్చోండి. అప్పుడు తెలుస్తుంది దాని ప్రవర్తనా అదీని.

టీచరు: అలాగే....కాస్త యీ టీ త్రాగి వెళ్లండి.

తల్లి : నాకు టీ అలవాటు లేదండి, వెళ్ళొస్తా.

టీచరు : మంచిది.

( తెర )

# రంగము – 3

లలిత ఇల్లు, ముందుగది, కుర్చీలూ, టేబిలు, పత్రికలు, ఒక ప్రక్కన కాన్వాసు మడత కుర్చీ అవీ ఉంటాయి.

తల్లి (ఆతురతతో టీచరుగారి రాకకు ఎదురుచూస్తూ వుంటుంది. టీచరు మెల్లగా అడుగుల చప్పుడు కాకుండా రాగానే మడత కుర్చీలో కూర్చోమని సౌంజ్ఞచేసి, టీచరు చేతికి పేపరు ఇస్తుంది. టీచరు తన ముఖం కనబడ కుండా పేపరు చదువుకుంటున్నట్లు కూర్చుంటుంది)

తల్లి : లలితా ! లలితా !

లలిత : (తెరలోనుంచే విసుగ్గా) ఎందుకే ఊరికే పిలుస్తావు !

తల్లి : అయ్యో తల్లీ ! అంత విసుగెందుకే ! ఇలారా పనుంది.

లలిత : (ప్రవేశించి కోపంగా) పనుంటే పనిమనిషికి చెప్పు. నేను పని మనిషినా !

తల్లి : అది కాదమ్మా ! ఈ టేబిలూ ఈకుర్చీలూ కాస్త శుభ్రంగాసర్దమ్మా. ఇవాళ మనింటికి ఎవరో వస్తారట !

లలిత : ఎవరోవస్తే నాకేం ! నువ్వున్నావుగా ! నేను వెళ్ళాలి (అంటూ వెళ్ళబోతూ వుంటుంది)

తల్లి : లలితా ! లలితా ! ఎక్కడికి వెళ్తావేమిటి. ఈ రోజున మనింటికి చుట్టాలు వస్తారే !

లలిత ; చుట్టాలా ! చుట్టాలొస్తే ఉత్త బోరు !

తల్లి : అది సరేగాని పనిమనిషి ఇంకా రాలేదు. నువ్వు కాస్త బజారు కెళ్లి అరటి పళ్లూ తమలపాకులూ తీసుకురావాలి.

లలిత : ఆ పని మాత్రం నేను చెయ్యనే, నేను ఇంట్లోనే వుంటాను. నువ్వే వెళ్లు, నీ పనులన్నీ నువ్వు చేసుకోవాలి గాని నాకు చెబుతావెందుకూ !

(వెళ్ళుతూ వుంటుంది)

తల్లి : ఆగు ఆగు ! అన్నట్టు చెప్పడం మరిచాను, ఇందాకటి నుంచీ నీ కోసం ఎవరోవచ్చి కూచున్నారు. (అని కుర్చీవైపు చూష తుంది)

లలిత : నా కోసమా ! ఎవరొచ్చారూ ? సరళా ? విరళా? కమలా ? ఏయ్ మొహం కప్పుకొని పలకవేమీ ? ఓహో ! నేను పోల్చుకోలేనన కున్నావా ? హైహీల్స్ షూజ్ వేసుకున్నావే ! అబ్బో ! ఈ ఫేషన్లన్నీ ఎప్పుడు నేర్చుకున్నావేమిటి ! ఊ....ముఖం మీం ఆ పేపరు తియ్యి ! నీకు వినబడలేదు ! నీకు చెముడా ! దొంగ (అని పేపరు తీసివేస్తుంది.)

టీచరు : అవును లలితా ! నేనే ఆ దొంగని !

లలిత : (ఆశ్చర్యం, భయం అభినయిస్తూ) అరె ! మా టీచర్ ? నమ టీచర్, నమస్తే, మీరనుకోలేదు !

టీచరు : తెలిసిందిలే నీ సంగతి తెలిసిందిలే !

లలిత : టీచర్ ! ఎప్పుడొచ్చారండీ !....అమ్మా డబ్బులియ్యవే. బజా కెళ్ళి పళ్ళూ అవీ తెస్తాను. టీచర్! మీరు స్కూల్ ్రడింకు తాగుతా

టీచరు: కూలూలేదూ క్రింకూలేదు, నీ ప్రవర్తనంతా బయట పడిందిలే! ఎన్ని ఫస్టుమార్కులువస్తే ఏమి ప్రయోజనం! ఇంత అల్లరి పిల్లవి, ఇంత మొండి పిల్లవని నేను అనుకోలేదు.

లలిత : క్షమించండి టీచర్! ఇంకెప్పుడూ ఇంట్లో అల్లరి చేయనండి, నాకు బుద్ధి వచ్చింది. టీచరు నిన్ననేగా మీరు బడిలో "తల్లి కన్న వేరు దైవంబు కలదే" అనే పద్యం చదివారు! బడిలో లలిత వేరు, ఇంట్లో లలిత వేరూనా?

లలిత : టీచర్! ఇకముందు అమ్మ మాటలు తప్పకుండా వింటానండి.

టీచరు: ఆ మాటలు మీ అమ్మతో చెప్పు.

లలిత : (తల్లి దగ్గరికి తలవంచుకొని మెల్లగా వెళ్లి ఏడుపు కంఠంతో) అమ్మా! క్షమించు.

తల్లి : నా వెర్రి తల్లి! నువ్వు చాలా మంచిదానివే. ఏదీ మీ టీచరు గారికి మంచి ఫలహారం, పాలూ తీసుకురా!

లలిత : ఇదుగో! వెంటనే! (సంతోషంగా లోనికి వెళ్లడానికి ఉరుకుతుంది.)

టీచరు: ఆగు ఆగు, లలితా ఆగు!

లలిత : (వెనక్కి వచ్చి, వినయ విధేయతలతో) ఏం టీచర్, మీకేం కావాలి? పళ్లు తెచ్చేదా?

టీచర్: అవేమి వద్దుగాని, ముందుగా ఆ మూల వున్న చీపురు కట్ట తీసుకురా!

(లలిత వెళ్లి పట్టుకు వస్తుంది)

ఈ గదంతా శుభ్రంగా తుడు !

(తుడుస్తుంది.)

ఆ టేబిల్ మీద వున్న కప్పు సాసరు లోనికి తీసుకొనివెళ్ల....

(ఆ పని చేస్తుంది)

ఆ కింద పడివున్న పుస్తకం టేబిలుమీద పెట్టు.

(పెడుతుంది)

లలిత : ఇంకా ఏమైనా పనులుంటే చెప్పండి టీచర్ చేసేస్తాను.

టీచరు : ఇంకేం అక్కరలేదుగాని, మీ అమ్మకి టిఫిన్ తీసుకురా !

లలిత : మరి మీకో ! (అంటూ లోనికి పరుగెత్తుతుంది).

టీచరు: చూశారా ! మీ లలిత చెప్పిన పనులన్నీ ఎలా చేసేసిందో ?
(ప్రవేశం లలిత రెండుచేతుల్లోనూ రెండు టిఫిన్ ప్లేట్లు పట్టుక
వచ్చి ముందుగా టీచరుకు ఇస్తుంది.)

టీచరు: చూశారా ! మీ లలిత నాకు టిఫిన్ తెచ్చి పెట్టింది ! (లల
రెండో ప్లేటుని తల్లికి ఇస్తుంది.)

తల్లి : మా లలిత నాకూ తెచ్చి పెట్టింది.

టీచరు: ఇంతకీ ఇద్దరు లలితలూ ఒక్కరే !

(అందరూ పకపక నవ్వుతూ వుంటే తెరపడుతుంది.)






- అది ఒక ఆడపిల్లల బడి -

(బడిగంట)

ఒకరు :-

అదిగో బడిగంట కొట్టారు.....

గణ గణ గణ గణ బడిగంటదుగో....

పదిపది పదిపది బడికేగండి,

ఓ పిల్లలారా వేవేగరండి, వేళకు వెళ్ళకపోతే హేళన చేతురుగా

స్ ! అదిగో టీచరు వస్తున్నారు.

( నిశ్శబ్దం )

టీచరు : పిల్లలూ ! అందరూ వచ్చారా ?

పిల్లలు: వచ్చామండీ.

టీచరు: ఏదీ శాంతా ! అటెండెన్సు పుస్తకం తీసుకురా !

శాంత : ఇదిగోనండీ.

( పేర్లు పిలుస్తూ )

టీచరు : అలమేలు - (ప్రెజంటు టీచర్), అనసూయ - (ప్రెజంటు) ఆండాలు ఇందుమతీ ఏది. ఇందుమతి యింకా రాలేదు (రాలేదండీ) ఈశ్వరి - (ప్రెజంట్ టీచర్), ఊర్మిళ - (ప్రెజంట్ టీచర్), కమల - (ప్రెజంట్ టీచర్), గణపతమ్మ - (ప్రెజంట్ టీచర్), సీత-(ప్రెజంట్ టీచర్), గిరిజ-(ప్రెజంట్ టీచర్), జమున-(ప్రెజంట్ టీచర్), పూర్ణిమ (ప్రెజంట్ టీచర్), భానుమతి- ఏది భానుమతి, యింకా రాలేదూ.

భాను : వస్తున్నా టీచర్- యిప్పుడే.

టీచరు : ప్రతిరోజు నువ్వు ఆలశ్యమే.

శాంత : ఇందుమతి కూడ లేదండి.

టీచరు : పేరుకు తగ్గట్టే భానుమతి, యిందుమతి ఇద్దరూ ప్రతిరోజు ఆలశ్యంగా వస్తారు.

శాంత : ఇదిగోనండీ, ఇందుమతి మెల్లగా వస్తోంది....

టీచరు : ఏం ఇందుమతీ, అరగంట ఆలశ్యంగా వచ్చావు.

ఇందు : నేను 9 కే బయలుదేరానండి, సగంతోవ వచ్చేసరికి లెక్కలు, హోంవర్కు పుస్తకం మరచిపోయానని జ్ఞాపకం వచ్చింది. వెళ్లి తెచ్చానండి! ఆలశ్యమయింది.

టీచరు : ప్రతిరోజు ఏదో ఒక సాకు చెబుతూనే వుంటావు. సరే, కూచో. ఏదీ, అందరూ లెక్కల పుస్తకాలు తీయండి, చిత్రా! ఏది నీ హోంవర్కు ?

చిత్ర : ఇదిగోనండీ.

టీచరు: సీతా, ఏదీ నీ పుస్తకం ?

సీత : ఇదిగోనండి.

టీచరు : ఇందుమతీ....ఏదీ, నీ పుస్తకం చూపించు....

ఇందు : మరచిపోయానండి.

టీచరు : ఇందాక తెచ్చానని చెప్పావు !

ఇందు : అవునండి ! కాని, లెక్కలకు బదులు సైన్సు పుస్తకం తెచ్చానండి.

టీచరు : నీ అంత అజాగ్రత్త అమ్మాయిని ఎక్కడా చూడలేదు, అంతలో మతిమరుపా?

చిత్ర : ఇందుమతి యెప్పుడూ ఇంతేనండీ

ఇందు : అన్నీ అబద్ధాలు.

టీచరు : సరే !....నీ సంగతి తెలుస్తూనే వుంది ... కూచో....ఇదిగో రేపు క్లాసుకు వచ్చేటప్పుడు నిన్నటివి, యీవాళవీ 10 ఇంటి

లెక్కలు చేసి తీసుకురావాలి. జ్ఞాపకం వుంటుందా? రేపు 64 లెక్కనుంచి 83 లెక్కవరకు చేసి తెండి, 4 వ అధ్యాయం.

అందరూ : అలాగేనండి.

- ఇంట్లో.... -

తల్లి : ఇందూ ! ఇందూ....

ఇందు : ...............

తల్లి : ఏమి చేస్తున్నావమ్మా !

ఇందు : పుస్తకాలు సర్దుకుంటున్నాను.

తల్లి : ఎంతసేపూ ! అరగంటయింది చూస్తున్నాను, వూరికే పుస్తకాలు సర్దుకోవడమేకాని చదవడం కనిపించదు.

ఇందు : అదికాదే అమ్మా ! యింటిలెక్కలు ఏవో చేయమని టీచరు చెప్పారు. అవి ఏవో మరచిపోయానే.

తల్లి : అవేవో నోటు పుస్తకంలో రాసుకోలేకపోయావా ?

ఇందు : పుస్తకం తీసుకెళ్ళడం మరచిపోయాను. చిన్న కాగితం ముక్క మీద రాసుకున్నాను. అదెక్కడో పోయింది.

తల్లి : వెళ్ళి పక్కింటి సీతని అడిగి తెలుసుకో ! ఆమాత్రం తెలియదటే!

ఇందు : ఇదుగో వెళ్తున్నా.

* * *

సీత : రా ! ఇందూ ! రా ! లోనికిరా !

ఇందు : ఏం చేస్తున్నావు సీతా !

సీత : తెలుగుపద్యాలు కంఠస్తం పెడుతున్నాను. నీకు వచ్చేశాయా ?

ఇందు : నిన్నరాత్రంతా చదివాను.

సీత : ఏది చెప్పు.

ఇందు : తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు! దివిరికుందేటిలో నీరు త్రాగవచ్చు.

సీత : కుందేటిలో కాదు. మృగతృష్ణలో.

ఇందు : ఆ....మృగతృష్ణలో కొమ్ము వూదవచ్చు.

సీత : అబ్బెబ్బే! మరిచిపోయావూ! యివాళ క్లాసులో చెప్పకపోతే పదిపైసలు ఫైనట తెలుసా ?

ఇందు : అయితే! యిప్పుడే వెళ్లి కంఠస్తం పెడతాను.

- ఇంట్లో.... -

ఇందు : తివిరి తైలంబు మృగతృష్ణ కొమ్ము. కొమ్ము

తల్లి : కొమ్మేమిటే నీ మొహం! ఏవి! ఇంటిలెక్కలు ఏవో మరచి పోయావేమో! కొమ్ము కొమ్మ కొమ్ము అంటూ కూచున్నా వేమిటి!

ఇందు : అరెరె! సీతని లెక్కలమాట అడగటం మరచిపోయాను. ఎలాగ? బడికి టైం అయిపోయింది.

తల్లి : వెళ్ళు, వెళ్ళి యిప్పుడేనా అడిగిరా. చేసినవన్నీ చేసి టీచరు గారిని క్షమాపణ కోరుకో.

ఇందు : అలాగే.

- బడిలో టీచరు హాజరుపట్టీ పిలుస్తూ -

టీచరు : అలమేలు - (ప్రజంట్ టీచర్) అనసూయ - (అండాలు) (గణపతమ్మ) (గిరిజ) (జమున) (పూర్ణిమ) భానుమతి. ఓహో ఇవాళ వేళకే వచ్చావే.

చిత్ర : టీచర్ ! స్కూలు ప్యూను ఏదో నోటీసు తెచ్చాడండీ.

టీచరు : ఏది.

"ఈ సాయంత్రము బడి మూసిన అరగంట తర్వాత పిల్లలకు రంగుల సినిమా చిత్రము చూపబడును. టిక్కట్లులేవు. పిల్లలందరూ వచ్చి చూడవచ్చును. 'బంగారుచేప' అనే బహుమంచి ఫిల్ము చూపబడును."

విన్నారా యీ నోటీసు. మీరు సాయంత్రం ఈ ఫిల్ము చూడండి. ఆఁ యింక పాఠాలు ప్రారంభిద్దాం. ఏది - అందరూ లెక్కలు చేసుకొని వచ్చారా !

అందరూ : వచ్చాం.

పిల్లలనందరినీ టీచరు చూస్తూ.

టీచరు : ఇందుమతి యింకా బడికిరాలేదా ?

సీత : రాలేదండీ, యింట్లోనే లెక్కలు చేస్తూ కూచుంది. నన్ను లెక్కలు అడిగింది.

టీచరు : యీ పూట ఆబ్సెంటు వేసేస్తాను, అంతే, మీరు ఆ బోర్డుమీద వ్రాసివున్న క్రొత్తలెక్క చేయండి.

పిల్లలు : అలాగేనండి.

టీచరు : ఏమోయ్ ! సింగూ ! యిలావచ్చావు !

సింగు : ఏంలేదు టీచరమ్మగారూ ! నిన్న సాయంత్రం నా దుకాణం కాడ ఎవరో పుస్తకం మరచిపోయినారమ్మ గారూ ! ఇదుగో పుస్తకం, యిచ్చేద్దామని వచ్చినాను.

టీచరు : ఏదీ ఇలా ఇయ్యి ఎవరిదో.... అరె యిది ఇందుమతిదే.... సరే నోయ్, నువ్వువెళ్ళు .... ఈ ఇందుమతికి రోజురోజుకూ మతి మరుపు జాస్తీ అవుతోంది. 'ఇందుమతి' అన్న పేరు మార్చి "మందమతి" అని పెడితే బాగుండును....ఏవ్రా - ఇందుమతి పేరు మందమతిగా మార్చాలంటారా లేదా !

అంద : అవునండీ, ఇందుమతిగాదు, మందమతే !

(అందరూ నవ్వు)

- ఆ సాయంత్రం ఇందుమతి యింటిదగ్గర -

ఇందు : (ఏడుస్తూ వుంటుంది)

తల్లి : నన్ను అందరూ "మందమతి" అని పిలుస్తూన్నారే. అలా పేరు పెట్టి పిలవడమేమిటి ? ఏది ప్రక్కింటి సీత ? అదుగో వస్తోంది. దానిని అడుగుతాను. ఏయ్ సీతా - యిలారా !

సీత : పిన్నీ ! పిన్నీ ! ఇందుమతిని సినీమాకి పంపలేదేమి ?

ఇందు ; ఏ సినీమా సీతా ?

సీత : బడిలో యిందాక చూపించారు. నీకు తెలియదూ ! నోటీసు చదివారు. వినలేదూ ఇందూ ?

ఇందు : నేను అప్పుడులేను....బడికి ఆలస్యంగా వచ్చాను.

తల్లి : సరిగ్గా టైముకి వచ్చినా మతిమరుపు దానివి, ఆ సంగతి జ్ఞాపకం వుంటుందా ! నీకు కావలసిందే ! మందమతికి సినీమా కూడానా? మంచి పేరే పెట్టారు "మందమతి".





# పరీక్షల హడావిడి

పాత్రలు

(తల్లి, తండ్రి, లలిత, ఊర్మిళ)

లలిత : ఎక్కాల బుక్కులో -

చక్కన్ని అంకెలోయ్

అంకెలన్నీ చూడు

అంకెలంకెలుగాను ॥ఎ॥

రెండొకట్ల రెండయితే

మూడొకట్ల మూడు



*

ఎక్కాలు రాకుంటె
లెక్కల్లు ఏడ్వు
ఎక్కాలు వస్తేను
లెక్కల్లు నవ్వు ॥ఎ॥

తల్లి : లలితా ! లలితా !

లలిత : ఓయ్, ఎందుకమ్మా !

తల్లి : అదేవిటే, పరీక్షకి చదువుకోకుండా, పాటలు పాడుతున్నావు ?

లలిత : ఎక్కాలమీద పాటమ్మా - జ్ఞాపకం వచ్చి పాడుతున్నాను.

తల్లి : అబ్బబ్బబ్బ ! ఎంతకనీ చెప్పడం ? చదువుకో, చదువుకో, చదువుకో అని-చదువుమీద కంటే, పాటలమీదే దీనికి శ్రద్ధఎక్కువ.

లలిత : చదువుకుంటున్నానమ్మా.

తల్లి : ఎక్కాల పుస్తకం తీసి ఎక్కాలు చదువు. నాకు వినబడేటట్టు గట్టిగా చదువు.

లలిత : నువ్వెక్కడో వంటింట్లో పనిచేసుకుంటూ ఉంటావ్. నేనెంత గట్టిగా చదివినా, వినబడమా, వినబడదూ అంటావ్.

తల్లి : ఫరవాలేదు - వినబడుతుందిలే - గట్టిగా చదువు.

లలిత : (గట్టిగా)

$6 \times 1 = 6$
$6 \times 2 = 12$
$6 \times 3 = 18$
$6 \times 4 = 24$
$6 \times 5 = 30$

(ఆవలిస్తుంది) అబ్బ! ఈ ఎక్కాలు చదవడం అంటేనే తల నొప్పి. ఎక్కాలు లేకుండా లెక్కలుంటే ఎంత బాగుండేది.

(కొంచెం ఆగి)

తల్లి : లలితా! లలితా!.... ఏం ? మాట్లాడవేం ? నిద్రపోతున్నావా ?

లలిత : లేదమ్మా - చదువుతున్నాను.

తల్లి : ఏదీ, నాకు వినిపించడం లేదు. గట్టిగా చదువు.

లలిత : (తింటున్నట్లు చప్పుడు)

తల్లి : ఏం మాట్లాడవ్ ? ఏమి తింటున్నావ్ ?

లలిత : జామకాయ తింటున్నాను!

తల్లి : ఒసీ, ఇదా నీ చదువు ? గట్టిగా చదవ్వే అని చెప్తే, పుస్తకాలక్కడ పారేసి, పెరట్లో కెళ్ళి జామకాయలు కొట్టుకొని తెచ్చావా ? నీకు నే చెప్పలేనమ్మా. మీ నాన్నగారు రానీ చెప్తాను.

లలిత : లేదమ్మా - చదువుకుంటున్నానే.

తల్లి : చదువుకో పోతే మానే - నాకేం ? నువ్వే ఫేలవుతావు. చదివిన క్లాసే మళ్ళీ చదువుతావు, ఆ మొద్దబ్బాయిలాగ.

లలిత : నేనేం మొద్దబ్బాయిని కాదు.

తల్లి : కాకపోతే మొద్దమ్మాయివి.

లలిత : నేను మొద్దమ్మాయిని కూడా కాదు. (ఏడుపు) నన్నలా అంటే. నేనసలే చదువుకోను.

(ఊ...,ఊ....ఏడుపు)

తల్లి : ఇలారా ఈ వంటింటి దగ్గరకొచ్చి చదువు. నేను వింటాను.

(కొంచెం ఆగి)

లలిత : అమ్మా ! రెండు చేగోడీలియ్యవే. తింటూ చదువుకుంటాను.

తల్లి : సరే, ఇస్తాగానీ, బాగా చదువుకుంటావా ?

లలిత : అలాగే,

$$7 \times 1 = 7$$
$$7 \times 2 = 14$$
$$7 \times 3 = 21$$
$$7 \times 4 = 28$$
$$7 \times 5 = 35$$
$$7 \times 6 = 42$$

ఇంక ఎక్కాలు చదవను - సైన్సు పాఠం చదువుతాను.

( పేజీలు తిరగేసి )

ఈ దీపం పాఠం చదువుతాను.

( చదువుతుంది )

స్నేహ : లలితా ! లలితా ! ఏం చేస్తున్నావ్ ?

లలిత : రా, చదువుకుంటున్నాను.

స్నేహ : నేను కూడా నీతో చదువుకునేందుకు వచ్చాను.

లలిత : రా కూచో. ఇద్దరం చదువుకుందాం.

అమ్మా మా స్నేహితురాలు ఊర్మిళ కూడా వచ్చిందే. నేనూ, ఊర్మిళ కలిసి గదిలో చదువుకుంటామే ?

తల్లి : సరే వెళ్ళండి.

లలిత : ఊర్మిళా రా, దీపం పాఠం చదువుకుందాం నేను చదువుతాను. నువ్వు వినూ.

లలిత : (చదువుతుంది)

"రాత్రులు చీకటిగా నుండుట వలన, మనము దీపముల నుప యోగించుచున్నాము - దీపములలో అనేకరకము లు న్న వి. పూర్వము ఆముదపు దీపముల నుపయోగించెడివారు.

స్నేహ : ఏవి టేవిటీ ? మళ్ళీ చదువు ?

లలిత : "పూర్వము ఆముదపు దీపములను ఉపయోగించెడివారు."

స్నేహ : ఛీ ! అముదం అంటే నాకసహ్యం. మా చిట్టికి, మా అమ్మ ఎప్పుడూ ఆముదం పట్టేస్తూ ఉంటుంది. నాకసహ్యం.

లలిత : అబ్బ ! నా కంతకంటే అసహ్యం. ఆ సీసా చూస్తేనే నాకు దోకు వస్తుంది.

స్నేహ : పాపం మా చిట్టి తాగనని ఏడుస్తుంది. మా అమ్మ ఏం చేస్తుందో తెలుసా ? కాళ్ళమీద చిట్టిని పడుకోబెట్టుకుని, చేతులు గట్టిగా పట్టుకొని ఉగ్గు గిన్నెతో ఆముదం పట్టేస్తుంది.

తల్లి : ఏమిటర్రా చేస్తున్నారూ ? మాటలేనా ? చదువుకుంటున్నారా ?

లలిత : చదువుకుంటున్నాం అమ్మా. ఆముదం పాఠం చదువుతున్నాం.

స్నేహ : చదవ్వే లలితా ?

లలిత : (చదువుతుంది)

కిరసనాయిలు దీపములు రెండు రకములు :

1. బుడ్డీ దీపము  2. చిమ్నీ దీపము

స్నేహ : చిమ్లీ దీపం ఏవిటి ?

లలిత : చిమ్లీకాదు – చిమ్నీ దీపం.

స్నేహ : అంటే ఏవిటీ ?

లలిత : ఉండు చదువుతాను–కిరసనాయిలు పోయుటకు బుడ్డీ యు దాని మూతికి ఒక బర్నరు ఉండును.

స్నేహ : దానికి మూతి కూడా ఉంటుందేవిటీ ?

లలిత : అవును కానీ, ఆ మూతి ఎక్కడుంటుందో తెలియదు దట – అంటే ఏమిటో ?

తల్లి : ఏవిటర్రా చేస్తున్నారు ? ఉత్త కబుర్లేనా ? చదువుకుంటు

లలిత : చదువుతున్నానమ్మా. ఇదేమిటో బోధపడ్డం లేదు.

తల్లి : ....అబ్బబ్బబ్బ ! చదవకుండా బాతాకానీ చేస్తున్నారా ! రండి. ఈ నట్టింట్లో కూచుని నా దగ్గర చదవండి.

లలిత : నువ్వు వంట చేసుకుంటూఉంటావ్ ?

తల్లి : వంట చేసుకుంటే వినడానికేం ? చదవండి వింటాను.

లలిత : "దాని మూతికి ఒక బర్నరుండును."

తల్లి : దేని మూతికి ?

లలిత : అబ్బ ! బోధపడ్డం లేదూ ? మళ్ళీ చదువుతా విను.

"చిమ్నీదీపము-కిరసనాయిలు పోయుటకు ఒక బుడ్డీ యుండును. దాని మూతికి ఒక బర్నరుండును....

అమ్మా! అంటే ఏవిటే!

తల్లి : చిమ్నీదీపం చూడలేదూ నువ్వు?

లలిత : ఎక్కడుందీ? ఏదీ మనింట్లో ఉందా?

తల్లి : మనింట్లో ఎక్కడుంది? మనింట్లో అన్నీ ఎలక్ట్రిక్కు దీపాలే

లలిత : మరెక్కడుందీ?

తల్లి : మీ టీచరుగారు పాఠం చెప్పేటప్పుడు చూపించలేదూ?

లలిత : లేదు, ఒకసారి చదివేసి ప్రశ్నలు రాసుకోమన్నారు.

తల్లి : ఏడిసినట్టే ఉంది. ఇప్పుడెలాగ మరి? మనింట్లో చిమ్నీ దీపం లేదు - ఎలాగ?

లలిత : దానికి మూతి ఎక్కడుంటుంది?

తల్లి : నీ మొహంమీద ఉంటుంది. చిమ్నీదీపం లేందే ఎలా చెప్తాను?

లలిత : అయితే అంతకోపం ఎందుకమ్మా. క్లాసులో టీచరుగారూ చెప్పరు. ఇంట్లో నువ్వూ చెప్పవు. నాకెలాగ? ఈ పాఠం నేను చదవను.

తల్లి : చదవకపోతే ఎలాగ? వీపుమీద నాలుగువేస్తాను చూడు.

లలిత : ఊఁ వేస్తావు. నాన్నారుతో చెప్తానుండు. (ఊఁ........ఏడుపు.)

నాన్న : అదేమిటమ్మా లలితా! అలా ఏడుస్తున్నావ్!

తల్లి : చూడండి. చదువుకోమంటే చదువుకోదు.

లలిత : అదికాదు నాన్నా ! చిమ్నీదీపం చూపించమని అడుగుతే తిడు తోంది అమ్మ.

తల్లి : మనింట్లో లేందీ ఎలాగ ? ఈ లలిత పుట్టినదగ్గర్నుంచీ మనింట్లో అన్నీ ఎలక్ట్రిక్ దీపాలే, నేనెక్కడ చిమ్నీ దీపం తెచ్చి చూపిం చేది దీనికి ?

నాన్న : అయితే ఆ మాత్రానికి అంత కోపం ఎందుకే ! పిల్లలకు తెలియకపోతే అడుగుతారు. నీకు తెలుస్తే చెప్పాలి.

తల్లి : మనింట్లో లేనిదే ఎలా చెప్పడం అండీ !

నాన్న : లేకపోతే బొమ్మగీసి చూపించాలి.

తల్లి : నాకేం ఆ బొమ్మలూ అవీ రావు సుమండీ ! నేనేం టీచరు పని చెయ్యలేదు.

నాన్న : పోనీలే అమ్మా లలితా ! నీకొక మంచి ప్రైవేటు మేస్టార్ని పెట్టి చెప్పిస్తాలే.

తల్లి : ఇంకా ఎప్పుడూ పెడతారు ? ఎల్లుండి నుంచీ పెద్ద పరీక్షలవు తుంటే ! ఇన్నాళ్ళనుంచీ శ్రద్ధ తీసుకొని చెప్పించలేకపోయారు - ఈ రెండు రోజులకీ ప్రైవేటు చెప్పిస్తారట, ప్రైవేటు !....పోనీ ఈ రెండు రోజులూ ఆ ప్రైవేటేదో మీరే చెప్పకూడదూ !

నాన్న : ఏమీ ! నువ్వు చెప్పలేవూ, లలిత చదివేది మూడోక్లాసు, ఆ మూడో క్లాసు పాఠం నువ్వు చెప్పకూడదూ ఆ మాత్రం !

తల్లి : సరేలెండి, బజారుకెళ్ళి ఓ చిమ్నీదీపం తీసుకురండి, చిమ్నీ దీపం చూపించి ఆ పాఠం చెబితే ఆ పాఠం బాగా వచ్చేస్తుంది. పాఠం మరిచిపోదు,

వెళ్ళండి, బజారుకెళ్ళి తీసుకురండి !

పరీక్షల హడావిడీ

నాన్న : చచ్చేనురా దేముడా ! ఇంతోటి పాఠం కోసం ఇప్పుడు నేను బజారుకెళ్ళి ఒక చిమ్నీ దీపం కొనాలట !

తల్లి : ఫరవాలేదు, తీసుకురండీ, అవసరం వస్తే మనింట్లో ఎప్పుడేనా పనికి వస్తుంది. లలితా !....బువ్వతినమ్మా ! ఇవాళనుంచీ నీకు పాఠం చెబుతాలే.

లలిత : అయ్‌హోయ్ ! మా అమ్మ నాకు పాఠం చెబుతుంది !

స్నేహ : లలితా ! నేనింటికి వెళ్తానూ !

లలిత : సరే ! సాయంకాలం రా ! ఆడుకుందాం.

స్నేహ : నేను కూడా ఇంటికివెళ్ళి మా అమ్మని పాఠం చెప్పమని అడుగుతాను. జై హింద్ !

లలిత : జై హింద్.

నేపథ్యం :

చూశారా పరీక్షల హడావిడి ! ఇన్నాళ్లూ చదువులు అశ్రద్ధచేసి పరీక్ష నాలుగు రోజులుండనగా పుడుతుంది హడావిడి. అప్పుడు పరుగెడు తారు అమ్మ దగ్గరికీ, నాన్న దగ్గరికీ, తాత దగ్గరికీ చదువు చెప్పమని.

అన్నపూర్ణ : మరైతే అక్కయ్యా ! లలిత నాన్నారు చిమ్నీదీపం కొన్నారేమిటి.

అక్క : అయ్యో ! వెంటనే కొన్నారు. కొనడమే పనికొచ్చింది. ఆ రాత్రి ఏమయిందో తెలుసా ? వాళ్లింట్లో ఎలక్ట్రిక్ లైట్లన్నీ ఆరిపోయాయి. నిజంగానే ఆరిపోయాయి. లలిత అమ్మ చిమ్నీ దీపం వెలిగించి అటు వంటచేస్తూ ఇటు లలితకి పాఠం చెప్పింది.

చదువు కోండర్రా - మీరు
చదువు కోండర్రా

పరీక్ష లొచ్చాయీ - మనలను
పరీక్ష చేయుటకూ - గనుక ॥చదువు॥

పరీక్ష పేపర్లు - బాగా
పరీక్ష చేయండి.

అర్థము చేసుకొని - మరియు
ఆన్సరు రాయండి - మీరు ॥పరీక్ష॥

ప్యాసవుతారర్రా - మీరు
ప్యాసవుతారర్రా

బాలానందం బా - అల్లూ
బాగా రాస్తేనూ - తప్పక ॥ప్యాసవు॥

చదువు కోండర్రా - మీరు
చదువు కోండర్రా.





# లక్ష్మీప్రసన్నం

పాత్రలు : లక్ష్మీదేవి, సోము, సోముతల్లి, కోడలు, కూతురు

( పక్షుల కిలకిలలు - కోడికూత )

( భూపాలరాగం ఆలాపన )

తెల్లవారెను - కోడి కూసెను
అల్లభానుండుదయ మాయెను
మేలుకో - వత్సా - మేలుకో

( కోడికూత )

అదుగో తెల్లతెల్లవారుతోంది. అరుణోదయ కాంతులు నలుదిక్కులా వ్యాపిస్తున్నాయి. ఇది శుక్రవారం - లక్ష్మీదేవికి ప్రియతమమైన రోజు. తెల్లవారు ఝామున లక్ష్మీదేవి విష్ణులోకంలో బయలుదేరి, తిన్నగా భూలోకానికి వచ్చింది.

( చిన్న విరామ సంగీతం )

లక్ష్మీదేవి ఒక ఊళ్ళో ప్రవేశించింది ఏ ఇంట్లో తాను నిలవడానికి అర్హత ఉందో చూడ్డానికి బయలు దేరింది.

లక్ష్మి : వెడతాను. ముందు ఈ వీధిలోకి వెళ్లి చూస్తాను.

(కాళ్ళ గజ్జెల నడక చప్పుడు)

ఇదేమిటీ ! ఈ వీధి ఇలా ఉంది ! తెల్లవారినా కూడా ఈ వీధిలో ఇంకా ఎవ్వరూ లేవనే లేదే ; వీధి తలుపులు ఒక్కరూ కూడా తెరువ లేదు. వీధంతా ఇంకా నిద్రపోతూ ఉంది. ఎంత అసహ్యంగా ఉంది ! వీధిలో ఆ మురికి కాలువలు, ఆ పెంటపోగులు ఆ ఎంగిలాకులు, ఛీ ఛీ ఛీ ఛీ ఛీ ఛీ....ఇక్కడ కాలు పెట్టడానికేనా అర్హతలేదు. ఇటువంటి వీధిలో ఎలా ఉండగలను ? ఇంకో వీధికి వెళ్ళిపోతా.

( లక్ష్మీదేవి బయలుదేరి ఇంకో వీధికి వచ్చింది. ఇదిగో, ఆ ఇంటి వైపు వెళ్తోంది )

(మువ్వల గజ్జెలు వస్తూన్న చప్పుడు)

లక్ష్మి : ఈ ఇంటి ఇల్లాలు ఇంకా వీధి తలుపే తీయలేదు....వీధి గుమ్మంలో కలకలలాడుతూ ముగ్గేనా పెట్టలేదు !....లోపల ఏం చేస్తోంది ఈ ఇల్లాలు ! కిటికీలోంచి చూస్తాను.

(గురక)

ఆహా ! ఈ ఇల్లాలు ఇంకా ఎలా నిద్రపోతోందో ! గుర్రు పెడుతూ గుర్రుపెడుతూ, పుక్కింట తాంబూలంతో, నోరు తెరిచి, ఒళ్లు మరచి, ఎలా నిద్రపోతోందో ఆ....ఆమె భర్తకాబోలు....పాపం, భార్యకంటే ముందుగా లేచాడు. కాలకృత్యాలు తీర్చుకొని, ఇంటి పని చేస్తున్నాడు....ఈ ఇల్లాలు ఎంత సోమరిపోతు ! నిద్ర, నిద్ర....నిద్ర

ఇటువంటి ఇంట్లో నేనుండలేను.... వెడతాను.... ఇంకో ఇంటికి వెళ్ళి చూస్తాను.

(భూపాళరాగం మేలుకొలుపు)

పగటి పూటను - నిద్రపోయెడి
వారి ఇంటను - లక్ష్మి నిలువదు
మేలుకో - వత్సా.... మేలుకో.

(గజ్జెలు వస్తూన్నచప్పుడు)

అదుగో, లక్ష్మీదేవి ఇంకో ఇంటికి వెళ్ళిచూస్తోంది.

లక్ష్మి : ఈ ఇంటి వీధి తలుపు తీసే ఉంది. ఎవరికీ కనబడకుండా ఈ వీధి గుమ్మంలో నిలబడి చూస్తాను. ఈ ఇల్లు ఎవరిదో ! అది సోమూ ఇల్లు....సోము ఒంటి నిండా ముసుగుపెట్టి, ముఖం కూడా కప్పేసుకొని నిద్రపోతున్నాడు.

(ఠంగ్ ఠంగ్ 8 గంటలు)

లక్ష్మి : ఎనిమిది గంటలు కొట్టినా, ఇంకా లేవలేదు ! అదుగో ఆమె ఎవరో ఇటే వస్తోంది. సోమూ తల్లి కాబోలు....

సో/తల్లి : బాబూ ! సోమూ ! లే లే లే ! ఎనిమిదైంది లే.

సోము : (సిగ్గులా) అబ్బ ! ఉండే ! నన్ను లేపకు - నాకు కోపం వస్తుంది.

సో/తల్లి : నా తండ్రివి కదూ !....లే....ముఖం కడుక్కో,

సోము : (ఏడుపు బద్ధకంగా ఏడుపు) ఊ....ఊ....ఊహూ.

లక్ష్మి : ఆహాహ ! ఏమీ పిల్లవాడు ! పొద్దున్నే ఏడుపు ముఖంతో లేస్తున్నాడు. ఆ పాచిముఖం, ఆ కళ్ళపుసులు, ఆ చింపిరి జుట్టు, ఆ మాసిన బట్టలూ వాడూ, ఎంత అసహ్యంగా ఉన్నాడో.

సోము : (ఏడుపు) అమ్మా....ఉహు-ఊ ఊ....అమ్మా నాకాక లేస్తోంది!
ఊ....ఊ....ఊ....

ఎందుకు బాబూ, అలా ఏడుస్తావ్. వెళ్ళి ముఖం కడుక్కో.

సో/తల్లి : అబ్బ ! నేను ముఖం కడుక్కోను - నాకు ఇడ్లీ కావాలి....
(ఏడుపు) నాకు ఇడ్లీ కావాలీ....కావాలీ....

సో/తల్లి : ఎందుకురా సోమూ ! అలా ఏడుస్తావ్ ? గొంతుకెండిపోతుంది నాయనా !

సోము : (ఏడుస్తూ) అయ్యో....అయ్యో....గొంతుక ఎండిపోతోందే !
కాఫీ కాఫీ కావాలీ....ఇడ్లీ కావాలీ....ఈ ఈ ఈ........

సో/తల్లి : సరే అలాగేలే - ఏడవకు నాయనా....ఇప్పుడే ఇడ్లీ తెప్పిస్తాను....(గట్టిగా) లచ్చి....లచ్చి.

లచ్చి : ఏవండమ్మగోరు ?

సో/తల్లి : నువ్వు వేగంగా హోటలికివెళ్ళి, బాబుకి ఓ నాలుగు ఇడ్లీలు తీసుకురా.

లచ్చి : వీధివాకిలి ఊడుస్తున్నానమ్మా....నీళ్లజల్లి, ముగ్గెట్టి వెడతానమ్మా

సో/తల్లి : ఏడిసినట్టే ఉంది, పిల్లవాడికి ఆకలేస్తూ గొంతుకెండిపోతూ ఉంటే, నీళ్ళు జల్లాలీ ముగ్గెట్టాలీ అంటావేం ?....వెళ్ళు ఆ పని అక్కడుంచేసి వెళ్లు.

**ప్రస్తావన : పాపం లచ్చేం చేస్తుంది ! ఆ చీపురు, ఆ పెంటపోగు, ఆ పేడ నీళ్ల ఆ వీధి గుమ్మంలోనే వదేసి, లోపలికి వెళ్ళింది. ఎందుకూ, ఆ గారాబు కొడుకు సోమూకి ఇడ్లీ తేవడానికి లక్ష్మీదేవి ఇదంతా చూస్తోంది.**

లక్ష్మి : ఆహాహా ! ఏమి ఇల్లాలు ! ఏమి దుడుకు ! ఆ పాచి ముఖాలూ వాళ్లూ ఎలా ఉన్నారో !....చూస్తూ ఉంటే అసహ్యం వేస్తోంది.

ఈ ఇంట్లో, ఇనుపగజ్జెల తల్లి అక్కడ ఉండాలి గానీ, నేనుండ లేను. వెడతాను.

(మువ్వలు వెళ్ళిన చప్పుడు)

ప్రస్తావన : **లక్ష్మీదేవి బయలుదేరింది ... అలాగ వెడుతూ తన మనస్సులో అనుకుంది....**

లక్ష్మి : ఈ సారి నేనొక బిచ్చగత్తె వేషంలో వెడతాను. ధర్మాత్మురాలైన ఇల్లాలు ఎక్కడుందో చూస్తాను. అదుగో, ఆ ఇల్లు ... ఆ పెద్దమేడ.... వెడతాను, ఆ ఇంటికి వెడతాను.

(కొంచెం ఆగి)

అమ్మా....అమ్మా, ఇంటి కోడలమ్మగారూ, ఇంత బిచ్చం పెట్టించండమ్మా.

కోడలు : లేదమ్మా....ఇప్పుడు వీల్లేదు వెళ్ళు.

లక్ష్మి : ఎందుకు వీల్లేదమ్మా....ఇంట్లో సమస్తం ఉండే వీల్లేదా ? ఏమీ లేక వీల్లేదా ?

కోడలు : అదంతా నీకెందుకూ ? వెళ్ళు. అదుగో మా అత్తగారు.

అత్త : ఎవరే వచ్చారూ కోడలా !

కోడలు : ఎవరో ముష్టిది అత్తా ! వస్తే పొమ్మన్నాను.

అత్త : బాగానే ఉంది. నాతో చెప్పకుండా ఎందుకు పొమ్మన్నావ్ ?.... ఒరే లచ్చిగా వెళ్ళి ముష్టిదాన్ని పిలుచుకురా.

లచ్చిగాడు : సిత్తం అమ్మా,

(కొంచెం ఆగి)

ఒచ్చిందమ్మగారూ

అత్త : ఏవిటే అడిగేవు మా కోడలు పిల్లని.

లక్ష్మి : ఇంత బిచ్చం పెట్టమన్నానమ్మా....అంతే.

అత్త : సరే మా కోడలు ఏవిటంది ?

లక్ష్మి : ఇప్పుడు వీల్లేదు, పొమ్మన్నారమ్మా.

అత్త : అదెవరే పొమ్మనడానికీ ? దాని పెత్తనం ఏవిటి ?

లక్ష్మి : (జాలిగా) అమ్మా తమరేనా ఇంత బిచ్చం పెట్టించండమ్మా.

అత్త : బిచ్చం పెట్టడానికి కాదే. అసలు తనెవరూ పొమ్మనడానికీ అంటా ! పెద్దదాన్ని, అత్తగార్ని నేను ఇంట్లో ఉండగా, అదెవర్తే చెప్పడానికీ ? ఇప్పుడు నేను చెప్తున్నాను - ఫో - ఇప్పుడు వీల్లేదు వెళ్ళు.

లక్ష్మి : (జాలిగా) ఇదేవిటమ్మా-చిత్రంగా ఉందే ! పొమ్మని చెప్పడానికి ఎవరైతేనేమమ్మా....ఏమో, ఆమె పొమ్మన్నా మీరు ఏదో పెడతారని కొండంత ఆశతో వచ్చాను. ధర్మాత్ములు, ఏమి ధర్మాత్ములు ! అత్తకు మించిన కోడలు, కోడల్ని మించిన అత్తాను.

**ప్రస్తావన : సరే - లక్ష్మీదేవి బిచ్చగత్తె రూపు మార్చేసి, ఒక ముసలి ముత్తైదువ వేషం వేసుకుంది అలా వెడుతోంది ఒక చిన్న ఇంటి దగ్గరికి వచ్చింది.**

లక్ష్మి : (మనసులో) అహ హ ! ఈ ఇల్లు చిన్నదైనా, ఎంత కలకలాడుతోంది. ఆ ముగ్గులు, గుమ్మానికి ఆ బొట్లు, ఆ గృహాలంకరణ....ఎంత ముచ్చటగా ఉంది ! కన్నుల పండువుగా ఉంది అదుగో, ఇంట్లో తల్లీ కూతురూ ఏదో మాట్లాడుకొంటున్నారు.

## లక్ష్మీప్రసన్నం

తల్లి : అమ్మాయ్ కమలా ! పూజకన్నీ సిద్ధం చేశావా ?

కూతురు : ఇదుగోనమ్మా, అన్నీ సిద్ధంగానే ఉంచాను.

ఇల్లంతా శుభ్రంచేసి, నేను స్నానంచేసి, మంచిబట్టలు కట్టుకొని, పుస్తకాలన్నీ సర్దుకుని, నీకు పూజకి పువ్వులు, గంధం, అగరొత్తులు - అన్నీ సిద్ధంగా ఉంచాను.

తల్లి : వారపు అబ్బాయ్ వచ్చాడా ?

కూతురు : వచ్చాడమ్మా.

తల్లి : సరే, నేను వేగంగా పూజ చేసుకొని, నీకూ, ఆ అబ్బాయికీ వడ్డించేస్తాను. భోజనంచేసి బడికి వెళ్ళవచ్చును.

లక్ష్మి : అహహా ! ఎంత మంచి ఇల్లాలు! ఏమి ధర్మగుణం! భోజనం పెట్టి చదువు ఉచితంగా చెప్పిస్తోంది. తన కూతురుతో సమానంగా చూసుకొంటోంది ఆ అబ్బాయిని. ఈ ఇల్లు చూచినా ఈ ఇల్లాల్ని చూచినా కడుపు నిండిపోతుంది.

వెడతాను. లోపలికి వెడతాను.

**(తల్లి పూజ చేసుకుంటోంది లక్ష్మీదేవి, పెద్ద ముత్తయిదవ వేషంతో లోపల ప్రవేశించింది.)**

కూతురు : అమ్మా, ఎవరో వచ్చారే.

తల్లి : రండమ్మా. కూర్చోండి. ఇలారండి. ఈ చాపమీద కూర్చోండి శుక్రవారం పూట, పొద్దున్నే మహాలక్ష్మిలాగ వచ్చారు. కమలా వారికి బొట్టుపెట్టమ్మా. ఉండండమ్మా ప్రసాదం ఇస్తాను.

లక్ష్మి : మీ ఇల్లు, చూచినా, మిమ్మల్ని చూచినా కడుపు నిండిపోతోంది. సిరిసంపదలు మీ వంటి వారింట్లో ఉంటాయిగాని, ఇతరుల ఇంట్లో ఎలా ఉంటాయి ! లక్ష్మీకరమైన ఇల్లమ్మా. నువ్వు చల్లని తల్లివమ్మా. ఆదర్శ ఇల్లాలివి.

కూతురు : అమ్మా సావిత్రీ, భారతీ ఏదీ ఒక మంచి పాట పాడండీ. ఈ రోజు శుక్రవారం కదూ ! మహాలక్ష్మి మీద ఒక చక్కని పాట పాడండి.

(పాట - లక్ష్మి రావమ్మా మా ఇంటికీ)

తల్లి : ఆశ్చర్యం. ఇంటికొచ్చిన ముత్తైదువ మాయమైపోయింది.

కూతురు : అదిగో సింహాసనంలో లక్ష్మీదేవి విగ్రహం వెలిసింది.

తల్లి : అహహాహ ! లక్ష్మీదేవి ముత్తైదువ వేషంలో మనింటికి వచ్చిందన్నమాట. ఎంత తెలుసుకోలేకపోయాం ! చేతులుజోడించి ఒక నమస్కారమేనా చేయలేదు.

కూతురు : అమ్మా ! మనింట్లో లక్ష్మీదేవి ప్రసన్నం అయిందే ! ఇదిగో విగ్రహంగా మన దేవుడి మందిరంలో వెలిసింది లక్ష్మీదేవి.

తల్లి : ఔనమ్మా, మన ఇల్లు పావనమైంది.





# మాటతప్పితే!

పాత్రలు

తల్లి, కూతురు, కొడుకు, పాపాయి, పక్కింటిపిన్ని, రాజు
మంత్రి, భటుడు, పిల్లలు - తల్లులు - మాంత్రికుడు ఎలుకలు

## రంగము - 1

**తెరలేవగానే ఒక తూగుటుయ్యాలలో పాపాయిని చిన్నక్క పడుకోబెట్టి, ఉయ్యాల ఊపుతూ ఉంటుంది.**

చిన్నక్క : జో అచ్యుతానంద జో జో ముకుందా ! !
లాలి పరమానంద - రామగోవింద -

॥జో జో॥

(పాపాయి ఏడుపు)

ఏడవకు ఏడవకు చిట్టి పాపాయి
ఏడిస్తె నీకళ్ళు నీలాలుకారు

॥జో జో॥

**(ఇంతలో ఎలుకవచ్చి ఉయ్యాలలో తొంగి చూస్తుంది. చిన్నక్క ఎలుకను చూచి భయపడుతుంది. ఎలుక స్టూలుమీద ఉన్న పాలబుడ్డి ఎత్తుకొని పారి పోతుంది )**

తల్లి : (ప్రవేశించి) పాడు ఎలుకలు ఎక్కడ చూచినా ఎలుకలే.

చిన్నక్క : (అమ్మా) భయం వేస్తుందే.

తల్లి : ఏం భయంలేదు. నేనుంటాలే, కూచుని చదువుకో

**(చిన్నక్క పుస్తకం తెరిచి చదువుతుండగా ఎలుకవచ్చి జడ పట్టుకు లాగుతుంది )**

చిన్నక్క : అమ్మోయ్ ఎలక ఎలక !

తల్లి : (లేచి) హూత్ హూత్, అబ్బబ్బ పాడు ఎలుకలు.

అన్న : ఏవిటి అమ్మా ఈ సందడి.

చిన్నక్క : ఎలకలన్నయ్యా ! నా జడ పట్టుకొని లాగేసింది.

అన్న : ఎలకలకు భయవడతారా ! ఫరవాలేదు నేనున్నాగా ! భయ పడకు.

తల్లి : వచ్చావా నాన్నా ! నీకోసమే చూస్తున్నా ! కూచో : మీ ఇద్దరికీ రొట్టెలు కాల్చి ఉంచాను. తెస్తాను.

**(టిఫిను తెచ్చిపెడుతుంది. ఇద్దరు తింటూ ఉండగా రెండు ఎలుకలు వచ్చి చప్పున ఆ టిఫిను ప్లేట్లు ఎత్తుకుపోతాయి)**

ఇద్దరు : బాబోయ్ ఎంతెంత ఎలుకలో ! హూత్ హూత్ !

**(పిల్లిపాలు త్రాగుతూ ఉండగా ఎలుకవచ్చి పిల్లివి బెదిరిస్తే పిల్లి భయపడి పారిపోతోంది.)**

పక్కింటిపిన్ని : ఏవిటి వదినగారూ, ఏవిటి ?

తల్లి : ఎలుకలు. ఎలుకలమ్మా, ఎలుకలు, ఈ ఎలుకల బాధకు చచ్చిపో తున్నాం.

పిన్ని : మీ ఇంట్లో కూడా ఉన్నాయా పాడు ఎలుకలు ? మా ఇంటి నిండా ఎలుకలే.

తల్లి : ఈ ఎలుకలబాధ ఎలా పోతుందో చెపుదూ.

పిన్ని : పదండి. రాజుగారి దగ్గరకుపోయి మొర పెట్టుకుందాం.

తల్లి : మన ఇరుగు పొరుగు వారందరినీ పిలుచుకుని వస్తా.

## రంగము - 2

(రాజుగారు సింహాసనము మీద కూర్చుంటారు. పక్కనే మంత్రి - ఇంకో పక్కన సేవకుడు)

రాజు : మంత్రీ !

మంత్రి : చిత్తం మహాప్రభూ

రాజు : మనరాజ్యంలో ప్రజలందరూ కులాసాగా ఉన్నారా.

మంత్రి : చిత్తం.

(తెరలో మహారాజా మహారాజా కేకలు)

రాజు : సేవకా ! ఆ కేకలు ఎవరివో చూసిరా,

భటు : చిత్తం (వెళ్ళివచ్చి).... మహారాజా ప్రజలు...మన...ప్రజలు.

(ప్రజలు ప్రవేశం)

తల్లి : ప్రభూ దండాలు దండాలు !

రాజు : ప్రజలారా ! ఏమిటి సంగతి ? మీరు వచ్చిన పని ఏమిటి.

తల్లి : మహారాజా ! మా ఇళ్ళలో ఎలుకల బాధ భరించలేకుండా ఉన్నాము.

రాజు : ఎలుకలకు భయపడతారా !

తల్లి : ప్రభూ, అవి సామాన్యపు ఎలుకలు కావు ప్రభూ.

**చిట్టెలుక, చుంచెలుక, చిన్నెలుక, చూరెలుక, పెద్దెలుక, పరునెలుక, పోతెలుక, పందికొక్కు ॥అద్భు॥**

**తాతెలుక, అవ్వెలుక, పాతెలుక, కొత్తెలుక, నల్లెల్లుక, తెల్లెలుక దబ్బెలుక, అబ్బే.**

రాజు : ప్రజలారా ! భయపడకండి.

మంత్రి ! ఎలుకలకు ఎవరైనా భయపడతారా !

రాజు : ఆ ఎలుకే నా దగ్గరికి వస్తే ఈ కత్తితో చంపేస్తా,

**(ఎలుక ప్రవేశిస్తుంది) (రాజు భయపడి సంహాసనం మీదికి ఎక్కిపోతాడు)**
**(ఎలుకలు పారిపోతాయి)**

మంత్రి : మహారాజా, తామే ధైర్యం చెప్పి, తామే భయపడతారా !

రాజు : మంత్రీ ఈ ఎలుకలన్నీ పోయే మార్గమే లేదా ?

మురళి : (ప్రవేశం) లేకేమి మహారాజా ! లేకేమి ?

రాజు : నీ వెవరు ? ఏ దేశం నుంచి వచ్చావు ?

## మాట తప్పితే ?

మురళి : మాది పర్షియా దేశం. మేము మాంత్రికులం. మంత్రం వేస్తాం, తంత్రం చేస్తాం, బాధలు అన్నీ పోగొట్టేస్తాం.

మంత్రి : ఏ ఏ బాధలు పోగొట్టగలవు ?

మురళి : పాము బాధ, తేలు బాధ, జెఱ్ఱిబాధ, చీమ బాధ, సల్లి బాధ, ఎలుకబాధ అన్నీ పోగొట్టేస్తాం.

రాజు : ఆ ! ఎలుకల బాధ కూడా పోగొట్టగలవా ? మా రాజ్యంలో ఎలుకల బాధ ఎక్కువగా ఉంది. ఆ బాధ పోగొట్టగలవా ?

మురళి : జీ సర్కార్ ! అది ఎంత పని ?

మంత్రి : ఎలుకల్ని పోగొట్టడానికి ఏమి తీసుకుంటావు.

మురళి ; మీది ఖుషీమాట చెప్పండి సర్కార్ !

మంత్రి : నువ్వు చెప్పవోయ్.

మురళి : మాది ఒక్కటేమాట. నూరు బంగారు మొహరీలు ఇప్పించండి.

రాజు : నూరు కాదు వెయ్యి మొహరీలైనా ఇచ్చుకుంటాం. ఆ ఎలుకల బాధ పోగొట్టు.

మురళి : నిండా ఖుషీమాట - వెయ్యి మొహరీలు ఇస్తారా ఖరార్ !

మంత్రి : అవునోయ్, రాజుగారి మాట వరహాలమూట. ఊఁ పని ప్రారంభించు, నీ మంత్రం, తంత్రం ప్రారంభించు.

మురళి : సరే చూడండి. ఇప్పుడే చూపిస్తా.

(మురళి ఈల వాయిస్తాడు) సరి గగ్గగగా గమ గరిపా పాప వరిగరి సస సగ్గరిస పిని దావ ధానిరి సా॥

(ఎలుకలు గెంతుకుంటూ లయబద్ధంగా వస్తాయి.) (రాజు, మంత్రి, భటుడూ భయపడుతూ కుర్చీలమీద నిలుచుంటారు మాంత్రికుడు మురళి వాయిస్తూ తెరలోకి వెళ్తాడు.)

(ఎలుకలు-లయబద్ధంగా అడుగులు వేస్తూ వెళ్ళిపోతాయి.)

## రంగము - 3

(నది ఒడ్డు)

(మురళి మాంత్రికుడు పాటతో ప్రవేశం - వాని వెనుకనే ఎలుకలు లయబద్ధంగా గెంతుతూ వస్తాయి మాంత్రికుడు నదిలోకి ప్రవేశిస్తాడు. వెనుకనే ఎలుకలన్నీ నదిలో పడిపోతాయి.)

( తెర )

## రంగము - 4

(రాజుగారి దర్బారు)

భటుడు : (తొందరగా ప్రవేశించి) మహారాజా! ఎలుకలన్నీ చచ్చిపోయాయి!

రాజు : ఆ! అలాగా! సంతోషం సంతోషం, చాలా సంతోషం,

భటుడు : ఆ ఎలుకలన్నీ నదిలో కొట్టుకు పోయాయి మహారాజా.

మంత్రి : మరీ సంతోషము. మురళి మంత్రం బాగా పనిచేసిందే,

రాజు : మంత్రీ! ఇప్పుడు ఆ మాంత్రికుడు బహుమతి కోసం వస్తే ఏమిటి చేద్దాం.

మంత్రి : తమకి తెలియని దేముంది మహారాజా మనపని అయిపోయింది. వాడు మన చేతిలో వున్నాడు.

మురళి : (ప్రవేశించి) మహారాజా ! సలాం సలాం

రాజు : నువ్వెవరివి ?

మంత్రి : నువ్వెందుకు వచ్చావూ ? ఏ పని మీద ?

మురళి : అరె ! బాపురే ! అప్పుడే నన్ను మర్చిపోయారా ? నేనెవరినో తెలియదా ? నేను మాంత్రికుడ్ని ! మీ ఎలుకల బాధ పోగొట్టాను.

రాజు : మంచిది, మంచిది, సంతోషం ?

మంత్రి : ఇక నువ్వు వెళ్లవచ్చు.

మురళి : అరె బాపురే ! నేను పోవాలా ! మాకు ఇస్తానన్న వెయ్యి మొహర్లూ అక్కడ పెట్టండి. నేను నా దేశం వెళ్ళిపోతాను.

మంత్రి : దేశం వెళ్ళిపోతావా ? ఎలుకల్ని చంపడానికి వెయ్యి మొహర్లా ! ఎవరిస్తామన్నారు ?

మురళి : మహరాజా ఇస్తామన్నాడు, మాట ఇచ్చాడు.

మంత్రి : మాట వరుసకంటె అది నిజమా ! రాజుగారి మాట నీటిలోని మూటా ! పోవయ్యా, ఫో,

మురళి : అరె మాట తప్పుతావ్ ! చూసుకో ఏంచేస్తానో ?

రాజు : ఓహో ఏంచేస్తావ్ ? మా ఎలుకలన్నీ చచ్చిపోయాయ్. ఇప్పుడు నువ్వు ఏం చెయ్యగలవు ?

మురళి : మీరు ఏమి పెద్దమనిషీ ! పోనీ నేను అడిగిన 100 మొహర్లు అక్కడ పెట్టు. పోతాం.

మంత్రి : నూరు లేదూ ! గీరూ లేదు. ఇరవై ఇస్తాం, తీసుకొని పోతావా లేదా.

మురళి : (కోపంగా) మహారాజా ! మాట ఇచ్చి మాట తప్పుతారా ? మాట తప్పుతే ఏమవుతుందో తెలుసా.

రాజు : ఏం చేస్తావ్ ? పోరా !

మంత్రి : పోవయ్యా బెదిరిస్తున్నావా ? పో- పో-

మురళి : సరే సరే. పోతాను పోతాను. నా తడాఖా చూపిస్తాను కాసుకో.

( ఫ్లూట్ వేరే ట్యూన్ )

రాజా 1. తల్లి : బుజ్జీ, బాబీ, ఫణీ రండర్రా
మంత్రి 2. తల్లి : ఒరే శంకర్, కల్యాణ్ రండర్రా ఇక్కడికి
భటుడు 3. తల్లి ; లలితా ! చిన్నీ ! మల్లికా- లీలా మేం రాం
4. తల్లి : మే రాం

సుధ : అయ్యో అయ్యో, ఆ మాయల మాంత్రికుడు పిల్లల్ని ఎత్తుకు పోతున్నాడు.

రేణుక : పిల్లలందరూ వాడి వెంట వెళ్ళిపోతున్నారు.

( ప్రవేశం రాజుగారి కొడుకు )

రాజు : అరెరె బాబ్జీ దొరకూడా వచ్చేశాడేం !

మంత్రి : మా బాబుకూడ వచ్చేశాడే !

రాజు : బాబీ వాడితో వెళ్లకు, వెళ్లకు ఇటు వచ్చేయి !

( మేం రాం, మేం రాం )

మాట తప్పితే ?

అందరు : అయ్యో, అయ్యో మోసం మోసం.

మాంత్రికుడు : మాది మోసంకాదు. మీది మోసం.
మీ రాజు మాట తప్పినాడు.

( పిల్లలు గుహలోకి వెళ్ళిపోతారు )

మురళి : ఏయ్ రాజా ! చూశావా ? మాట తప్పితే ఏమయిందో ?

మంత్రి : చూశారా ? మీరాజ్యంలోని పిల్లలందరూ మాయం ఆయిపోయారు.

రాజు : అవును మాంత్రికుడా ! నన్ను క్షమించు.

తల్లులు : మా పిల్లల్ని మాకు తిరిగి ఇప్పించు.... మాంత్రికుడా

రాజు : నీకు వెయ్యికాదు, రెండువేల మొహర్లు ఇచ్చుకుంటాం.

మాంత్రి : మాకు అంత అక్ఖర్లేదు, మేము అడిగింది వంద మొహర్లు అంతే. మా నూరు మాకిస్తే చాలు.

నౌకరు : (ఒక మూటను తెచ్చి ఇస్తాడు.)

రాజు : ఇంద తీసుకో.

మురళి.: (మూట పుచ్చుకొని, మురళీ వాయిస్తాడు.)

(పిల్లలందరు బయటికి వస్తారు)

(తల్లులు పిల్లల్ని కౌగిలించుకుంటారు)

కోరస్ : మాట తప్పితే - ముప్పువచ్చునూ
మాట నిలిపితే - మెప్పువచ్చునూ

(పిల్లలు తల్లులూ అందరూ పాడుతూ వుండగా)

(తెర)




( అశోకుని బహుమతి )

పాత్రలు :

అశోకుడు, సామంతరాజులు - నలుగురు.

పాటలీపుత్ర రాజ్య ప్రతినిధి

చాటింపు :

వినండోహోయ్ - శ్రీశ్రీశ్రీ అశోక చక్రవర్తి మహారాజు గారు రేపటిరోజున పుట్టినరోజు పండుగ చేసుకుంటారండోయ్. ఆ వే చూడ్డానికి దేశదేశాలనుంచి రాజులు, చిన్నచిన్న రాజులు, పెద్ద రాజులు, సామంతరాజులు అందరూ వస్తారండోహోయ్! ప్రజలంద చూడడానికి రావచ్చునండోహోయ్!

## బంగారు కంకణం

**(ఆ మర్నాడు, కోటలో పిండుసభ, అశోక మహారాజుబంగారి పుట్టినరోజు పండుగ)**

సభికులు : శ్రీ శ్రీ శ్రీ అశోకచక్రవర్తి మహారాజులు గారికీ జయీభవ !

అశోకుడు : రాజులారా ! సామంతరాజులారా ! మీ కందరికీ స్వాగతం ! సుస్వాగతం !

అందరూ : జయీభవ ! విజయీభవ ! ఈ పండుగ రోజున చాలా సంతోషము.

ఒకరు : మహాప్రభూ! అశోక చక్రవర్తీ! మీ ఆనందమే మా ఆనందము- మీ వేడుకలే మా వేడుకలు.

అశో : సామంతులారా ! మీ అందరి ఆశీర్వచనమే మాకు శుభము మీ సహాయము లేనిదే యీ రాజ్యాన్నంతటినీ, నే నొక్కడినే నడపలేను కదా ! ఈరోజున మీకు నేనొక గొప్ప బహుమానము ఇవ్వదలచాను.

అంద : మహాప్రసాదము ! మహాప్రసాదము !

అశో : ఇదిగో చూచితిరా ! ఈ బంగారు కంకణములు : మీ అందర్లో ఎవరు గొప్పగా రాజ్యం చేస్తున్నారో, వారికి ఈ బంగారు కంకణములు బహుమానంగా ఇవ్వదలచాను. మీ అందరిలో ఎవరు దీనికి అర్హులో చెప్పగోరుచున్నాను.

1. సామంత : మహాప్రభూ ! తమ ఆజ్ఞ ప్రకారము నేను సువర్ణగిరి రాజ్యాన్ని పరిపాలిస్తున్నాను. నేను నా రాజ్యంనుంచి తమకు బంగారము పంపుచున్నాను. అందరు సామంతరాజులూ పంపేదాని కంటే, మూడింతలు ఎక్కువగా బంగారము నేను పంపుచున్నాను. కాబట్టి అందరికంటే నేనే గొప్పవాడిని.

2. సామ : మహాప్రభూ, నేను ఉజ్జయినీ దేశపురాజుని. నేను చేసిన గొప్పపను లేమిటంటే-నేను రాజ్యానికి వచ్చిన దగ్గర్నుంచి, నా దేశంలోని రాబడిని, రెట్టింపు చేశాను. ఎన్నెన్నో విధాలుగా రకరకాల పన్నులువేసి, ఆదాయం ఎక్కువచేసి ఏలిన వారికి పంపుచున్నాను. అదే నా గొప్ప.

3. సామ : మహాప్రభూ! నేను కోసల దేశపు రాజును. నేను చేసిన గొప్ప కార్యం ఏమిటంటే నేను కళింగదేశపు ప్రజల పొగరు అణగ్గొట్టాను-వాళ్ళని నా చేతిలో కీలుబొమ్మలాగ పెట్టుకున్నాను.

4. సామ : మహాప్రభూ! నేను తక్షశిల రాజ్యానికి ప్రభువును-నేను నా రాజ్యంమీదికి శత్రువులు రాకుండా, తగిన బందోబస్తు చేయించాను. ఎటువంటి బలమైన శత్రువులైనా సరే, నా రాజ్యంవేపు కన్నెత్తి చూడలేరు. అటువంటి ఏర్పాటు చేయించాను. అంతే కాదు. నా రాజ్యంలో ఖర్చులన్నీ చాలావరకు తగ్గించి, ఆదాయం నిల్వ చేశాను.

పాటలీ : మహాప్రభూ; నేను పాటలీపుత్ర రాజ్యం ప్రతినిధిని.

అశో : నీ వేమిచేసితివి ?

పాటలీ : మహాప్రభూ! తక్కిన సామంతులందరూ ఆదాయం ఎక్కువ, ఖర్చులు తక్కువ పెట్టేరు, కానీ, నేను ఇదివరలోకంటే ఇప్పుడు ధనం ఎక్కువ ఖర్చుపెట్టేను, ప్రజలకు పన్నులు తగ్గించాను.

అశో : ధనమంతా ఏల ఖర్చు చేసితివి ?

పాటలీ : పూర్వము ప్రభువులు నిల్వచేసిన ధనం మా ఖజానాలో చాలా వుంది-ఆ ధనం అంతాతీసి ఖర్చుపెట్టాను. ఆ ధనంతో అస్పత్రులు కట్టించాను-బాధపడుతున్న జంతువులకు ప్రత్యేకంగా వేరే ఆస్పత్రులు కట్టించాను. బాటసారులకు ఎన్నో తోటలూ, పార్కులు వేయించాను. పిల్లలు చదువుకోడానికి ఎన్నో బడులు

పెట్టించాను. ఈ విధంగా నిల్వచేసిన ధనం అంతా ఖర్చుచేశాను మహాప్రభూ.

అశోక : సరే ప్రభువులారా. మీరందరూ చేసిన గొప్పగొప్ప కార్యాలు విన్నాను. కాని మీ అందర్లోకీ మొదటి బహుమానము–ఇదిగో, ఈ పాటలీపుత్ర ప్రతినిధికి వస్తుంది.

( చ ప్ప ట్లు )

అశో : మంత్రులారా, సామంతులారా, నాకు ఎక్కువ ధనం బంగారం పంపడం ఒక గొప్పకాదు. దేశంలో ఖర్చులు తగ్గించడం ఒక గొప్పకాదు ప్రజలవద్ద పన్నులు వసూలుచేసి ఆదాయం పెంచడం ఒక గొప్పకాదు.

ఒక ! అయితే అన్నిటికంటే గొప్పయేది మహాప్రభూ.

అశో : ఇదిగోవినండి–తన రాజ్యంలోవున్న ప్రజల్ని సుఖపెట్టేడు. ప్రజల సౌఖ్యమే రాజు సౌఖ్యం - ప్రజల ఆనందమే రాజు ఆనందం–ప్రజల కోసం ఎన్నో బడులు, సత్రాలు దేవాలయాలు, ఆస్పత్రులు కట్టించిన యీ పాటలీపుత్ర ప్రభువు అందరికంటే గొప్పవాడు. ఆతనికి ఇదిగో నా బహుమానము. బంగారు కంకణములు బహుమానము.

( చ ప్ప ట్లు )

అందరు : జేయ్ – అశోక చక్రవర్తికీ జేయ్.

ధర్మ చక్రవర్తికీ – జేయ్.

పాటలీపుత్ర ప్రభువుకీ – జయ్.






పాత్రలు:

ధ్రువుడు, ఉత్తముడు (ధ్రువుని తమ్ముడు),
సునీత (ధ్రువుని తల్లి), సురుచి (ఉత్తముని తల్లి),
ఉత్తానపాదుడు (ధ్రువుని తండ్రి)
నారదుడు, ఇంద్రుడు, విష్ణువు, దేవతలు

## రంగము - 1

(ఉత్తానపాద మహారాజు అంతఃపురంలో ఒకగది. ధ్రువుని తల్లి సునీతి, సునీతి ఎవరికొరకో ఎదురుచూస్తూ వుంటుంది. ధ్రువుడు తల్లి వంక ధ్రువుడు వుంటారు. చూస్తూ వుంటాడు.)

ధ్రువ : అమ్మా! ఇవాళ నాన్నగారు ఇక్కడికి వస్తారన్నావు. ఇంకా రాలేదేమీ? ఎప్పుడొస్తారూ?

సునీతి : ఏమో నాయనా! ఏదో తొందరపని వుండి రాలేకపోయారేమో! వెళ్ళి ఆడుకో.

ధ్రు : అమ్మా! ఇక్కడ నాకేమీ తోచటంలేదే! తమ్ముడు ఉత్తముడు దగ్గరకు వెళ్లి ఆడుకుంటాను.

సు : ఒద్దు నాయనా! అక్కడికి తరుచు వెళ్ళకు.

ధ్రు : ఏవమ్మా? నేనక్కడికి ఎందుకు వెళ్ళొద్దు? నన్ను తమ్ముడు రమ్మన్నాడు.

సు : తమ్ముడు రమ్మన్నాడు గాని, మీ పిన్నమ్మ సురుచీదేవికి ఇష్టం వుండదు నాయనా.

ధ్రు : ఏమీ?

సు : ఏమీలేదు, మీ పిన్నమ్మకి నేనంటే ఇష్టంలేదు. అందుచేత నీ మీద కూడా ఇష్టం వుండదు.

ధ్రు : పిన్నమ్మతో నేను ఆడుకుంటానా ఏవిటి! తమ్ముడితో ఆడుకొని వచ్చేస్తానే. అమ్మా వెళ్తానే!

సు : సరే, ఆడుకొని వేగంగా వచ్చేయ్. ఏం?

ధ్రు : అలాగే. (వెళ్లిపోతాడు)

(తెర)

## రంగము - 2

**(అంతఃపురంలో - ఇంకో గదిలో, సురుచీదేవి, కొడుకు ఉత్తముడు)**

ఉత్తముడు : అమ్మా! నాకు జోడుగుర్రాల బండి చేయిస్తానన్నావు. చేయించవూ?

సురుచి : అలాగే నాయనా. నాన్నగారితో చెప్పి చేయిస్తాలే.

ఉ : అమ్మా ! మాంచి గుర్రబ్బండి, నాన్నగారిలాంటి గుర్రబ్బండి చేయించవూ ?

సురు : అలాగే నాయనా........నాన్నగారు రానీ.

ఉ : అమ్మా ! నాన్నాగారు ఇంకా రాలేదేమీ !

సురు : అదుగో - మాటలోనే వస్తున్నారు.

( ఉత్తానపాదుడు ప్రవేశం )

ఏమండీ - ఇంత ఆలస్యంగా వచ్చారూ ?

ఉత్తాన : ఏమీలేదు, మంత్రిగారితో రాజకీయ విషయాలు మాట్లాడుతూ వుంటే - ఆలశ్యం అయింది. ఏమీ ?

ఉ : నాన్నగారూ ! నాన్నగారూ ! నాకు మాంచి గుర్రబ్బండి చేయించరూ ?

ఉత్తాన : అలాగే నాయనా !....రా....ఇలారా ! నా తొడమీద కూచో, నా బంగారు తండ్రి ! ఏదీ ముద్దు.

( ముద్దు పెట్టుకుంటాడు )

ఉ : నాన్నగారూ ! నా గుర్రబ్బండికి రెండు తెల్లటి గుర్రాలు కొనండేం !

ఉత్తాన : అలాగే నాయనా. కొంటానుగాని, ఆ గుర్రబ్బండీతో ఏం చేస్తావు ?

ఉ : నేనేం....నేను ఆ బండి ఎక్కి చక్కాషికారు వెళ్తాను. ధ్రువుడు అన్నయ్యని కూడా ఎక్కిస్తాను.

సురుచి : ధ్రువుడిని ఎక్కిస్తావా ? వాడి మొహానికి గుర్రబ్బండీ, ఒకటీ !

ఉ : అదేమిటి అమ్మా అలా అంటావు ! ధ్రువన్నయ్య చాలా మంచివాడు.... నాన్నగారూ ! ధ్రువన్నయ్యకి కూడా ఒక బండి కొనరూ ?

ఉత్తాన : అలాగే నాయనా !

ఉ : అదుగో ధ్రువన్నయ్యకూడా ఇక్కడికే వస్తున్నాడు. అన్నయ్యా అన్నయ్యా !.... ఇలారా.

ధ్రు : (ప్రవేశించి) నాన్నగారూ ! ఇక్కడా వున్నారు.

ఉ : అన్నయ్యా ! ఇలారా ! నాన్నగారి ఒళ్లోకూచో. నేను యీ తోడ మీద, నువ్వు ఆ తొడమీదా.

(ధ్రువుడు నాన్నగారి దగ్గరకు వెళ్తూవుంటాడు)

సు : ఏయ్ ! ధ్రువా ! ఎక్కడికి అలాగ !

ధ్రు : నాన్నగారి దగ్గరికి.

సు : వీలులేదు. నువ్వలా దూరంగా నిలబడు !

ధ్రు : ఏమీ ?

సు : ఏమా ? చూస్తున్నావా మీ నాన్నగారి ఒళ్ళో ఎవరు కూర్చు న్నారో ?

ధ్రు : అవును, తమ్ముడు.

సు : ఆ తమ్ముడొక్కడే మీ నాన్నగారి ఒళ్ళో కూర్చోవాలి, తెలుసా ? నువ్వు కూర్చోకూడదు. దూరంగా వుండు.

ధ్రు : తమ్ముడు కూర్చుంటే నేను కూర్చోకూడదా ?

సు : హుం ! నక్కెక్కడ, దేవలోకం ఎక్కడ ?

ధ్రు : అదేమిటమ్మా అలా అంటున్నావు! నీ మాటలు నా కర్థం కావటం లేదు.

సు : ఇదిగో ధ్రువా! చెప్తున్నా విను. నీవు మీ నాన్నగారి తొడమీద కూర్చోడానికి నీకు అర్హతలేదు. తెలుసా?

ధ్రు : ఏమి? తమ్ముడు కూర్చున్నాడే. నే నెందుకు కూర్చోకూడదు?

సు : ఓహో! అధిక ప్రసంగం చేస్తున్నావే!

ధ్రు : అమ్మా! నేనేం చేశాను? నాన్నగారి ఒళ్ళో తమ్ముడు కూర్చున్నప్పుడు నే నెందుకు కూర్చోకూడదు? నేనేమి తప్పు చేశానమ్మా?

సు : తప్పా! నా కడుపున నీవు పుట్టకపోవడమే తప్పు! నువ్వు వేరు, తమ్ముడు వేరు.

ధ్రు : అమ్మా అయితే నాన్నగారు నాకు నాన్నగారే, తమ్ముడికీ నాన్నగారే కదా. నే నెందుకు కూర్చోకూడదు?

సు : ఓహో! పిట్ట చిన్న, కూత ఘనంగా వుందే! నీ వెన్ని చెప్పు, నీకు అర్హత లేదు. అంతే! ఫో!

ధ్రు : అయితే అమ్మా! నాకు అ అర్హత ఎలా కలుగుతుందో చెప్పవూ?

సు : ఎలాగా? ఒచ్చే జన్మలో కలుగుతుంది. మళ్ళీ జన్మలో నీకు అదృష్టం వుండి నా కడుపున పుట్టితే అప్పుడు నీ తండ్రి వొళ్ళో నువ్వు కూర్చుందువు గాని, ఫో! పోయి దేవుడ్ని అలా ప్రార్థించుకో! ఫో!

(ధ్రువుడు అవమానం భరించలేక తండ్రివంక చూస్తూ వెళ్ళిపోతాడు. తండ్రి తల వంచుకుంటాడు)

( తెర )

# రంగము - 3

(సునీతి అంతఃపురం, సునీతి ఏదో పనిచేస్తూ కూర్చొని వుంటుంది ధ్రువుడు దుఃఖంతో ప్రవేశం)

సునీతి : నాయనా ? ధ్రువా : ఎందుకలాగ ఏడుస్తున్నావూ ?

ధ్రు : అమ్మా ! నేనట, నాన్నగారి తొడమీద కూర్చోకూడదట !

సునీతి : ఎవరన్నారూ ! సురుచీదేవా ?

ధ్రు : (ఏడ్పుకంఠంలోనే) అవునమ్మా,

సు : ఏమీ ? ఎందుకు కూర్చోకూడదూ ? ఏమి జరిగిందీ !

ధ్రు : నేనట తన కడుపున పుట్టలేదట. అందుకని నాకు అర్హత లేదట !

సు : పోనీ నాయనా ! వూరుకో, ఏడవకు

ధ్రు : లేదమ్మా, నేనీ ఇంట్లో వుండను, నేను వెళ్ళిపోతాను.

సు : (ఆశ్చర్యంగా) ఎక్కడికీ ?

ధ్రు : అడవుల్లోకి

సు : అయ్యో ! అడవికా ! ఎందుకూ ?

ధ్రు : దేముణ్ని ప్రార్థించడానికి, నాన్నగారి ఒళ్ళో కూర్చొనే అర్హత పొందడానికి.

సు : వెర్రి తండ్రీ ! దీనికోసం అడవుల్లోకి వెడతావా ? ఒద్దు నాయనా ఒద్దు.

ధ్రు : అమ్మా ! నేను నిశ్చయించుకున్నాను. నేను వెళ్ళి దేవుణ్ని ప్రార్థిస్తాను.

సు : నాయనా ! కుఱ్ఱవాడివి, ఒద్దు నా మాట విను, నిన్ను విడిచి నేనుండగలనా తండ్రీ ?

ధ్రు : అమ్మా ! నువ్వెన్ని చెప్పినా సరే ! నాకు జరిగిన అవమానం నేను భరించలేను. నన్ను అవమానిస్తే నిన్ను అవమానించి నట్లు కాదా అమ్మా ! నేనెంతమాత్రం ఈ కోటలో వుండను. నేను అడవుల్లోకిపోయి, దేముడ్ని ప్రార్థించి, నా పౌరుషం నిలబెట్టుకుంటాను.

సు : మంచిది నాయనా. జయమగు గాక.

**( ధ్రువుడు తల్లికి నమస్కరించి వెళ్ళిపోతాడు. )**

**( తె ర )**

## రంగము - 4

**( అ డ వి )**

**( ధ్రువుడు విచారంగా పాడుతూ రాళ్ళు, రప్పలూ, కొండలూ దాటి అడవుల్లోంచి వెళ్తూ వుంటాడు. త్రోవలో నారదుడు కూడా పాడుతూ ఎదురౌతాడు )**

నారద : అబ్బాయీ ! నువ్వెవరు ? ఈ అడవిలో ఒంటరిగా ఎక్కడికి వెళ్ళుతున్నావు ?

ధ్రు : అయ్యా, నన్ను ధ్రువుడంటారు, ఉత్తానపాద మహారాజు గారి పెద్ద కుమారుడిని. అయ్యా ! తమరెవరు ?

నారద : నేను నారదుడిని.... ధ్రువా ! మహారాజు కొడుకువై యుండీ ఈ కాలినడకను ఒంటరిగా ఎక్కడికి వెళ్తున్నావు ?

ధ్రు : నారదా! నా తండ్రిగారు, నా సవతి తల్లి నాకు చేసిన అవమానం భరించలేక, నేను తపస్సు చేయుటకు వెళ్ళుతున్నాను.

నారద : తపస్సా! ఇంత చిన్న వయసులోనా! ధ్రువా! వద్దు వద్దు, నీవు తపస్సు చేయలేవు. గొప్ప గొప్ప మునీశ్వరులే తపస్సు సరిగా చేయలేకపోతున్నారు. నీ వనగా ఎంత? నా మాటవిని, ఇంటికి వెళ్ళి హాయిగా సుఖంగా వుండు.

ధ్రువ : నారద మునీంద్రా! నా ఇంట్లో నాకు గౌరవంలేదు. కాని నాకు పౌరుషం కార్యదీక్ష వుంది. నాకు దేముడు ప్రత్యక్షమైనా గౌరవ స్థానం నాకు ఇచ్చునంతవరకూ నేను పట్టువదలను.

నారద : భేష్ ధ్రువా! నీ ధైర్యానికీ, నీ పట్టుదలకీ మెచ్చాను. నీకు జయమగుగాక! ఇదుగో ఇలారా! నీకు మంత్రోపదేశం చేస్తాను.

**( చెవిలో మంత్రోపదేశం చేస్తాడు )**

ధ్రు : నారద మునీంద్రా! నమస్కారము.

నారద : నీకు శుభమగుగాక! (పాడుకుంటూ వెళ్లిపోతాడు)

**(ధ్రువుడు అక్కడే చెట్టు క్రింద కూర్చుని తపస్సు ప్రారంభిస్తాడు)**

ధ్రు : (మంత్రం) ఓంనమో నారాయణాయ నమః, ఓం నమో నారాయణాయ నమః.

**(ఇలాగ పఠిస్తూ వుండగా తెరలో భూకంపం సూచించే శబ్దం వినిపిస్తుంది)**

దేవతలు : దేవా! మహావిష్ణూ! శరణు శరణు

విష్ణు : దేవతలారా! మీరెందుకు వచ్చారు? ఏమి జరిగింది?

దేవతలు : భూలోకంలో ధ్రువుడని ఒక అయిదేళ్ల కుర్రవాడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడట. ఎన్ని ఆపదలు వచ్చినా, ఎన్ని

కష్టాలు వచ్చినా, వేటినీ లెక్కచేయక, ఓర్చి, ఒకే దీక్ష
తపస్సు చేస్తున్నాడు! ఆ తపోమహిమకి భూమి గజగజ లా
పోతోంది. మా దేవలోకం కూడా కంపించిపోతోంది. గొ
ప్రళయం రాబోతోంది.

విష్ణు : దేవతలారా! భయపడకండి. అది ప్రళయం కాదు. తపోమహి
నేను ధ్రువునికి ప్రత్యక్షమై ఆ తపస్సు మానిపిస్తాను. మీ
వెళ్లండి.

దేవతలు : చిత్తము.

( **భూకంపం శబ్దం, విష్ణువు ప్రత్యక్షం** )

విష్ణు : ధ్రువా! ధ్రువా!

ధ్రువ : (జపం చేస్తూనే వుంటాడు)

విష్ణు : ఆహా! ఎంత దీక్షతో తపస్సు చేస్తున్నాడు! తపస్సంటే ఇ
వుండాలి. దీక్ష అంటే ఇలా వుండాలి....ధ్రువా!

ధ్రు : (కళ్లు తెరిచి) ఎవరు? ఎవరు?

విష్ణు : నేను విష్ణుమూర్తిని, నీ కోరిక నెరవేరుతుంది. లేచి ఇటురా!

ధ్రు : దేవా! నీవా! ఆహా! నా అదృష్టము! దేవా! వందనము!

విష్ణు : ధ్రువా! నీ తపస్సుకి మెచ్చాను. నీ సంగతంతా దివ్యదృష్టి
తెలుసుకున్నాను. నీవు చక్రవర్తివవుతావు, ఎంతో క
రాజ్యంచేసి గొప్ప కీర్తి పొందుతావు. అంతేకాకుండా, నీ కీ
ఎల్లకాలం స్థిరంగా వుండేటట్లు నేను నీకు ఆకాశం మీద కు
అగ్రస్థానం ఇచ్చాను. ఆకాశంమీద ఉత్తర దిక్కున
నక్షత్రమై నీవు అన్ని నక్షత్రాలకంటే ఎక్కువ కాంతితో

ధగ మెరుస్తూ వుంటావు. ఇంక నీ తపస్సు చాలించి నీ ఇంటికి వెళ్ళు.

ధ్రు : దేవా ! వందనము. సెలవు.

(విష్ణువు మాయమవుతాడు. ధ్రువుడు పాడుకుంటూ వెళ్ళిపోతాడు)

( తెర )

# రంగము – 5

( ఉత్తానపాద మహారాజు కొలువులో - రాజు, మంత్రి, ప్రజలు )

ధ్రు : నాన్నగారూ ! నమస్కారము.

ఉత్తముడు : అన్నయ్యా ! వచ్చావా ?

ధ్రువుడు : అవును తమ్ముడూ, వచ్చాను.

ఉత్తముడు : రా అన్నయ్యా ! నాన్నగారి తొడలమీద ఇద్దరం కూర్చుందాము.

ఉత్తాన : రా ధ్రువా ! రా ! నీకు కూడా అర్హత వుంది, రా.

(ధ్రువుడు, ఉత్తముడు తండ్రి తొడమీద కూర్చుంటారు)

నాయనా ! ధ్రువా ! నీ యెడల నేను చేసిన అన్యాయానికి సిగ్గు పడుతున్నాను. ఇకముందు నీవే ఈ రాజ్యానికి చక్రవర్తివి. ఈ అగ్రస్థానము నీదే. ఈ సింహాసనము నీదే. అది దైవాజ్ఞ.

(ధ్రువుడికి పట్టాభిషేకం చేస్తారు. వెనక తెరమీద ధగధగ మెరిసే నక్షత్రం తగిలించి వుంటుంది.)

ధ్రువ మహారాజుకీ జై ! ధ్రువ మహారాజుకీ జై !





# మార్కండేయ

( రంగము : వింధ్యాటవిలో మృకండు మహర్షి - అతని భార్య మరుద్వతి )

మృకండు : దేవీ, ఏమి అలా విచారంగా వున్నావు ?

మరుద్వతి : నాథా ! ఏమి చెప్పేది ? నేను ఎన్నో నోములు నోచాను. ఎన్నో వ్రతాలు చేశాను. కాని ఏమి లాభం?....మనకి సంతానం కలుగలేదు. ఒక్క కొడుకేనా కలుగలేదు.

మృక : దేవీ !....విచారించకు. అన్నింటికీ ఆ పరమేశ్వరుని అనుగ్రహం వుండాలి - పద.... మనం శివునిగూర్చి తపస్సు చేద్దాం - పద....

( తెర )

# రంగము - 2

( తెర ఎత్తగానే ఇద్దరూ ప్రార్థన )

ఇద్దరు : వందేశంభు - ఉమాపతిం - సురగురుం
వందే జగత్కారణం !
వందే పన్నగ భూషణం - మృగధరం
వందే పశూనాం పతిం !
వందే సూర్యశశాంక వహ్నినయనం
వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయంచ వరదం
వందే శివం శంకరం ॥

( శివుడు ప్రత్యక్షం )

శివుడు : మృకండు మహర్షీ ! మరుద్వతీ ! మీ భక్తికి చాలా మెచ్చాను. ఇంక మీ తపస్సు చాలించండి. మీ కిష్టమైన వరాన్ని కోరుకోండి!

మృక : దేవా ! మహేశ్వరా ! మాకు సంతానములేదు. మాకు పుత్ర సంతానము కలుగునట్లు వరము ప్రసాదించు ప్రభూ !

శివుడు : సరే, మీరు కోరిన ప్రకారము మీకు ఒక సుపుత్రుడు కలుగుతాడు.

ఇద్దరు : మహాప్రసాదము. దేవా ! ధన్యులము.

శివుడు : కాని, ఒక సంగతి, మీకు కలుగబోయే కుమారునకు పదహారు సంవత్సరములే ఆయుష్షు.

మృక : అయ్యో ! దేవా ! అంతేనా !

శివుడు : అవును. పదహారు సంవత్సరములే ఆయుష్షు. ఈ పదహారు సంవత్సరాలలో మీ కుమారుడు గొప్ప కీర్తి పొందుతాడు.

( శివుడు మాయ మవుతాడు )

# రంగము - 3

( మృకండుడు, మరుద్వతి, కొడుకు మార్కండేయుడు )

మార్క : అమ్మా ! ఏమి అలా విచారంగా వున్నావు ?

మరు : ఏమీలేదు నాయనా !

మార్క : అదిగో, నువ్వూ విచారంగానే వున్నావు, నాన్నగారూ విచారంగానే వున్నారు. ఎందుకో చెప్పవూ ?

మరు : ఏం చెప్పేది నాయనా ?

మార్క : పోనీ, నాన్నగారూ, మీరేనా చెప్పరూ ?

మృక : నాయనా ! మార్కండేయా ! రేపటితో నీకు పదహారు సంవత్సరాలూ పూర్తి అవుతాయి.

మార్క : అయితే యేం నాన్నగారూ ! రేపు నా పుట్టినరోజు పండుగ కదూ ?

మృక : (ఏడుస్తూ) నాయనా ! రేపు నీ పుట్టినరోజైనా అదే నీకు ఆఖరు పుట్టినరోజు,

మార్క : అంటే ? ఏమిటి నాన్నగారూ ? చెప్పరూ ?

మృక : నాయనా, రేపటితో నీకు ఆయుష్షు సరి.

మార్క : అదేమిటి నాన్నగారూ అలాఅంటారు ? నేను చచ్చిపోతానా ?

మృక : అవును నాయనా ! రేపే నీ ఆఖరు రోజు.

మార్క : అయితే నాన్నగారూ, రేపు నేను చచ్చిపోతానని మీకు ఎలా తెలుసు ?

మృక : నాయనా ! మార్కండేయా ! అది శివుని ఆజ్ఞ ! వరం ప్రకారం నీకు పదహారేండ్లే ఆయుష్షు. రేపటితో పదహారేళ్లూ పూర్తి అవుతాయి. రేపు నీవు మమ్మల్ని విడిచి వెళ్ళిపోతావు.

మార్క : అలాగా నాన్నగారూ ! అయితే మరణానికి తిరుగులేదా ?

మృక : లేదు నాయనా. అది శివుని ఆజ్ఞ.

మార్క : నాన్నగారూ ! మనందరికీ దేవుడు శివుడేకదా ! మనం శివ భక్తులం కదా ! అటువంటిది నన్ను శివుడే పుట్టించి, వేగంగా చంపేస్తాడా ? లేదు నాన్నగారూ, నేను ఇప్పుడే వెళ్ళి ఆ ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తాను. సెలవు.

## రంగము - 4

(శివుని గుడిలో మార్కండేయుడు శివలింగాన్ని పూజిస్తూ వుంటాడు)

మార్క : ఓ పరమేశ్వరా ! నీవే నన్ను పుట్టించేవు. నీవేనన్ను పుట్టించి, ఇంత త్వరలో నీవే నన్ను చంపడం నీకు ధర్మమా ? లేక లేక నా తల్లిదండ్రులకు పుత్ర సంతానం కలిగించావు. ఇంతలోనే వారికి పుత్రశోకం కలిగించడం ధర్మమా ? నిన్నే నమ్మేను - నీవే నాకు దిక్కు.

"శివశివ శంభో - హరహరశంభో
శివశివ శంకర - హరహర శంభో" ॥శివ॥

(తెర)

# రంగము - 5

## (యమలోకంలో యమధర్మరాజు కొలువులో)

యముడు : చిత్రగుప్తా ! భూలోకంలో ఈ రోజుతో ఎవరెవరి ఆయుష్షు పూర్తి అవుతోందో చూసి చెప్పు.

చిత్రగుప్త : చిత్తం యమధర్మరాజా ! (పుస్తకం చూసి) మహాప్రభూ ! ఈరోజు పూర్తిగా ఆయుష్షునిండి చనిపోవువారు 16,375 మంది.

అర్ధాయుష్షుతో చనిపోయేవాడు ఒక్కడే ఉన్నాడు మహాప్రభూ !

యముడు : ఆ అర్ధాయుష్షు వాడెవడు ?

చిత్ర : వింధ్యాటవిలో మృకండుమహర్షి కొడుకు మార్కండేయుడనే కుర్రవాడు. నేటితో వానికి పదహారేళ్ళు పూర్తి అవుతాయి.

యముడు : సరే కింకరులారా !

కింకరులు : చిత్తము దేవా !

యముడు : మీరు వేర్వేరు దిక్కులకుపోయి, యీ రోజు చనిపోవు వారి ప్రాణాల్ని తీసుకురండు.

కింక : చిత్తం దేవా !

(తెర)

# రంగము - 6

## (ఈశ్వరుడి గుడిలో)

మార్క : "శివశివశంభో ! హరహరశంభో
శివశివ శంకర ! హరహరశంభో ||శివ||

మార్కండేయ

కింక : మార్కండేయా ! ఇంక రా ! ఈ రోజుతో నీ ఆయుష్షు పూర్తి అయింది. ఇక రా.

మార్క : ఎవరదీ ?

కింక : మేమూ ! యమ కింకరులం,

మార్క ! నేనురాను, మీరు వెళ్ళండి.

కింక : నువ్వురాక తప్పదు. నువ్వు రాకపోతే నిన్ను పట్టికట్టి తీసుకు పోతాం, ఇదుగోచూడు.

మార్క : (గంటవాయిస్తూ)

"శివశివ శంభో - హరహర శంభో
శివశివ శంకర - హరహరశంభో"

కింక : అమ్మో అమ్మో ! అమ్మో !

( యమకింకరులు నొప్పితో కేకలేస్తూ పారిపోతారు )

( తెర )

## రంగము - 7

### ( యమలోకంలో )

యము : కింకరులారా ! ఏమి ? ఉత్తచేతుల్తో తిరిగి వచ్చేరు ?

కింక ; యమధర్మరాజా ! ఆ మార్కండేయుడు శివాలయంలో శివలింగం దగ్గర కూర్చున్నాడు. మేం రమ్మంటే రానన్నాడు.

యము : ఆ ! రానన్నాడా ! మీరు బలాత్కారంగా తీసుకురాలేక పోయారా ?

కింక : మహాప్రభూ ! మేం ఆ మార్కండేయుడి దగ్గరికి వెళ్ళేసరికి అక్కడ శివలింగంలోంచి ఏదో గొప్ప తేజస్సు వచ్చింది ! మేం అతని దగ్గరకేనా వెళ్ళలేకపోయాం.

యము : ఆ ! అలాగా ! సరే, నేనే స్వయంగా వెళ్ళి ఆ ప్రాణాన్ని తీసుకొస్తాను.

( తె ర )

# రంగము - 8

**(శివుని గుడి. యముడు ఎనుబోతు నెక్కి, చేతులో పాశం పట్టుకొని మార్కండేయుడున్న గుడిలోకి వస్తాడు.)**

మార్కం : (గంట వాయిస్తూ)

శివశివ శంభో - హరహర శంభో
శివశివ శంకర - హరహర శంభో॥

యము : మార్కండేయా ! మార్కండేయా

మార్క : శివశివ శంభో - హరహరశంభో
శివశివ శంకర - హరహర శంభో

యము : (కోపంతో) ఓహో ! రావు కదూ ! నేనెవరినో తెలుసా ? యమధర్మరాజుని. నన్ను ఈ ప్రపంచంలో ఎవ్వరూ తప్పించుకోలేదు. నువ్వనగా ఎంత ? రా !

మార్క : (పాట) శంభో ! శంభో ! హరహర శంభో !
కానగ రావా ! కరుణానిలయా
ప్రోవగ రావా ! భక్తపోషణా ॥శం॥

అపరాధంబుల నేమిజేసితిన్
అకార మరణంబేలా శంభో !
నిన్నె నమ్మితి - కేలన్‌బట్టితి
శరణు శరణు ఓ శంభో శంకర ॥౪౦॥

యము : సరే, రావు కదూ ! ఇదుగో కాలపాశం వేస్తున్నా కాచుకో.

(పెద్ద శబ్దం : శివుడు ప్రత్యక్షం)

శివుడు : ఆగు ! ఆగు ! యమధర్మరాజా ! ఆగు, మార్కండేయుడు గొప్ప భక్తుడు. నా శరణుపొందేడు. వానికి చావులేదు. నీవు వెళ్లిపో ! (యముడు వెళ్ళిపోతాడు)

శివుడు : భక్తా ! మార్కండేయా. యముడు పోయేడు. ఇక నీకుభయము లేదులే. నీ భక్తికి చాలా మెచ్చేను. నీవు ఎల్లప్పుడు పదహారేళ్ళ బాల కుమారుడవై చిరంజీవివై యుందువుగాక !

మార్క : దేవా ధన్యుడను.

( తెర )





# ప్రహ్లాద

(పాత్రలు)

ప్రహ్లాదుడు, హిరణ్యకశ్యపుడు (ప్రహ్లాదుని తండ్రి), లీలావతి (ప్రహ్లాదుని తల్లి), చండామార్కుడు (ప్రహ్లాదుని గురువు), బడిపిల్లలు, నరసింహావతారం

## రంగము - 1

(హిరణ్యకశ్యప మహారాజు కోటలో - రాజకుమారులు ఆడుకునే బొమ్మలగది. ప్రహ్లాదుడు ఒక విష్ణుమూర్తి బొమ్మను పట్టుకొని ప్రవేశం)

ప్రహ్లాద : ఆహా, నారదుడు తాత ఇచ్చిన ఈ బొమ్మ ఎంత బాగుందో! దేవుడు అంటే ఇలాగే కాబోలు ఉంటాడు! ఈ బొమ్మదేవుడే

ప్రహ్లాద

ఇంత బాగున్నప్పుడు, అసలు నిజమైన దేవుడు ఇంక ఎంత బాగుంటాడో !

హిరణ్య : (ప్రవేశం) ప్రహ్లాదా ! ప్రహ్లాదా ! ఏం చేస్తున్నావిక్కడ ?

ప్రహ్లాద : ఏమిలేదు నాన్నగారూ, ఆడుకుంటున్నాను.

హిర : ఆ చేతిలోని దేమిటి ?

ప్ర : ఇదా ? – ఇది దేవుడుబొమ్మ.

హిర : ఏ దేవుడూ ?

ప్ర : విష్ణుమూర్తి బొమ్మ !

హిర : (కోపంతో) విష్ణువు గిష్ణువు !

ప్ర : అయ్యో ! అలా అనకూడదు నాన్నారూ ! ఇదీ – శ్రీ మన్నారాయణమూర్తి బొమ్మ.

హిర : ఇదిగో ! నీ కెన్నిసార్లు చెప్పేది ! ఇటువంటి బొమ్మతో నువ్వాడుకో కూడదు. ఈ బొమ్మ అవతల పారేయ్ ! నీకు మరొక మంచి బొమ్మ ఇస్తాలే.

ప్ర : అమ్మో ! ఈ దేవుడు బొమ్మ పారేయడమే ! ఇంత మంచి బొమ్మ ఇంకెక్కడేనా దొరుకుతుందా ?

హిర : ఇదుగో ! ప్రహ్లాదా ! నా మాట విను. నువ్వు ఆ బొమ్మతో ఆడుకోకూడదు. ఆ బొమ్మ పేరైనా తలచకూడదు. తెలిసిందా !

ప్ర : హరి హరీ ! ఎంతమాట !

హిర : అదుగో ! వొద్దన్నపని మళ్ళీ చేస్తున్నావు కదూ ! జాగ్రత్త ! ఈ సారి నువ్వు ఆ దేవుని పేరు ఎత్తితే ఏం చేస్తానో చూసుకో !

ఓహోహో, తండ్రిని కూడా ఎదిరించడం నేర్చుకుంటున్నావే, (అంటూ కోపంగా వెళ్ళిపోతాడు).

(ప్రహ్లాదుడు భయంగా తండ్రివంక చూస్తూ ఏడుస్తాడు)

(లీలావతీదేవి ప్రవేశం)

ప్ర : అమ్మా! అమ్మా! నాన్నగారు కోప్పడ్డారే!

లీలా : అవును నాయనా! ఆ దేవుడు బొమ్మతో ఆడుకోవద్దనీ, దేవుడి పేరెత్తొద్దనీ మీ నాన్నగారంటారు. నువ్వు మానవు. నేనేం చెప్తాను చెప్పు నాయనా!

ప్ర : అదికాదే అమ్మా! నాన్నగారికీ, ఆ విష్ణుమూర్తికీ ఎందుకు పడదూ?

లీలా : పోనిద్దూ! ఆ సంగతంతా ఇప్పుడెందుకూ? మీ నాన్నగారు చెప్పినట్లు నువ్వు నడుచుకోవాలి. అంతే, లేకపోతే వారికి కోపం వచ్చి, ఎంతపనేనా చేస్తారు. అంచేత, వారు వొద్దన్నపని మనం చేయకూడదు, ఇక ముందు ఆ దేవుడి పేరెత్తకు! తెలిసిందా? మా నాయనవు కావూ! నా మాట వినవూ!

ప్ర : అలా అయితే మరీ, నారదుడు తాత ఎప్పుడూ దేవుని మీద పాటలే పాడమని ఎందుకు చెప్పేడూ? దేవుడు మంచివాడు కదూ?

లీలా : దేవుడు మంచివాడే నాయనా, కానీ, మీ నాన్నగారికీ ఆ దేవుడికి పడదు. అంచేత నువ్వు ఆ దేవుడి ప్రసంగం మానెయ్యాలి.

ప్ర : దేవుడిమీద పాటలంటే నా కెంతో సరదాగా వుంటుందే అమ్మా! దేవుడిమీద పాటలు పాడుకోవద్దూ?

ప్రహ్లాద

లీలా : ఒద్దు నాయనా! నాన్నగారికి తెలిస్తే కోప్పడతారు.

ప్ర : అబ్బ పాడుతానే.

లీలా : సరే అయితే ఎవ్వరికీ వినిపించకుండా నీ మనస్సులో మెల్లిగా పాడుకో! ఏం?

ప్రహ్లా: (సంతోషంగా) అలాగే! అలాగే!

నారాయణ భజనంబు ధరలో
సారంబె సరిగా........

(ప్రహ్లాదుడు హరిమీద మెల్లగా పాడుతూ వుంటాడు)

(తెర ప్రక్కనుంచి హిరణ్యకశ్యపుడు వింటూ వుంటాడు)

హిరణ్య : (ప్రవేశిస్తూ) లీలావతీ! లీలావతీ! చూశావా ఈ దుర్మార్గుడు!

లీలా : ఎవరు ప్రభూ?

హిర : ఎవరేమిటి? మన ప్రహ్లాదుడు!

లీలా : ఏమీ? ఏంచేశాడు?

హిర : ఇంకేం చెయ్యాలి! నాకు శత్రువైన దేవుడు మీద పాట పాడు తున్నాడు.

లీలా : ఆ! ఆ! ఒద్దు పాపం! చెయ్యి చేసుకోకండి. కుర్రాడు కదూ! కొన్నాళ్లకి వాడే మానేస్తాడు.

హిర : లీలావతీ, నీకేమీ తెలియదు! నువ్వూరుకో! వాడిని బాగా కొడితేనేకాని వాడికి బుద్ధిరాదు.

లీలా : అలా కొట్టి తిట్టేకంటే వాడిని ఏదేనా బడిలో పడేసి చదివించ కూడదూ? అలా చదువులో పడితే ఈ ధ్యాస లేకుండా వుంటుంది.

హిర : ఔను- అదీ ఒక మంచి ఆలోచనే. సరే అయితే వీడిని చండ
మార్కుల బడిలో వేస్తాను.

( తెర )

## రంగము - 2

**(చండామార్కుల బడి. పిల్లలందరూ గోలచేస్తూ వుంటారు. ప్రహ్లాదుడు కూడా వుంటాడు ఇంతలో గురువుగారు చేత్తో బెత్తం పట్టుకొని ప్రవేశిస్తారు)**

అందరూ : గురువుగారూ ! నమస్తే.

గురువు : ష్! గోల చేయకండి. కూర్చోండి....అందరూ బడికి వచ్చారా

అందరూ : వచ్చామండి.

గురు : సరే. ఈ రోజున మీకు ఒక కొత్త పాఠం చెబుతాను ''ప్రభువు''ని గురించి పాఠము వినండి. ప్రపంచములో అందరికంటే ముఖ్యుడు మన ప్రభువు. మన ప్రభువు పేరే హిరణ్యకశ్యపుడు.

**(ఇంతలో మొద్దబ్బాయి పలక చేత్తో పట్టుకొని, జేబులోని చేగోడీలు తింటూ మెల్లగా ప్రవేశిస్తాడు.)**

గురు : ఔరా ! నువ్వు ఇప్పుడా వస్తున్నావు ! ఈ రోజు ఆలస్యంగ వచ్చావేమి ?

మొద్ద : (ఏడుస్తూ) మా ఇంట్లో.... మా ఇంట్లో

గురు : ఏమిటి ! ఏమిటి జరిగింది మీ ఇంట్లో ?

మొద్ద : మా పిల్లికూన పారిపోయిందండీ !

గురు : పిల్లికూన పారిపోతే నీకేం! వేషాలు! ఊఁ, గుంజీలు తియ్యి!

(బడికి ఇంకెప్పుడూ ఆలస్యంగా రాను! అంటూ పది గుంజీలు తీస్తాడు.)

ఊఁ ఇక వెళ్ళి నీ స్థలంలో కూచో. ఎవర్రా! ఇందాక ఏ పాఠం చెబుతున్నానూ ?

ఒకడు : "ప్రభువును" గురించి.

గురు : అవునవును, ప్రపంచంలో అందరికన్నా పెద్దవారెవరు? పేరు చెప్పండి.

మొద్దు : మా అమ్మమ్మండి.

గురు : ఛా! నిన్నడగలేదు, ప్రహ్లాదా నువ్వు చెప్పు.

ప్ర : ప్రపంచ మందరికీ ప్రభువు దైవమండి.

గురు : అలాగనకూడదు. మనలనందర్నీ పోషిస్తున్నవారు మీ నాన్న గారు. వారే అందరికన్నా గొప్పవారు.

మొద్దు : నన్ను మా అత్తయ్య పోషిస్తున్నదండి. అందరికంటే మా అత్తయ్యే గొప్పది. నాకు చేగోడీలు కూడా ఇచ్చింది. (అంటూ జేబులోని చేగోడీలు తీసి చూపిస్తాడు)

గురు : ఒరేయ్ మొద్దబ్బాయీ! నిన్ను ప్రశ్న వేయందే నువ్వెందుకు చెప్తావు? బడికి చేగోడీలు తెచ్చావా! నిలుచో! గోడకుర్చీ వేసి నిలుచో! నీకు అదే శిక్ష!

(మొద్దబ్బాయి గోడకుర్చీ నిలుచుంటాడు)

గురు : ఇదుగో పిల్లలూ! ఈ రోజున హిరణ్యకశ్యప మహారాజు గారేమో మన బడికి వస్తారట. పరీక్షచేస్తారు. మీ రందరూ అల్లరి చేయకుండా ఇందాక చెప్పిన పాఠం బాగా చదువుకోండి. నేను అంగడికివెళ్ళి కూరలూ అవికొనుక్కొని ఇప్పుడేవచ్చేస్తాను.

పిల్లలు : అలాగేనండి.

**( గురువుగారు వెళ్ళిపోతాడు )**

మొద్దు : హమ్మయ్య ! కాళ్ళు నొప్పులు పెట్టేశాయి ! ఇంక చక్కా ఈ చేగోడీలు తినొచ్చు.

అందరూ : నాకో ముక్క ఇయ్యవూ ! (గోల)

**( మొద్దబ్బాయి చేగోడీలు పంచుతాడు )**

ఒకరు : ఓరేయ్ గురువుగారు వచ్చే వేళయింది. ఇందాక చెప్పినపాఠం చదువుకోవద్దూ.

ఇంకొకరు : ఎన్నడూ పాఠాలేనా ? హాయిగా పాడుకుందాం. ప్రహ్లాదా నువ్వు మొన్న పాడిన పాట ఎంతో బాగుంది. అది మాకు నేర్పవూ.

ప్ర : ఓ ! నేను ముందు పాడతాను. మీరందరూ వెనక పాడండి.

( పా ట )

నారాయణ హర - హర గోవిందా
గోవిందా హర - గోవిందా
గోవిందా హర గోవిందా
నారాయణ హర గోవిందా ॥నారా

(అందరూ పాడుతూ వుంటారు)

గురువు : (కంగారుగా ప్రవేశించి) పిల్లలూ ! అయ్యో ! కొంప మునిగింది. రాజుగారొస్తున్నారు. కూర్చోండి.

**( పిల్లలు పాట ఆపేసి కూర్చుంటారు )**

ఇదుగో ! హిరణ్యకశ్యప మహారాజుగారొస్తున్నారు.
ఇందాక చెప్పిన పాఠం జ్ఞాపకం వుందా ?

పిల్లలు : బాగా జ్ఞాపకం వుందండి.

గురు : అదుగో వచ్చేశారు. స్వాగతం స్వాగతం! హిరణ్యకశ్యప రాజ చంద్రమా, స్వాగతం!

(హిరణ్యకశ్యపుడు ప్రవేశిస్తాడు)

హిర : గురువర్యా! మా ప్రహ్లాదుడు మీరు చెప్పిన విద్యను బాగుగా నేర్చుకొంటున్నాడా?

గురు : చిత్తము.

హిర : ఇప్పుడు ఆ హరీ గిరీ అన్న మాటలు అనడం లేదుకద!

గురు : లేదు మహాప్రభూ! ఇప్పుడు ఆ మాటే పూర్తిగా మరచి పోయాడు.

హిర : సంతోషము. కుమారా! ప్రహ్లాదా. ఇటు రా. ఈ నాటికైనా నీకు బుద్ధి వచ్చినందుకు సంతోషము. నీవు ఈ గురువుగారి వద్ద ఏమి నేర్చుకొంటున్నావు?

ప్ర : చదువులలోని సారమంతా నేర్చితిని నాన్నగారూ!

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖ్యశాస్త్రంబులునే
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల జదివితి దండ్రీ.

హిర : భేష్! ఏదీ, నీవు చదివినదేదో వినిపించు.

(ప్రహ్లాదుణ్ణి చనువుగా దగ్గరకు తీసుకుంటాడు)

ప్ర : తండ్రీ! ఇదుగో, విను.

(పద్య) హరియను రెండక్షరములు
హరియించును పాతకంబు....

హిర : (ఆశ్చర్యం. కోపంతో ప్రహ్లాదుని దూరముగా త్రోసి)ఆ, ఏమిటీ విపరీతము! ఏమయ్యా ఇదా నీవు నేర్పిన విద్య! ఛో! నీ ఉద్యోగం తీసివేశాను! ఛో!

గురు : ప్రభువులవారు మన్నించాలి. నేను........

హిర : చాలు నీ చదువు! ప్రహ్లాదా! ఇంటికి పద. నీ హరి గిరి రోగం వదలగొడతాను.

(కోపంగా ప్రహ్లాదుడి చెయ్యి పట్టుకొని తెరలోనికి వెళ్తాడు)

( గురువుగారు వణుకుతూ నిలుచుంటారు. తెర )

## రంగము - 3

(హిరణ్యకశ్యపుని మందిరం, హిరణ్యకశ్యపుడు, భార్య),

హిర : హు: నేటితో తేలిపోవాలి! కన్నతండ్రి అయిన నన్ను ఎదిరిస్తాడా! వీడి పని పట్టిస్తాను.

లీలా : ప్రభూ! కన్నకొడుకుని అన్ని బాధలు మీరు పెట్టడం బాగాలేదు, ఇంకా పసివాడు.

హిర : దేవీ! నీ మాటలు కట్టిపెట్టు! పసివాడట. అయితే అంత మూర్ఖత్వమా? అంత పట్టుదల! వాడిని ఏమి చేసినా ఆ హరి నామము వదలటంలేదు. వాడిని కొట్టించేను, కొండలమీద నుండి పడదోయించాను! ఏనుగులచేత త్రొక్కించాను, ఎన్ని చేసినా చీమకుట్టినంత బాధేనా వాడికిలేదు, రోజుకి రోజు వాడికి ఆ హరి పిచ్చి ఎక్కువై పోయింది.

లీలా : ఏమో! నిజంగా ఆ శ్రీహరే వాడిని రక్షిస్తున్నాడేమో.

హిర : అదుగో! నీకు కూడా మతిపోయిందా ఏమిటి! నువ్వు కూడా మొదలెడుతున్నావ్ హరీ గిరీ అని!

లీలా : అదికాదండీ ! ప్రహ్లాదుడు........(ఏడుస్తుంది)

హిర : చాల్లే, వాడికోసం నువ్వు ఏడుపు కూడాను ! నా శత్రువుని కొలిచే వాడు నాకు ఉండే కంటె చస్తే.... సేవకా !

సేవకు : చిత్తం మహాప్రభూ !

హిర : చూడూ ! ఓ గిన్నెలో విషంపోసి తీసుకొనిరా !....ఆ ప్రహ్లాదుడిని కూడా పిలు.

లీలా : అయ్యో ! ఎంతపని ! రాజా ! సొంత కొడుకుని విషం పెట్టి చంపుతారా ! ఎంత ఘోరము ! (ఏడుపు)

(సేవకుడు విషపు గిన్నె తెస్తాడు. ప్రహ్లాదుడు కూడా వస్తాడు)

ప్ర : పితాజీ, నన్నెందుకు పిలిపించారు.

హిర : విషం త్రాగుతే ఏమవుతుందో తెలుసా ?

ప్ర : ఆ తెలుసు, అది తాగుతే మనుష్యులు చనిపోతారు.

హిర : సరే తాగు ! నీ హరీ నీ గిరీ తెలుసుకొస్తుంది.

ప్రహ్లా : పితాజీ ! నన్నెందుకింత పరీక్ష చేస్తారు ? విషమైనా త్రాగుతాను కాని, వారి నామస్మరణ మాత్రం మానను.

ప్రహ్లా : (పాట) నారాయణ హర హర గోవిందా
గోవిందా హర - గోవిందా - (త్రాగును)

హిర : ఆశ్చర్యం ! విషం త్రాగినా వీడు చనిపోలేదు ! ఇదేదో మాయగా వుంది. ప్రహ్లాదా ! ఆఖరిసారి అడుగుతున్నాను. ఆ హరిని తలంచడం మానవూ ?

ప్రహ్లా : నాన్నగారూ ! ఆ శ్రీహరికంటె ఎక్కువ ఎవరు చెప్పండి ! నాకు మీకు అందరికీ ఆ శ్రీహరి దిక్కు.

హిర : (కోపంతో) ఓహో ! నాకుకూడా పాఠం నేర్పుతున్నావా ? ఏడిరా నీ హరి ! ఎక్కడున్నాడో చెప్పు ! వాడి పని పట్టిస్తాను.

ప్ర : ఇక్కడా అక్కడా అని ఏమిటి ?

క. ఇందుగల డందులేడని
సందేహము వలదు- చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
అందందే గలడు దానవాగ్రణి వింటే !

హిర : ఆ ! అలాగయితే ఈ స్తంభంలో చూపించు చూద్దాం

ప్ర : ఓ ! తప్పకుండా !
నారాయణ హర హర గోవిందా
గోవిందా హర గోవిందా

**(హిరణ్యకశిపుడు స్తంభాన్ని తన గదతో కొడతాడు స్తంభం పగిలి నరసింహావతారం ప్రత్యక్షం)**

నర : హిరణ్యకశ్యపా ! నేటితో నీపని సరి, నిన్ను చంపుటకే ఈ అవతారం ఎత్తాను.

హి : ధన్యుడ్ని ! ధన్యుడ్ని. హా ! (చనిపోతాడు)

నర : ప్రహ్లాదా : నీ తండ్రి ఈ హిరణ్యకశ్యపుడు మరణించాడు. ఇంక నీదే ఈ రాజ్యము.

ప్రహ్లా : నాది కాదు దేవా ! అంతా ఆ శ్రీహరిదే,

( నారాయణ భజన. )

( తెర )

# రేడియో అక్కయ్య



# ఇతర రచనలు



# బొమ్మల కొలువు

చిట్టి చిట్టి చెల్లాయిలూ, తమ్ముళ్లూ !

పిల్లలకు, పెద్దలకు ముఖ్యమైన పండుగ దసరా వస్తోంది. మును పటి రోజుల్లో ముఖ్యంగా గ్రామాల్లో, ఉపాధ్యాయులు పిల్లలకు దసరా పద్యాలు నేర్పి, పిల్లల్ని ఆ ఊరి పెద్దల ఇళ్లకు తీసుకువెళ్లి, దసరా పద్యాలు పాడించేవారు. పిల్లలు చక్కగా ముస్తాబై, కొత్త బట్టలు తొడుక్కొని, చేతిలో బాణాలు (విల్లంబులు) పట్టుకొని, వీధుల్లో దసరా పద్యాలు పాడుకుంటూ వరుసలు వరుసలుగా వెడుతూ ఉంటే, చూడ ముచ్చటగా ఉండేది. ఆ ఇంటి పెద్దలు గురువులకు కట్నాలు, పిల్లలకు పప్పు బెల్లాలు ఇచ్చి, ఆశీర్వదించి పంపేవారు. ఆ రోజులే వేరు, ఆ వేడుకలే వేరు! ఈ రోజుల్లో మీ కెవరికీ ఆ దసరా పద్యాలూ రావు, ఆ వేడుకలూ సన్నగిల్లాయి.

## బొమ్మల కొలువు

మా చిన్నతనంలో మేము పెట్టుకునే బొమ్మల కొలువులు వేరు. ఆ రోజుల్లో ఈ కాలపు రకరకాల బొమ్మలేవీ ఉండేవికావు. మా అమ్మ చేసి ఇచ్చిన తాటాకు బొమ్మలు, చందనం బొమ్మలు, గాజు బొమ్మలు, మట్టితోచేసిన రంగుల బొమ్మలు, వాటినే ఒక చిన్న కొలువుగా పెట్టు కొనేవాళ్లం, రాను రాను బొమ్మల పరిశ్రమ అభివృద్ధి చెందాక, రక రకాల బొమ్మలు - ఏటికొప్పాక బొమ్మలు, కొండపల్లి బొమ్మలు, తిరుపతి చందనం బొమ్మలు, మైసూరు దంతపు బొమ్మలు - ఒకటేమిటి, దూదిబొమ్మలు, స్పాంజి బొమ్మలు, ప్లాస్టిక్ బొమ్మలు, పూసల బొమ్మలు ఎన్నెన్నో వచ్చాయి.

అయితే రోజులు మారాయి. రోజులతోపాటు బొమ్మల కొలు వులు అమర్చడంలో కూడా మార్పులు వచ్చాయి. ఈ రోజుల్లో ప్రతి పిల్లా, తల్లీకూడా చేత్తో తయారుచేసే వస్తువులు ఎన్నెన్నో నేర్చుకుంటు న్నారు. అది ఒక కళ. బజార్లో కొన్న వస్తువులకంటే మనం సొంతంగా తయారుచేసే బొమ్మలకు ఎంతో విలువ. బొమ్మలంటే కేవలం ఒక బొమ్మలే కాదు. రంగు రంగుల పూసలతోను, ప్లాస్టిక్ నైలాన్ దారాల తోను, సన్నటి తీగెలతోను మనకు ఉపయోగపడే రక రకాల పువ్వులు, బ్యాగులు, బుట్టలు, సజ్జలు చూడముచ్చటగా అల్లుతున్నారు. అవన్నీ ఒక కొలువుగా పెడితే, ఎంత నిండుగా ఉంటుందో ఆలోచించండి!

ఇంకా సుమారు నెల పదిహేను రోజులు వ్యవధి ఉంది కనుక, కొత్త కొత్త రకాల బొమ్మల తయారీ నేర్చుకొని, చక్కని కొలువును ఏర్పాటు చేయండి. నేను మీ అందరి ఇళ్లకూ వచ్చి, మీ కొలువును చూడలేను కదా! అందుకని, మీరు ఏ విధంగా కొలువు పెట్టారో, నాకు వివరంగా రాస్తే సంతోషిస్తాను.

మీ ఉత్తరాల కొరకు నేను ఎదురుచూస్తున్న.

మీ

'బాలక్కయ్య'




చిట్టిచిట్టి చెల్లాయిలూ, తమ్ముళ్లూ !

మీ కందరికీ బడులు తెరిచారుగా ! మీ రందరూ కొత్త క్లాసులోకి వచ్చారు. అప్పుడే మీ రందరూ కొత్త పుస్తకాలు కొనుక్కోవడం, వాటికి చక్కగా అట్టలు వేసుకోవడం, ఎంతో హడావిడిగా ఉంటున్నారు. అయితే ఒక సంగతి. ఇప్పుడు పరీక్ష పాసై, కొత్త క్లాసులోకి వచ్చి, ఎంత సంతోషంగా ఉన్నారో, ఆ మాదిరిగానే ఈ సంవత్సరం అంతా కూడా ఉండాలి. మీరు ఏరోజు పాఠాలు ఆరోజు శ్రద్ధగా చదువుకోని, ఇచ్చిన హోంవర్కు ఎప్పటికప్పుడు చేసుకొని, క్లాసులో మంచి మార్కులు తెచ్చుకోవాలి. ప్రతిరోజూ వేళకు తప్పక బడికి వెళ్ళాలి. ఈ మంచి అలవాట్లు ప్రతి తమ్ముడికీ, చెల్లాయికీ చాలా అవసరం.

ఇంకో సంగతి మీరు గుర్తుంచుకోవాలి. ఏమిటంటే- మీకు బడిలో క్లాసు టైమ్‌టేబుల్ ఇస్తారుగా ! ఈ క్లాసు టైంటేబుల్ మీకు

ఎంత ముఖ్యమో, ఇంటి దగ్గర మీ దినచర్య టైంటేబుల్ అంత ముఖ్యం. దీని ప్రకారంగా మీరు ఇంటిదగ్గర ఏ వేళకు చేయవలసిన పని ఆ వేళకు క్రమం తప్పకుండా, శ్రద్ధగా చేసుకుంటే, అది ముందు ముందు మీ జీవితంలో ఎంతో లాభిస్తుంది.

మీకు తెలియడానికని ఒక టైంటేబుల్ మాదిరికి రాస్తున్నాను.

ఉదయం: 6 గంటలకు నిద్రలేచుట. 6 గంటలనుండి 7 గంటల వరకు కాల కృత్యములు తీర్చుకొనుట.

7 గంటలనుంచి 8-30 వరకు క్లాసు పాఠాలు. హోంవర్కు చూచుకొనుట.

8-30 నుంచి 9 గంటల వరకు భోజనం, తరువాత బడికి వెళ్ళుట.

సాయంత్రం: 4 గంటలకు బడినుంచి వచ్చాక -

కాళ్ళూ చేతులు, ముఖము కడుగుకొని స్కూలు డ్రెస్సు వదిలి, ఇంటి దుస్తులు వేసుకొని పాలో, ఫలహారమో తీసుకొనుట.

5 గంటలనుంచి 6-30 వరకు బయట ఆడుకొనుట, లేదా బాలానంద సంఘానికి వెళ్ళి, బాలల పత్రికలు చదువుట.

7 గంటల నుంచి 8 గంటలవరకు పాఠాలు చదువుకొనుట, 8 గంటల నుండి 9 గంటలవరకు భోజనం, విశ్రాంతి. ఇది ఒక రకమైన ఇంటి టైంటేబుల్.

ఆదివారం సెలవురోజున ఇంటి శుభ్రత, ఎక్కడ వస్తువు లక్కడ నీటుగా సర్దుకొనుటలో అమ్మకు సహాయపడాలి. సాయంత్రం స్నేహితులతో గాని, అమ్మా నాన్నతోగాని, ఎక్కడికైనా వెళ్ళి ఆనందించాలి. అప్పుడే మీ శరీరారోగ్యము, మానసిక ఆరోగ్యము బాగుంటుంది.

సరే - ఈ సంగతి ఇలా ఉండనీయండి. ఈ మధ్య మన గోపీ ఎక్కడా కనబడ్డంలేదు! ఎందుకు రావడం లేదా అని వారింటికి కబురు చేశాను. చేస్తే, తెలిసిన విషయం ఏమిటంటే - బడులు తెరవగానే, గోపీ తన పాత పుస్తకాలను ఒక అబ్బాయికి అమ్మేసి, ఆ వచ్చిన డబ్బుతో వీధిలో అమ్మే ఈగల మిఠాయి, బెల్లంతో ఉడికించిన దుంప ముక్కలు, పీచుమిఠాయి, ఇంకా ఏవేవో కొనుక్కొని తిన్నాడు ఏమైందీ? గోపీకి జ్వరం వాంతులు కడుపునొప్పితో చాలా బాధపడ్డాడు. వాళ్ళమ్మ వెంటనేవెళ్ళి డాక్టరికి చూపించింది. డాక్టరు పరీక్షచేసి, 'ఇదంతా అజీర్తివలన వచ్చింది. వీధిలో ఏవేవో చిల్లరతిళ్ళు కొనుక్కొని తిన్న ట్టున్నాడు. ఇంకా నయం, అబ్బాయిని వెంటనే తెచ్చారు గనుక సరి పోయింది. లేకపోతే ప్రమాదమే' అన్నాడు.

గోపీ తానుచేసిన తప్పు తెలుసుకొని "ఇంకెప్పుడూ ఈగల మిఠాయి కొనుక్కొని తినను" అని ఏడుస్తూ చెప్పాడు. డాక్టరు గోపీని సముదాయించి, మందులిచ్చి వెళ్ళిపోయాడు.

ఇప్పుడు గోపీ ఆరోగ్యంగానే ఉన్నాడు. రేపో ఎల్లుండో ఇక్క డికి వస్తాడేమోలెండి, ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, మీ రందరూ కూడా ఇంట్లో అమ్మకీ నాన్నకీ తెలియకుండా వీధిలో చిల్లరతిళ్లు కొనుక్కొని తినకండేం? గోపీలాగ బాధపడవలసి వస్తుంది. మీ రెప్పుడూ ఆరో గ్యంగా ఉండాలి. ఆరోగ్యమే మహాభాగ్య మన్నారు పెద్దలు. మీకు కూడా తెలుసు.

మళ్ళీ వచ్చే నెల కలుసుకుందాం!

మీ

'బా ల క్క య్య'



# బాలానంద సంఘాలు

చిట్టి చెల్లాయిలూ, తమ్ముళ్ళూ !

మొదట ఏమో అనుకున్నాను, కాని మన తెలుగు పిల్లలు నా పేర ఎన్నో ఉత్తరాలు రాసారు. నాకు ఎంతో పండుగలా ఉంది.

రాజమండ్రిలో శ్రావణ మంగళవారం నోము, వరలక్ష్మి వ్రతం, చేసుకున్న చెల్లెలు సరోజినికి నా పువ్వుల కానుక. జి. వి. రమణారావు, (విజయనగరము) పి. వి. దుర్గాబాయి (క్రిప్రో, సింధురాష్ట్రము) లక్ష్మి నర్సాబాయమ్మ (గుడివాడ) మన "బాలానందం" నంఘాన్ని గురించి రాసారు. వారికే కాకుండా మీ అందరికీ కూడ "బాలానందం" అని సంఘం పెట్టడం ఇష్టమే అని అనుకుంటాను. సరే - పేరు పెట్టేము. ఇంక మీరు చేయవలసిన దేమిటి ? తెలుసా ? ఈ సంఘంలో మీరు మెంబర్లుగా చేరాలి. అందుకు ఒక చిన్న షరతు, అది ఏమిటంటే -

బాలానందంలో చేరే మెంబర్లు 15 సంవత్సరాలకు లోపు వాళ్ళే ఉండాలి. మీరు ఒక్కొక్కరు ఒక అణా చొప్పున పంపాలి, పంపితే మీ పేరు రిజిష్టరు చేసి మీకు ఒక చిన్న పువ్వు పంపుతాం. ఆ పువ్వు మీరు పెట్టుకోవాలి. ఆ పువ్వు తగిలించుకోడంతో సరిపోదు. మీరు కొన్ని కొన్ని పనులు చెయ్యాలి.

1. మీ ఊళ్ళో కూడా చిన్నచిన్న బాల సంగతులు, కబుర్లు, వార్తలు వాళ్ళు చెప్పాలి. అందరూ కలిసి ఏదేనా మంచిపని చేసి ఆ సంగత మాకు తెలియజేయాలి.

2. మీ ఊళ్ళో బాగా చదువుకున్న పెద్దవాళ్ళ దగ్గరికి వెళ్ళి వాళ్ళని ప్రశ్నలువేసి అన్ని సంగతులు తెలుసుకోవాలి. ఇంకో చిన్న సంగతి.

మీకు "సంఘం" ఎలా పెట్టాలో తెలియకపోవచ్చు. మీఅన్నల్ని మీ అక్కల్ని అడిగితే వాళ్ళు తప్పక సహాయం చేస్తారు.

"బాలానంద సంఘం పెట్టి ఒక పుస్తకంలో మీరు ఎవరెవరు చేరుతారో వారిపేర్లు వ్రాసుకొండి. తరువాత మీరు చేస్తున్న మీటింగులు మంచిపనులు ఆ పుస్తకంలో రాయాలి. ఏఏ సంఘాలు ఎలాగ పనిచేస్తున్నాయో - నాకు రాసి పంపుతే, ఆ వివరాలు మన "బాల"లో వేయిస్తాను.

ఈ నెలలో మీరు చేయవలసిన పనేమిటో తెలుసా ?

మీరందరూ, సంఘాలు స్థాపించి, ఒక జట్టుగా ఏ నెలవురోజునో ఇంటింటికీ వెళ్ళి, ఇళ్ళు శుభ్రంగా వున్నాయో లేదో చూడాలి. ఇళ్ళు శుభ్రంగా లేకపోతే ఆ ఇంటివారికి మీరు సహాయంచేసి ఇల్లంతా శుభ్రపరచాలి. ఒంటి శుభ్రత యెంత ముఖ్యమో ఇంటి శుభ్రత కూడా అంత ముఖ్యము.

ఇక వుంటాను.

"అక్కయ్య"